# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

సంపుటి : 51 సంచిక : 4 399 మే-2023 పేజీలు 52 వెల : 20/- రూ॥లు

నల్లగౌను పోలీసూ?
తిప్పి తిప్పి
నువ్ వాళ్ళు చదవమన్న
తీర్పు చదివి
కళ్ళు తుడుచుకుంటే
పోయిన మా నెత్తుటి ముద్దుబిడ్డ
డానియల్ ప్రశ్న నీకెరుకవుతుందా?

భూమిని మాట్లాడనివ్వు
సత్యమేదో సూరీడు
ప్రకటిస్తాడు.





# ఈ పుస్తకాలు చదివారా?




అలివివల కథా సంపుటి ఉదయమిత్ర పరిణత కథా కంఠస్వరాన్ని వినిపిస్తోంది. కవిగా, నాటకకర్తగా, అనువాదకుడిగా చిరపరిచయమైన ఉదయమిత్ర ఆ ప్రక్రియల్లో కంటే కథల్లో ఎక్కువ కృషి చేశారు. పాలమూరు జనఘోషను మానవీయంగా, కాల్పనికంగా, విప్లవ దృక్పథంతో కథల్లోకి తీసుకొచ్చారు. ఆదివాసులు ఆయన కథా పాత్రధారులు కావడం యాదృచ్ఛికం కాదు. గతంలో రాసిన కథల్లోనూ, ఈ సంపుటిలోనూ ఆదివాసులు, పీడితులు, తమ సహజ సౌందర్యంలో, జీవేచ్ఛతో, పోరాటచేవతో కనిపిస్తారు. కథలు చాలా సరళంగా, క్లుప్తంగా, లోతైన అర్థాలతో చెప్పడం ఆయన ప్రత్యేకత. ఈ సంపుటిలోని కథలు ఈ కాలపు జీవన సంఘర్షణనంతా ప్రతిఫలించాయి. మనం జీవిస్తున్న రోజులను అర్థం చేసుకోవడానికి తప్పక చదవాల్సిన కథలివి.

**అలివివల**

ఉదయమిత్ర కవిత్వం ప్రచురణ: పాలమూరు అధ్యయన వేదిక

వెల: 100/- రూ॥ పేజీలు: 152 ప్రతులకు: 8919650545

వంద సంవత్సరాలలో సంఘ్ పరివార్ ఆడిన అబద్ధాలు, వ్యాపింపజేసిన విష, విద్వేష ప్రచారం, అన్ని వ్యవస్థలనూ లోలోపలి నుంచి తొలిచివేస్తూ చేసిన విధ్వంసం, చేసిన అక్రమాలు, మారణకాండలు.. ఆ చరిత్ర వివరంగా రాయాలంటే కొన్ని వందల పేజీల పుస్తకమైనా సరిపోదు. ఆ వివరాలన్నీ ఈ పుస్తకంలో చదువరులకు సులభంగా అందిస్తుంది. ఆర్ఎస్ఎస్ ఎంత దుర్మార్గమైన భావజాలాన్ని ఈ సమాజంలో వ్యాపింపజేస్తున్నదో, దాని పరివారంలోని అనేక సంస్థలు ఆ విచ్ఛిన్నకర, విష, విద్వేష రాజకీయాలను ఎలా ముందుకు తీసుకుపోతున్నాయో, ఆ రాజకీయ ఆచరణలో వాళ్లు ఎటువంటి సంఘవిద్రోహకరమైన, అమానుషమైన, మానవతా వ్యతిరేకమైన పనులు చేస్తున్నారో ప్రజల దృష్టికి తేవడమే ఈ పుస్తక రచన లక్ష్యం.




**కాషాయ సారం**

సంఘ్ పరివార్ సిద్ధాంతం, నిర్మాణం, ఆచరణ

ఎన్ వేణుగోపాల్ ప్రచురణ: వీక్షణం, మలుపు బుక్స్

వెల: 100/- రూ॥ పేజీలు: 88 ప్రతులకు: 9848577028




సుధా భరద్వాజ్ జైలు నుంచి విడుదయ్యాక బయటి నుంచి ఈ ప్రపంచాన్ని ఎలా చూస్తున్నారో, దాన్ని మనకెలా పరిచయం చేస్తున్నారో తెలుసుకోడానికి వాసు రాసిన ఈ దీర్ఘకవిత చదవాలి. తనకెన్నడూ పరిచయం లేని వ్యక్తితో, అనుభవం లేని భావోద్వేగాలతో వాసుకు ఈ మమేకత ఎలా కలిగిందా అని విస్తుపోయేంత ఎత్తులోంచి, లోతుల్లోంచి, సాన్నిహిత్యంలోంచి, చివరికి మన అంతరంగాల్లోంచే సుధ తరపున ప్రేమతో మనతో సాగిస్తున్న కవితామయ సంభాషణ ఇది. వస్తువును కవి వ్యక్తిగతంగా మార్చగలిగే దృక్పథ బలమే ఇదంతా. ఈ దృక్పథ తెరచాప పాఠకులను సుధతో పాటు సహఖైదీలందరి దగ్గరికి, వేలాదిమంది సాధారణ అమాయక ఖైదీల జీవితాల దగ్గరికి, జైలుగా మారిపోయిన ఈ దేశంలోని మారుమూలల అంచుల్లోకి మనన్ని తీసుకెళుతుంది.

సుధ ఒక్కరే కాదు, దేశంలోని జైళ్లలో, బైటా బందీలై ఉన్న మానవులందరి సమున్నత కంఠస్వరాన్ని వినిపించగల పరిపక్వ, తాత్విక, కాల్పనిక గొంతుకను ఈ కవితలో మీరు తప్పక వింటారు. మనతో సుధ మాట్లాడుతున్న ఈ సందర్భమెంత రోమాంచితమో, పోరాటమయమో మానవీయమో.. ఎరుక కలిగించే కవిత ఇది.

**ప్రేమతో మీ సుధ** (కవిత్వం)

వాసు దీర్ఘకవిత ప్రచురణ: విరసం

వెల: 50/- రూ॥ పేజీలు: 55

ప్రతులకు: 9247253884

VPVHOZA101






సంపుటి : 51 ◆ సంచిక : 4 ◆ మే 2023 ◆ వెల : రు. 20/-

సంపాదకీయం

# ఎండమావి ప్రజాస్వామ్యంలో ఎన్ని వాకపల్లెలో...

- పి. వరలక్ష్మి

వాకపల్లి ఆదివాసీ మహిళలపై గ్రేహౌండ్స్ పోలీసులు అత్యాచారం చేసిన కేసులో పదహారేళ్ల తర్వాత తీర్పు వెలువడింది. ఊహించిన విధంగానే సాక్ష్యాధారాలు లేని కారణంగా కోర్టు ఈ కేసును కొట్టేసింది. నేరం చేసింది, నేరాన్ని విచారించింది, సాక్ష్యాలను సేకరించింది ఒకే పక్షం వారైనప్పుడు ఇంతకన్నా భిన్నంగా ఏమీ జరగదు. అయితే తీర్పు చెప్పేటప్పుడు విశాఖ ఎస్సి ఎస్టి కోర్టు ఒక మాటన్నది. అన్యాయం జరిగిన మాట వాస్తవం, విచారణ సరిగ్గా జరగనందువల్ల సరైన ఆధారాలు లభించని కారణంగా నిందితులను శిక్షించలేకపోతున్నాం అని. ఎంతో క్షోభకు గురైన బాధితులకు నష్టపరిహారం చెల్లించాలని కూడా కోర్టు చెప్పింది. ఇక ఉద్దేశపూర్వకంగా విచారణను నీరుగార్చిన అధికారులపై చర్యలు తీసుకోవాలని ప్రభుత్వానికి సిఫారసు చేయడం మరో అంశం. ఇటీవలి తీర్పులు చూస్తే అన్యాయం జరిగిందని కోర్టు ఒప్పుకోవడం కూడా ఎంతో కొంత విజయం అనుకోవాల్సిన దుస్థితి. ఎందుకంటే న్యాయం కోసం కోర్టుకుపోతే తప్పుడు ఆరోపణలు చేశారంటూ ఆగ్రహించి బాధితులనే శిక్షించిన ఉదంతాలున్నాయి. అదలా ఉంచితే వాకపల్లి తీర్పు కొన్ని కీలక ప్రశ్నల్ని లేవనెత్తింది.

నేరస్తులను శిక్షించలేకపోతున్నాం అని న్యాయస్థానమే నిస్సహాయతను వ్యక్తం చేశాక ఇక బాధితులకు రక్షణ ఎక్కడ? ముఖ్యంగా పోలీసులు ప్రజల మీద అఘాయిత్యాలు చేసినప్పుడు ప్రజలకు రక్షణ ఎలా? ఇది ఒక్క వాకపల్లి సందర్భంలోనే కాదు, భద్రతా బలగాల దురాగతాల మీద మణిపూర్ తల్లుల నగ్న నిరసన, ఇరోం షర్మిల ఆమరణ నిరాహార దీక్ష దగ్గరి నుండి పలు సందర్భాల్లో చర్చకు వస్తూనే ఉంది.

దళితులు, ఆదివాసులు, మతమైనారిటీలు బాధితులై, నిందితులు అగ్రకుల, అధికారబలం గలవాళ్లైనప్పుడు పోలీసులను, కోర్టులను సులభంగా ప్రభావితం చేయగలుగుతారు. 'అందరూ నిర్దోషులైతే మరి దళితుల్ని చంపిందెవరు' అన్నది కీలవేణ్మని నుండి చుండూరు దాకా సమాధానం లేని ప్రశ్న. ఈ కేసులన్నీ కోర్టు దాకా రావడానికే బాధితులు ఎన్ని కష్టనష్టాలకోర్చి ఉంటారో చెప్పడానికే అలివికాదు. చట్టాలు, న్యాయవ్యవస్థ బాధితుల వద్దకు వెళ్లవు. నిందితుల నుండి దాడులను, బెదిరింపులను ఒంటరిగా ఎదుర్కోవాల్సిందే తప్ప వారికి రక్షణ ఉండదు. చివరికెలాగో న్యాయస్థానాల దాకా వచ్చినా అవి తలుపులు మూసుకుంటాయి.

ఏరోజూ పట్నం మొహం ఎరగని, భాషకూడా తెలియని ఆదివాసీ స్త్రీలు ఏ న్యాయం కోరి దేశాన్నంతా కదిలించి సుప్రీం కోర్టుదాకా పోయారు? ఈ క్రమంలో వారు ఇంటా బయటా ఎంత పోరాటం చేశారో, ఆ పదకొండుమందిలో ఇద్దరు మహిళలు మానసిక వేదనను భరించలేక అన్నం ఉగ్గబట్టి ఎలా చనిపోయారో, పాలివ్వలేక బిడ్డను కోల్పోయిన మహిళ ఎంత నరకయాతన అనుభవించిందో విన్నాం. ఏ పరిహారం వారి నష్టాన్ని పూడుస్తుంది? అత్యాచారం చేసిన వాళ్లను ఉరితీయాలి, ఎన్‌కౌంటర్ చేయాలి అని ఆవేశాలను రెచ్చగొట్టే మీడియా ఇప్పుడు సుతిమెత్తగా మాట్లాడుతున్నదేమిటి? పోలీసులకు ప్రశ్నించవీలులేని అధికారాలుంటాయని నమ్ముతున్నారా?

అన్నింటికన్నా ముఖ్యమైన ప్రశ్న ఏమిటంటే ఎక్కడో అడవిమూల తమ బతుకు తాము బతుకుతున్న ఆదివాసీల మీదికి పోలీసు బలగాలు ఎందుకు వెళ్లాయి అని. దానికి వాకపల్లి అసలు కథ ఏమిటో గుర్తుచేసుకోవాలి. 1999లో 2 వేల ఎకరాల అడవుల్లో విస్తరించిన ఉన్న బాక్సైట్ నిక్షేపాలను తవ్వితీసుకునేందుకు ప్రభుత్వం ఒక మల్టీనేషనల్ కంపెనీతో ఒప్పందం కుదుర్చుకుంది. ఆ గనుల పరిధిలోని 265 ఆదివాసీ గ్రామాల్లో వాకపల్లి ఒకటి. ఆ పల్లెలన్నీ బాక్సైట్ తవ్వకాలకు వ్యతిరేకంగా పోరాడుతున్నాయి. అందువల్ల అక్కడ స్కూలు పిల్లల దగ్గరినుండి ముసలివాళ్లదాకా నక్సలైట్లకు సహకరిస్తున్నారంటూ నిత్యం పోలీసుదాడులను ఎదుర్కొంటారు. అటువంటి దాడుల్లో భాగమే 2007 ఆగస్టు 20 ఘటన. 1999లో చంద్రబాబు ప్రభుత్వం పెట్టుబడిదారులతో ఒప్పందం కుదుర్చుకుని అక్కడి నుండి ఆదివాసులను ఖాళీ చేయించేందుకు దాడులు మొదలుపెడితే 2007లో వైయస్ రాజశేఖరరెడ్డి అధికారంలో అది కొనసాగి వాకపల్లి అత్యాచారం జరిగింది. ఆదివాసులను ఖాళీ చేయించే ప్రయత్నాలు కొనసాగుతూనే ఉన్నాయి.

ఎక్కడైనా పోలీసుల అత్యాచారాలు వారి వ్యక్తిగత నేరాలు కావు. అవి రాజ్యహింసలో భాగం. అత్యాచారాలను అణచివేత సాధనంగా ప్రయోగిస్తున్న పితృస్వామిక సంస్కృతిలో భాగం. పోలీసులు అక్కడ ప్రభుత్వం అప్పగించిన పని చేస్తున్నారు. అందువల్లే వారి విధులకు ఎటువంటి ఆటంకం కలగకుండా ప్రభుత్వం చూసుకుంటుంది. వాకపల్లి కేసులో ఎ1 ముద్దాయి రవికుమార్ పదోన్నతి కూడా పొందాడంటే అర్థం చేసుకోవచ్చు. ఛత్తీస్‌గఢ్ ఆదివాసీ హక్కుల కార్యకర్త సోనీసోరిని దారుణమైన లైంగిక హింసకు గురిచేసిన పోలీసు అధికారిని ఏకంగా

(మిగితాది 7వ పేజీలో...)

సంచిక - 399




**ఎడిటర్**

అరసవిల్లి కృష్ణ

**వర్కింగ్ ఎడిటర్**

పి. వరలక్ష్మి

**కవర్ డిజైన్**

సృజన శ్రీను

**రచనలు పంపవలసిన చిరునామా :**

ద్వారకా నగర్, విద్యాధరి స్కూలు వెనక,
మల్లేలమ్మ గుడి దగ్గర, కొర్రపాడు రోడ్డు
ప్రొద్దుటూరు -516360, కడప జిల్లా.

* email : **arunatara1977@gmail. com**

**Like Page:**

//viplava rachayitala sangahm arunatara

**facebook :**

//viplava rachayitala sangahm virasam

Virasam website :

**www. vasanthamegham.com**

చందాలు, విరాళాలు పంపవలసిన చిరునామా

**అరసవిల్లి కృష్ణ**, 6-1/16-7ఎ/1, పెద్దిరాజు స్ట్రీట్, ప్రైజర్‌పేట, విజయవాడ-520001.

చెక్‌లు / డ్రాఫ్టులు / ఆన్‌లైన్‌లో పంపడానికి

A. Krishna, Bank : State Bank of India, A/c. No. 52018355595, IFSC : SBIN0020714,
Branch : Vagu Center, Vijaywada.

అరుణతార చదవండి!
చదివించండి!
చందాదారులు కండి!

విడి సంచిక వెల - రు. 20; సంవత్సర చందా - రు. 240;
రెండు సంవత్సరాల చందా - రు. 450; మూడు సంవత్సరాల చందా - రు. 680;
ఐదు సంవత్సరాల చందా - రు. 1100; దశాబ్ది చందా - రు. 2200/-

# ఈ సంచికలో

## వసంతమేఘం వెబ్ పత్రికలో

vasanthamegham.com

**ఏప్రిల్ 1, 2023**

**సంపాదకీయం**

'రాహుల్ వాదం' వినిపించాల్సిందేనా - పాణి

**సమీక్షలు**

బహిరంగ ప్రకటనే రాజ్యధిక్కారం (ఇబ్రహీం నిర్గున్ కవిత్వం) -అరసవిల్లి కృష్ణ

ఆకాశమార్గాన్ని గురిచూస్తున్న విల్లంబులు (ఫెలో ట్రావెలర్ కవిత 'అడవి-రోడ్డు') -డానియల్

**పరిచయం**

సహదేవుని రక్త చలన సంగీతం -వంగల సంతోష్

**వ్యాసాలు**

కార్పొరేటీకరణ, సైనికీకరణ-హక్కుల ఉల్లంఘన -చిలుకా చంద్రశేఖర్

మానని గాయమూ, తీరని ఆగ్రహమూ వాకపల్లి.. -పద్మకుమారి

అక్కడ డానియల్ ఉన్నాడు -సంఘర్ష్

నిబద్ధ విమర్శకుడు కెవిఆర్ -డాక్టర్ కొల్లు వెంకటేశ్వరరావు

వెచ్చఘాట్‌లో సగం ఆకాశం -సుధ

**ఆర్థికం**

మాంద్యంలోకి ప్రపంచ దేశాలు -ఎ. నరసింహారెడ్డి

**కథ**

పేగుబంధం -నాగవర్ధన్

**కథనం**

విప్లవానికి వెలుగునిచ్చే అమ్మ ప్రేమ -యామిని

**కవిత్వం**

రణం దిక్కెనోళ్లు -ఇక్బాల్

అడవి-రోడ్డు -ఫెలో ట్రావెలర్

మహమూద్ కవితలు:

విముక్తం, స్వప్న స్పర్శ

**నివేదిక**

కోల్హాన్ యుద్ధ నివేదిక -పద్మ కొండిపర్తి

**ఏప్రిల్ 15, 2023**

**సంపాదకీయం**

వాకపల్లి అత్యాచారం నుండి వైమానిక దాడులదాకా - పాణి

**నివాళి**

విప్లవ ప్రేమికుడు కామ్రేడ్ ఎల్. సుబ్బయ్య -విరసం

**సమీక్షలు**

చీకటి రోజుల్లో గానాలుండవా (శ్రీరాం పుప్పాల దీర్ఘకవిత 1818) -శ్రీనివాసమూర్తి

**కొత్త పుస్తకం**

కాలం తయారు చేసిన కవి (శ్రీ వశిష్ఠ సోమేపల్లి కవితా సంపుటి 'ఆకురాలిన చప్పుడు') -అరసవిల్లి కృష్ణ

**వ్యాసాలు**

శ్రమ సంబంధాల అమ్మ -వేణు, మైనా, తార

"మా ప్రాణాలైనా ఇస్తాం కానీ భూమినివ్వం" -ఉదయిని

మరోసారి భారత ప్రజలపై బాంబు దాడి -రెజాజ్ ఎం షీబా సిదీక్

మహిళా సాహిత్య చరిత్రలో శోభారాణి -కోడం కుమారస్వామి

**ఆర్థికం**

అసమానతలు పెంచుతున్న ఉపాధిరహిత వృద్ధి -ఎ. నర్సింహారెడ్డి

**కవిత్వం**

భూమిని మాటాడనివ్వు -కెక్యూబ్ వర్మ

కిటికీ -ఉదయమిత్ర

పల్లె పిలుస్తోంది -గవిడి శ్రీనివాస్

ఆటపాటల దరువు -చందు

వడ్డెబోయిన శ్రీనివాస్ కవితలు:

కమ్మటి దాల్చా, కొంగమొగ్గల చెట్టు, పైశాచకీయం

**నివేదిక**

మూడేళ్లలో నాలుగోసారి డ్రోన్ దాడి -FACAM

Stop This State Terror Now!

-International democratic organisations

**ప్రకటన**

ఆదివాసులపై వైమానిక యుద్ధాన్ని ఖండించండి -విరసం




ఫిబ్రవరి-మార్చ్ అరుణతార బాగుంది. అందులో రివేరా రాసిన వ్యాసం సందర్భోచితంగా వుంది. చాలా వివరాలను అందించింది. అయితే, అందులో మిత్రుడు ఏడో ఇంటర్నేషనల్ అంటూ వాడాడు. అది తప్పుడు సమాచారాన్ని అందిస్తుంది కదా! 1933 డిసెంబర్‌లో మూడో ఇంటర్నేషనల్ 13వ ప్లీనరీ సెషన్ జరిగింది. ఆ తరువాత 1935లో మూడో ఇంటర్నేషనల్ 7వ కాంగ్రెస్ జరిగింది. కాబట్టి మిత్రుడు రివేరా అలా రాయాల్సింది. ఐక్యవేదిక ప్రయత్నాలకు దన్నుగా సైనికీకరణ జరగాలని చివరలో రాశాడు. ఆయన రాసింది సరైందే. కానీ, మన దేశంలో వర్తమానంలో సైనికీకరణ అనేది రాజ్య సైనికీకరణగా అభాసుపాలైన పరిస్థితులలో అలా రాయడం కాకుండా, ఆయనే దాని వివరణలో పేర్కొన్నట్టు సాయుధం కాకుండా అని వుంటే మంచిగుండేది. మొత్తం పై వ్యాసం చాలా లోతులోకి వెళ్లి బాగా రాశాడు. అభినందనలు.

సంపాదకీయంలో హిందుత్వ అదానీ సంబంధాలు బాగా ప్రభావయుతంగా రాయగలిగింది. నిజంగానే వరలక్ష్మి గారి కలం పదునైనదే. అయితే, అసలు అదానీ ఆస్తులను ఏం చేయాలనేది కదా, ముగింపులో చెప్పాల్సింది. కానీ, ప్రజలకు ఆ సందేశం వెళ్లలేదు. ఈ దేశంలో అదానీ, అంబానీల సొత్తులేవీ వాళ్లవి కావు, వాళ్ల బాబాలవీ కావు. అవి ప్రజలవి అని ఓ మాట ముగింపుగా రాసింటే దాని బలం నిస్సందేహంగా ఇంకా పెరిగేది. ఆ లోటు నర్ల రవి వ్యాసం తీర్చింది.

-ఒక పాఠకుడు

ఫిబ్రవరి-మార్చి 2023 అరుణతారలో వడ్డెబోయిన శ్రీనివాస్ కథ 'కొత్తపాలేర్లు' పల్లె వదిలి పట్నంలో నౌకరి సంపాదించుకున్నా దొరల బాధ తీరని వైనాన్ని చెప్పింది. ఊర్లో దొరతనం చేసిచేసి సాగక పట్నం వచ్చిన సురేందర్ రెడ్డి సదయ్య సారుకు కాశీకి పోయిన గోశిలోని శని తప్పదన్నట్టు ఎదురైనాడు. దొరల ఆలోచనల్లో పాలేర్లు పాలేర్లుగానే, దొరలు దొరలుగానే ఉండాలి.

పాలేర్లు ఇలా నౌకరీలు సంపాదించుకుంటూపోతే రాబోయే రోజుల్లో మా ఇంట్లో మాచేతి కింద పని చేసేవారు ఎవరుంటారు అని వారి మనసులో దాగి ఉండే కులాధిపత్యాన్ని వడ్డెబోయిన శ్రీనివాస్ గారు ఈకథలో బాగా చూపించారు. సొంత డబ్బులతో మందు బాటిల్ కొనుక్కొని దొర ఇంటి కెల్లి ఇచ్చినగాని అవమానానికి గురైన సదయ్య, తన పేరు పక్కన 'గారు' వచ్చిచేరడం గమనిస్తాడు. ఎనభైలలో తొంభైలలో అన్నల ప్రభావం, ఆతర్వాత ఆత్మగౌరవపోరాటం తలచుకుంటాడు.

దొరసానమ్మ ఇచ్చిన నూకల్ని చాట్లో పోసుకొని ఏరుకుంటున్న భార్య సారమ్మను చూసి సదయ్య కోపంతో నూకల చాట లాక్కొని అపార్ట్‌మెంట్ నుండి రోడ్డు మీదకు గిరాటేస్తే, దొరసానమ్మ కోపగించుకుంటుంది. భర్త చాటను విసిరేసిన విషయాన్ని దాచి నేనే చెరుగుతాంటె జారిపోయిందని బదులిచ్చి ఘర్షణను నివారించి సర్దుకుపోయిన తీరులో శ్రామిక మహిళ స్వభావాన్ని చూపించారు. మంచి కథ అందించినందుకు రచయితకు అభినందనలు.

-రాంపేట రంజిత్

ఏప్రిల్ 2023 అరుణతారలో అజయ్ పుస్తకం కేంద్రంగా చాల మౌలికమైన, శక్తిమంతమైన చర్చ ప్రారంభించారు. ఇది ఇంగ్లిష్‌లో కూడ రావడం అత్యవసరం. ఎలక్టోరల్ డెమొక్రసీలో ఫాసిజానికి సుగమ మార్గముందని అమెరికా, టర్కీ, బ్రెజిల్, ఇజ్రాయిల్, ఇండియా వంటి దేశాల ఉదాహరణలతో రాస్తున్నారు కానీ అవి ఏవీ వర్గ పోరాట దృక్పథంతో ప్రజాస్వామ్యాన్ని ఆకాంక్షించేవి కావు. ప్రజాస్వామ్యవాదులమని చిత్తశుద్ధిగానే నమ్మే మేధావులు ఆలోచించడానికి సాహసించడం లేదు.

-ఫెలో ట్రావెలర్

**(3వ పేజీ తరువాయి)**

రిపబ్లిక్ డే రోజు అవార్డుతో సత్కరించిన సంగతీ గుర్తుకొస్తోంది.

సుదీర్ఘపోరాటం తర్వాత వాకపల్లి మహిళలు సాధించింది ఏమిటంటే వ్యవస్థను బోనులో నిలబెట్టడం. నిత్యం బెదిరింపులను ఎదుర్కుంటూ కూడా మామీద పోలీసులు అత్యాచారం చేశారు అని ధైర్యంగా బైటి ప్రపంచానికి చెప్పిన మహిళల్ని ప్రభుత్వం, పోలీసులు అన్ని రకాలుగా అవమానించారు. వారు మావోయిస్టుల కోసం అబద్ధాలు చెప్తున్నారన్నారు. ఇప్పుడు అన్యాయం జరిగిన మాట నిజమే అని కోర్టు ఒప్పుకోవడం అంటే దోషులెవరో తేల్చిచెప్పడం. ఈదేశ ప్రజాస్వామ్యం ఎట్లా విఫలమైందో, ఆధునికంగా, గంభీరంగా కనిపించే వ్యవస్థలన్నీ ఎంత డొల్లనో ఆ అమాయక ఆదివాసులు నిరూపించారు. అందువల్ల తాము యుద్ధక్షేత్రంలో ఎందుకున్నామో కూడా విస్పష్టంగా చెప్పగలిగారు. ఆనాటి దురాగతానికి ప్రత్యక్ష సాక్షి పదిహేనేళ్ల డేనియల్ విప్లవోద్యమంలోకి పోయి పోలీసుకాల్పుల్లో అమరుడై ఇక్కడ పీడితులకు న్యాయం ఎలా దక్కుతుందో చెప్పండని ప్రశ్నిస్తూనే ఉన్నాడు. ఈరోజు దండకారణ్యంలోని ప్రతి పల్లె వాకపల్లి లాంటిదే. అత్యాచారాలు, హత్యలు కూడా దాటిపోయి డ్రోన్ దాడులు జరుగుతున్నాయి. ఇప్పటికి వరుసగా నాలుగుసార్లు ఛత్తీస్‌గఢ్ ఆదివాసీ ప్రాంతాల్లో బాంబుదాడులు చేశారు. వాకపల్లి మహిళలు అబద్ధాలు చెబుతున్నారని అన్నట్లు డ్రోన్ దాడులూ నిజం కాదంటున్నారు. ఆదివాసుల ఆందోళనలు బైటి ప్రపంచానికి వినిపించకుండా వారి పక్షాన మాట్లాడుతున్న సామాజిక కార్యకర్తలను ప్రభుత్వం జైళ్లలో పెడుతోంది. కాబట్టి వాకపల్లి మహిళల పట్ల న్యాయస్థానం జాలి కురిపించిందని తృప్తి పడటానికి లేదు. వాకపల్లి ఒక విడి ఘటన కాదు. పెద్ద ఎత్తున ప్రభుత్వం ప్రజలపై చేస్తున్న యుద్ధంలో భాగం. వేలాది వాకపల్లెలు ఎన్నో రెట్లు దారుణమైన హింసను ఎదుర్కుంటున్నాయి, ప్రతిఘటిస్తున్నాయి. వారికి అండగా నిలబడాల్సిన బాధ్యత ప్రజాస్వామికవాదులందరిదీ.



కవిత్వం

# భూమి చెబితే ఆకాశం నమ్మదా

## మానని గాయం

**వడ్డెబోయిన శ్రీనివాస్**

ఆ కన్నీళ్లను
సెలయేళ్ళు
దోసిల్లు నింపుకొన్నాయి

ఆ గాయాలను
కొండాలూ కోనలు
ఒంటినిండా అల్లుకున్నాయి

ఆ మనసులను
నరాలు బిగబట్టి చెట్లు
గుండెలకు హత్తుకున్నాయి

వెలుగుపూల
సూర్యచంద్రుల నిస్సహాయ సిగ్గుతో
ఆర్తనాదాడవి
చీకటయ్యింది

ఆ ఊపిర్లకు
వెదురువనాల గానం
నీడ నెత్తింది

కాలం
తిరిగీ తిరిగి
కాళ్ళు బొబ్బలెక్కాక
తినితాగే ఊరి పెద్ద మనుషుల తీర్పయింది
పురుషాహంకారం గాయపడకుండా
రూపాయితో
లైంగికదాడి ముఖాన్ని వికృతంగా అలంకరించారు

పొడిసిన పొద్దును
అసహ్యంగా
శుక్రకణాల అలికేసిన
పారామిల్ట్రీ పురుషాంగాల ముందు
జనజీవన స్రవంతి ధర్మ దేవత
కళ్ళింకా గట్టిగా మూసుకుంది

ఆ అడవి మనుషులు
కమ్మ బిడ్డలుగారు
ఆ అడవి మనుషులు
రెడ్డి బిడ్డలుగారు
ఆ అడవి మనుషులు
ఎలమ బిడ్డలుగారు
ఆ అడవి మనుషులు
బ్రాహ్మణ పుత్రికలుగారు

వాళ్ళు
కోన్‌కిస్కా కోయోల్లు
అడవిలో
తెంపేసిన ఆకులు
విరిచేసిన కొమ్మలు
కోసేసిన మొగ్గలు వాళ్ళు
చిదిమేసిన పువ్వులు వాళ్ళు

అంతే
న్యాయం
అరణ్యరోదన
యుద్ధగానమైయ్యింది



## తీర్పులు కఠినతరం

**భండారు విజయ**

అవునూ...
తీర్పులు ఇవ్వడం
అంత తేలికైనా పనికాదూ! అనుకుంటాం కానీ...
న్యాయం అటువైపైనా
ఇటువైపైయినా...
బాధితులెప్పుడూ
నిందితులుగానే నిలిచిపోతుంటారెందుకో!

న్యాయం కోసం దశాబ్దాలుగా ఎదురుచూడడమంటే
కత్తిమీద సాము చేయడమే!
బయటకు వస్తుందో రాదో తెలియని నిజం కోసం
యుగయుగాలుగా ఆశల పల్లకీల్లో ఊరేగడం చూస్తూ
అన్యాయం అలాఎలా నవ్వకుండా ఉంటుంది?

కారిపోయిన రక్తపు చారికలు
ఇంకా తొడల మధ్యన సలుపుతూనే వున్నా...
పొత్తికడుపుల్లో తగిలిన కాకీ కాళ్లబూట్ల శబ్దాలు
ఇంకా పచ్చివాసన వేస్తున్నా...
తీర్పులు ఇక్కడ

ఇవ్వబడునన్న బోర్డు ముందు
వాళ్ళ తెగిన మనసులు
ఇంకా వేలాడుతూనే వున్నాయి
పోయినోళ్ళ శ్మశాన జాడలు
గొంతు కోసిన ఆర్తనాదాలై
ఇంకా వినిపిస్తూనే వున్నాయి
చెవుల్లో సీసాలు పోసుకున్న
వారికవి వినబడకుండానే!

న్యాయదేవత దేహమంతా
కళ్ళు చేసుకుని చూస్తోంది
వాళ్ళ నల్లబడిన చర్మపు పొరల కింద
కుళ్ళిపోయి వాసన వేస్తూ
గడ్డకట్టిన వికృత పంటిగాట్లను
సలుపుతున్న వాళ్ళ శరీరం మీద
ఘోష్తుల్లా విసిరేసిన వేళ్ళగోళ్లను
పూడుకపోయిన గొంతుల్లో ఇరుక్కున్న వాళ్ళ ప్రశ్నలను
మట్టిగొట్టుకపోయి చిరిగిపోయిన
వాళ్ల చెక్కిళ్ల పగుళ్లను
రెండుపదులు కూడా నిండకుండా వాళ్ళను చుట్టుముట్టిన
వృద్ధాప్యపు ఛాయలను గుర్తించి
గంతలు కట్టుకున్న గాంధారి
చాతకానితనపు నీరసాన్ని
వాళ్లపై కుమ్మరించింది
నాది స్వపక్షమేనని చెప్పకనే చెప్పి
ఇక తీర్పు ముగిసిందని
రెండు చేతులూ జోడించింది

పాపం వాళ్ళు ఏం అన్నారని?
భూమి చెబితే ఆకాశం నమ్మదా అనే కదా!
పాపం వాళ్ళు ఏమి అడిగారని?
ఈ అడవిని వదలలేమనే కదా!

భూమే కాదూ...
పాతాళం దుఃఖంతో నిండినా
అడవినే కాదూ...
బతుకులను శిథిలం చేసినా
వాళ్లకు స్వేచ్ఛే లేదన్నట్లుగా
తీర్పులను తిరగేసి, మరగేసి
ఇదే న్యాయమని తేల్చేసాక
ఇక అమ్మలకు అన్నం పెట్టలేని
కొడుకులు
ఆ కొడుకులకు పాలుదాపే పాలిండ్లు
వున్నా ఒకటే! లేకున్నా ఒకటేనా!
యథా రాజా! తథా ప్రజా!
తీర్పులెప్పుడూ కఠినమే మరి!
బాధితులెప్పటికీ నిందితులేగా!
న్యాయమా వర్ధిల్లు...!

ధృతరాష్ట్రుల పాలనలో
మనిషిని పూర్తిగా చంపకుండా... దేహమంతా కళ్ళు చేసుకుని
నువ్వు మాత్రం బతకాలి ఎల్లప్పుడూ...!

## భూమిని మాటాడనివ్వు..

**కెక్యూబ్ వర్మ**

మనమింకా బతికే వున్నామా?
ఇదేదో భేతాళుని
భుజాన వేలాడే రాజు ప్రశ్న కాదు

వాదనలు ముగిసిన వేళ
వాడొక్క మాటతో ఫుల్ స్టాప్
పెట్టేసే వేళ
అటూ ఇటుగా సరిపెట్టుకుంటే
నువ్వూ నేనూ కోల్పోయేదేమీ లేదు
వాడి తుపాకీ మొన ముందు
వారి మానం ఛిద్రమైన వేళ
కోర్టుల ముందు
నగ్నంగా నిలబడిన
తల్లులను వంచించిన
నీ న్యాయం
నీకు నైతిక విజయమా?
కోల్పోయిన మానానికి
కళ్ళు లేని న్యాయం
ధర కడుతుందా?
తాను రుజువు చేయలేని
ఆ పదముగ్గురినీ
వాకపల్లిలో నిలబెడితే
న్యాయమేదో బిగ్గరగా
వినబడేది కదా?
పదారేళ్ళ నీ విచారణకు
తమ కొంగు చివర
కట్టుకున్న దమిడీ బిళ్ళ
ఫీజు చెల్లుబడేయ్యేది కదా
నల్లగౌను పోలీసూ?
తిప్పి తిప్పి
నువ్ వాళ్ళు చదవమన్న
తీర్పు చదివి
కళ్ళు తుడుచుకుంటే
పోయిన మా నెత్తుటి ముద్దుబిడ్డ
డానియెల్ ప్రశ్న నీకెరుకవుతుందా?

భూమిని మాటాడనివ్వు
సత్యమేదో సూరీడు
ప్రకటిస్తాడు!!



విరసం
ఖండన

# ఆదివాసులపై వైమానిక యుద్ధాన్ని ఖండించండి

## రాజ్యాంగ వ్యతిరేక ఫాసిస్టు దాడులపై ప్రజాస్వామిక శక్తులను ఐక్యం చేద్దాం



ఏప్రిల్ 7వ తేదీ శుక్రవారం దండకారణ్యంలో మరోసారి భారత ప్రభుత్వం వైమానిక దాడులు చేసింది. ఈ ఏడాది జనవరి 11న గగనతల దాడులు జరిగిన మూడు నెలలకల్లా మరోసారి డ్రోన్ల నుంచి బాంబులు విసిరారు. పామేడు ప్రాంతంలోని బట్టిగూడ, కవరగట్ట, మీనగట్ట, జబ్బగట్ట గ్రామాల పరిధిలో తెల్లవారుజామున ఈ దాడులు జరిగినట్లు తెలుస్తోంది. ఆదివాసులు ఆ సమయంలో విప్ప పూలు ఏరుకోడానికి అడవిలోకి వెళ్లారు. కొందరు పొలాల్లో పనులు చేసుకుంటున్నారు. ఉదయం 6 గంటలకు మొదలైన బాంబు దాడులు ఐదు నిమిషాల వ్యవధిలో వేర్వేరు ప్రాంతాల్లో జరిగాయి. ఆ తర్వాత సైనికులు హెలికాప్టర్లలో అక్కడికి వచ్చి కాల్పులు జరిపారు.

కేంద్రంలోని బీజేపీ ప్రభుత్వం, ఛత్తీస్‌గఢ్‌లోని కాంగ్రెస్ ప్రభుత్వం సంయుక్తంగా ఈ దాడులకు పాల్పడుతున్నాయి. దేశ ప్రజలయిన ఆదివాసుల మీద వైమానిక దాడులు చేయడం రాజ్యాంగ విరుద్ధం. దేశాల మధ్య యుద్ధాలకు కూడా అంతర్జాతీయ నిబంధనలు ఉన్నాయి. అలాంటిది దేశ పౌరుల మీద ఇట్లా దాడులు చేయడం ద్వారా పాలకులు ఈ దేశంలో ప్రజాస్వామ్యం లేదని, తాము రాజ్యాంగాన్ని పాటించదల్చుకోవడం లేదని బాహాటంగా ప్రకటిస్తున్నారు.

మధ్య భారతదేశంలోని విప్లవోద్యమాన్ని నిర్మూలించడానికి, దండకారణ్య ప్రాంతం నుంచి సహజ వనరులను కార్పొరేట్ సంస్థలకు అప్పగించడానికి ప్రభుత్వం చేపట్టిన సమాధాన్‌లో భాగమే ఈ వైమానిక దాడులు. దేశ ప్రజలందరికీ చెందవలసిన సహజ సంపదను కార్పొరేట్లకు ధారాదత్తం చేయడాన్ని ఆదివాసులు ఒప్పుకోవడం లేదు. సహకారం, స్వావలంబన, సమిష్టీకరణ ప్రాతిపదికలపై దేశ ఆర్థిక వ్యవస్థ దళారీ పెట్టుబడిదారుల పట్టు నుంచి, సామ్రాజ్యవాద దోపిడీ నుంచి బైటపడుతుందనే విప్లవాత్మక ప్రయోగాన్ని దండకారణ్య ఆదివాసులు చేస్తున్నారు. దాన్ని దెబ్బతీయడానికి కేంద్రంలోని ఫాసిస్టు బీజేపీ ప్రభుత్వం ఇంత క్రూరమైన దాడులు చేస్తున్నది.

ఇది భారత రాజ్యం ప్రకటించుకున్న రాజ్యాంగబద్ధత, చట్టబద్ధ పాలన వంటి విలువలకు, విధానాలకు వ్యతిరేకం. గత కొద్ది కాలంగా ఆదివాసీ ప్రాంతాల్లో జరుగుతున్న సైనిక చర్యలకు వ్యతిరేకంగా దేశమంతా నిరసన వ్యక్తమవుతున్నది. ఆదివాసులు ఈ దేశపౌరులే. రాజ్యాంగం వారికి ప్రత్యేక రక్షణను కల్పించింది. ముఖ్యంగా పెసా చట్టం వంటివాటిని ప్రభుత్వాలు కాలరాస్తూ అడవిలోకి చొరబడి విధ్వంసం సృష్టిస్తున్నాయని ప్రజాస్వామిక వాదులు ఆందోళన చేస్తున్నారు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని అంగీకరించని మావోయిస్టులు కూడా ఈ దేశ ప్రజలే. వాళ్ల నాయకత్వంలోని విప్లవోద్యమాన్ని నిర్మూలించే లక్ష్యంతో 2024 ఎన్నికలను మావోయిస్టు రహిత భారత్‌లో జరపుతామని బీజేపీ ప్రభుత్వం ప్రకటించింది. అందులో భాగమే ఈ వైమానిక దాడులు.

గత కొన్నేళ్లుగా తీవ్రమైన అణచివేతలో భారత ప్రభుత్వం ఇక నేల మీది సైనిక చర్యలను దాటి ఏకంగా డ్రోన్ల, వైమానిక దాడులకు పాల్పడుతున్నది. ఈ దుర్మార్గాన్ని, రాజ్యాంగ వ్యతిరేక చర్యలను ఖండించాలని విరసం ప్రజలకు, ప్రజాస్వామికవాదులకు విజ్ఞప్తి చేస్తోంది. ఇది కేవలం ఆదివాసుల రక్షణ ఉద్యమంగానే కాక కార్పొరేకటీకరణకు, సైనికీకరణకు వ్యతిరేకంగా సాగవలసిన విశాల ప్రజాతంత్ర ఉద్యమంలో భాగం కావాలి. దాని కోసం భిన్న ప్రజాస్వామిక భావజాలాలు ఉన్న వ్యక్తులు, సంస్థలు, పార్టీలు కనీస కార్యక్రమం మీద ఐక్యం కావాలని విరసం కోరుకుంటున్నది. ప్రజాస్వామిక విలువల ప్రాతిపదికగా ఐక్యమై ఆదివాసులపై సైనిక చర్యలను, డ్రోన్ దాడులను, వైమానిక యుద్ధాన్ని అడ్డుకోడానికి చేయి చేయి కలపాలని పిలుపు ఇస్తోంది.

9-4-2023

నివాళి

# విప్లవ ప్రేమికుడు కామ్రేడ్ ఎల్. సుబ్బయ్య

- విరసం

బిఎస్ఎన్ఎల్ రిటైర్డ్ ఉద్యోగి, విప్లవాభిమాని ఎల్. సుబ్బయ్య(88)గారు గత కొద్ది కాలంగా వయోభారంతో, అనారోగ్యంతో బాధపడుతూ ఏప్రిల్ 6వ తేదీ హైదరాబాదు ఆస్పత్రిలో అమరుడయ్యాడు. ట్రేడ్ యూనియన్ కార్యకర్తగా మొదలై జీవిత పర్యంతం లౌకిక ప్రజాస్వామిక విప్లవశక్తుల పక్షాన దృఢంగా నిలబడ్డారు. బైటి ప్రాంతాల్లో కర్నూలు సుబ్బయ్యగారిగా ఆయన అనేక మంది ప్రజాసంఘాల కార్యకర్తలకు, మేధావులకు, రచయితలకు చిరపరిచితుడు. కోవిడ్‌కు ముందు మూడు నాలుగేళ్ల వరకు కూడా రెండు తెలుగు రాష్ట్రాల్లో ఎక్కడ ప్రజాసంఘాల కార్యక్రమాలు జరిగినా తప్పక హాజరయ్యేవారు. ఏ ప్రగతిశీల సంస్థ కార్యక్రమం జరిగినా, ఉద్యమం నడిచినా వాటికి సంబంధించిన కరపత్రాలను ప్రజల్లోకి తీసికెళ్లడం ఆయనకు ఒక ముఖ్యమైన పని. దిన పత్రికల్లోగాని, ప్రజాసంఘాల పత్రికల్లోగాని వచ్చే వ్యాసాలను జిరాక్స్ తీసి కొత్తవాళ్లతో విరివిగా చదివించేవారు. పత్రికలకు చందా కట్టలేని వారికి తనే చందా కట్టి పత్రికలు వచ్చేలా చూసేవారు. రాజకీయ అధ్యయనంతోనే దీర్ఘకాలిక ఉద్యమాల్లో కార్యకర్తలు, అభిమానులు నిలబడతారని దృఢంగా నమ్మేవారు. తన పరిచయాల్లో ఉండేవారందరినీ చదవమని ప్రోత్సహించడమేగాక సభలకు, సమావేశాలకు, ఆందోళనలకు తప్పక హాజరయ్యేలా చూసేవారు. ప్రజాఉద్యమాల అభిమానుల లోటుపాట్లు గుర్తించి వారు సరైన రాజకీయ వైఖరికి రావడానికి దోహదం చేసేవారు. కార్యకర్తల ఆరోగ్యాలు, ఆర్థిక అవసరాలు పట్టించుకొనేవారు. ప్రజాసంఘాల కార్యక్రమాలకు హాజరై తిరిగి వెళ్లేటప్పుడు బాధ్యులను కలిసి ఖర్చుల గురించి అడిగి తెలుసుకొని మరీ సాయం చేసేవారు.



సుబ్బయ్యగారు యాభై ఏళ్ల కింద కా. చంద్ర పుల్లారెడ్డి, కా. నీలం రామచంద్రయ్య, కా. మండ్ల సుబ్బారెడ్డి వంటి నాయకుల ప్రభావంలో వామపక్ష విప్లవ రాజకీయాల్లోకి వచ్చారు. అప్పటి నుంచి చివరి దాకా సొంత జీవితంలో ఎన్ని ఆటుపోట్లు ఎదురైనా విప్లవోద్యమంతో ఉన్నారు. 2000 సంవత్సరం నుంచి మావోయిస్టు విప్లవోద్యమం వైపు ఆకర్షితుడై చివరి ఘడియ వరకు కలిసి ప్రయాణించారు. ఆ ఉద్యమ ప్రచారానికి తన శక్తినంతా వెచ్చించారు. కేవలం విప్లవోద్యమ అభిమానిగా, కామన్‌సెన్స్‌తో విప్లవాన్ని ప్రేమించే వ్యక్తిగా ఆరంభమై వర్గపోరాట క్రమాన్ని, దాన్ని గతితర్కాన్ని, ఆటుపోట్ల మధ్యనే దాని పురోగతిని చారిత్రకంగా అర్థం చేసుకొనే దాకా ఎదిగారు. వ్యవస్థ మౌలిక మార్పుకు అవసరమైన దార్శనికతను, వ్యూహాన్ని, తెగువను, త్యాగనిరతిని తెలుసుకొని విప్లవోద్యమం పక్షాన దృఢంగా నిలబడ్డారు. మావోయిస్టు ఉద్యమమే ఈ సమాజాన్ని విముక్తం చేస్తుందని శషభిషలు లేని రాజకీయ అవగాహనకు చేరుకున్నారు. నిర్బంధంలో విప్లవోద్యమానికి పెద్ద నష్టాలు జరిగినప్పుడు వృద్ధాప్యం వల్ల మానసికంగా ఆందోళనపడేవారు. అంతలోనే తార్కికంగా అంచనా వేసుకొనేవారు.

తీవ్ర అనారోగ్యంలో, వయోభారంలో కూడా విప్లవ రాజకీయాలే తనకు ఉత్సాహాన్ని ఇస్తున్నాయని మురిపెంగా చెప్పుకొనేవారు. శరీరంలో శక్తి ఉన్నంత వరకు విప్లవోద్యమానికి దోహదం చేశారు. కోవిడ్ తర్వాత కూడా కర్నూలులో జరిగే ప్రజా కార్యక్రమాల్లో పాల్గొనేవారు. ఆయన ఒక తరానికి చెందిన వామపక్ష, ప్రగతిశీల చైతన్యానికి ప్రతినిధి. ముఖ్యంగా విప్లవ రచయితల సంఘానికి అత్యంత సన్నిహితుడు. విరసం ప్రచురించే పుస్తకాలు చదివేవారు. అరుణతార, వీక్షణం వంటి పత్రికల ద్వారా సమాజాన్ని, విప్లవోద్యమాన్ని తెలుసుకుంటున్నానని ఇష్టంగా చెప్పేవారు. ఆయన మృతికి విరసం నివాళి ప్రకటిస్తోంది.

కథ

# ఒరుపు కన్నుల తల్లి

జి. వెంకటకృష్ణ



మెల్లగా తలుపు తట్టాడు రవి. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. తలుపు దానంతటదే తెరుచుకుంది. మసకగా మనుషులు కన్పిస్తున్నారు. మంద్రంగా మాటలు వినిపిస్తున్నాయి. ఎండలోపడి వచ్చినందుకేమో అంతా స్లోమోషన్‌లా వుంది. ఆయన కోసం రవి కళ్ళు వెతికాయి. రెండు రోజుల క్రితం సాయంత్రం పెన్నార్ భవన్‌లో మీటింగ్ ముగిసాక టీ తాగుతూంటే రవి భుజం మీద చెయ్యి పడింది. తిరిగి చూస్తే షేక్ హ్యాండ్ యిస్తూ ఒక పెద్దాయన

"నాలుగు వాక్యాలైనా గొప్పగా మాట్లాడావు. చిన్న కవిత కూడా చదివావు కదా. హాంగింగ్ బ్రిడ్జితో హాంగ్ అవుతున్న రైతు జీవచ్ఛవాలను ఆపలేవంటూ. బాగా కడుపు మండిస్తోంది, నీ వాక్యం. నీలాంటి వాళ్లు చాలా అవసరం. ఏం చేస్తుంటావు?" అంటూ అడిగాడు. ఈ ఆదివారం ఉదయం సీ.క్యాంపు లలిత కళా సమితిలో ఒక మీటింగ్ వుంది, రా! కొందరిని పరిచయం చేస్తానన్నాడు.

ఆ తర్వాత కనుక్కుంటే తెలిసింది, అతడు పేరున్న కవి, నవలా రచయిత అని. పిల్లల కోడిలాగా, రాసేవాళ్లను అక్కున చేర్చుకుంటాడనీ. రాయలసీమ మీద రాసిన తాజా కవితను జేబిలో పెట్టుకుని యిట్లా వచ్చాడు. ఇంతకీ ఆయనెక్కడా. ముప్పై మంది దాకా వున్నారు. ఎక్కువ మంది జుట్టు తెల్లబడుతున్న రంగువెలసిన మనుషులే. ఎదురుగా గోడకు బ్యానర్ 'సిద్దేశ్వరం అడుగు గుండ్రేవులకై కదులు'. గంభీరంగా కన్పించింది. కొందరు విప్పారిన కళ్లతో వేదికవైపు చూస్తున్నారు. వేదికంటే వేదికేంకాదది. ఎదురుగుండే గోడకు నాలుగు కుర్చీలు వేసి పక్కన పోడియం పెడితే, వేదిక అయిపోయింది. దాని ఎదురుగా ముప్పై నలభై కుర్చీలు. చాలా సింపుల్ గా వుంది. వక్తలకీ శ్రోతలకీ పెద్ద ఎడమ లేదు. ఈ హాల్ ఎవరో బాగా డిజైన్ చేసారు! అప్పుడు కన్పించాడు సారు రవికి. యాభై యైదేళ్లుండొచ్చు. జుట్టుకు రంగు వేయడం మానేసాడు. పెప్పర్ సాల్ట్ జుట్టుతో బక్కపలచని, ఆరడుగుల శరీరంతో ఆకర్షణీయంగా వున్నాడు సారు. అతి సహజమైన చిరునవ్వుతో, కళ్లలో ఆత్మవిశ్వాసంతో. ఆయన పేరు కేశవస్వామి. రవిని తీసుకెళ్ళి, యింకో పెద్దాయన ముందు నిలబెట్టి "మూర్తి గారూ, నేను చెప్పాను గదా...యీ అబ్బాయే" విశాలమైన నుదుటి మీద పడుతున్న జుట్టును వెనక్కి తోసుకుంటూ అన్నాడు. ఆ పట్టుకున్న చేతుల్లో ఎంత ప్రేమ వుందో తెలిసివస్తోంది రవికి.

ఏదో మంత్ర శక్తి యితనిలోకి వొంపుతున్నాడా అనిపించింది చూసేవాళ్లకి. మూర్తి గారికి పరిచయం చేసుకోమన్నట్టు సైగ జేసాడు. మూర్తి గారి గురించి రవికి కొంత తెలుసు. ఇంటర్ కాలేజి వ్యాసాల పోటీలో మూర్తి గారిని జడ్జిగా చూసున్నాడు.

"ఏ వూరు మనది" అడిగాడు మూర్తి. చెప్పూనే, "మీ వూరి పక్కనే, ఫలానా వూళ్లో జరిగే ఒక జాతరలో తేళ్లను వొంటిమీదికి పాకించుకుంటారు. ఎప్పుడైనా వెళ్లావా?" నవ్వుతూ అడిగాడు. ఆ నువ్వు ఎంతో ఆహ్లాదంగా వుంది, చిన్న పిల్లలు నవ్వినట్లు.

ఆ హాల్లో వాళ్లంతా మాట్లాడుతున్న చిన్న చిన్న ఉపన్యాసాలు అన్నీ రాయలసీమ గురించే . ఏవేవో విశేషాలు. వెల్లబోసుకుంటున్న వెతలు. కతలూ కాకరకాయల్లాంటి చేదులూ. అన్నీ అనెక్‌డోట్స్. చరిత్రకెక్కని పొడి కథలు. గోడల్ని తాకి కలియదిరుగుతున్నాయి. ఇవన్నీ యీ గోడలు దాటి బయటికి పోగలవా. పోయినా యేమైనా ప్రభావం వేయగలవా.

"చేతులు వూర్తీ కాలిన తర్వాత ఆకుల కోనం వెతుకుతున్నట్లుంది మన పరిస్థితి. కృష్ణానది మీద నికర జలాలు తేల్చేసిన తర్వాత మనమెంత కొట్లాడినా ఏం లాభం. నాగార్జునసాగర్ నిర్మాణానికి ముందే యిక్కడి వాళ్లు మేల్కొని వుండాల్సుండే" అంటున్నాడొకాయన.

"కనిష్టంగా శ్రీశైలం ప్రాజెక్టు కట్టే ముందైనా.." ఆ ముక్తాయింపుకు హాల్లో చాలా నిట్టూర్పులు వినిపించాయి. అంతలో ఒకామె లోపలికొచ్చింది. ముప్పై ఏళ్లు మించి వుండవు. ఆమెతో పాటు ట్రేలో టీ కప్పులతో ఒకబ్బాయి. కాటన్ చీరలో హుందాగా వుంది. తటుక్కున గుర్తొచ్చింది యీమెను సిద్దేశ్వరం కోసం జరిగిన పాదయాత్రలో చూసానని. ఆర్ట్స్ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తోందని తెలిసింది. అందరినీ పలకరిస్తూ టీ తీసుకోమంటోంది. మూర్తి సార్ టీ కప్పు అందుకుంటూ, "లలితా కూర్చో, ఎలా వున్నావమ్మా. కిషోర్‌తో యేమైనా సయోధ్య కుదిరిందా" అనడిగాడు.

"ఎలా కుదురుతుంది సార్. డైవోర్స్ ఆల్మోస్ట్ అయిపోయినట్లే సార్."

"ఏ హోప్ లేదా. కిషోర్‌లో ఏ మార్పూ లేదా లలితా."

"తనలో విపరీతమైన మార్పు వుండబట్టే కదాసార్ యిదంతా. కమ్యూనిస్టు కాస్తా కుల సంఘాల యిష్టుడిగా మారెనా. రాయలసీమవాదిగా వుండినోడు సంఘపరివార్‌లోకి జారిపాయెనా, అంతకంటే మార్పు యింకేం రావాలి సార్ నేను హోప్ పోగొట్టుకోవడానికి.'

"మేం చేసిన పెళ్లి. మా కళ్ల ముందే విడిపోతుంటే తట్టుకోవడానికి కావట్లేదమ్మా. అలా అని నువ్వు బాధ పడటాన్నీ సహించలేం" కన్నీళ్లు పెట్టుకున్నాడు మూర్తి. సార్ చేతిని తన చేతుల్లోకి తీసుకొని అక్కడే కూచుంది లలిత. ఆ చేతుల్లో యేదో భరోసా దొరుకుతున్నట్టుందామెకు.

'వ్యాపారం కోసం వచ్చిన బ్రిటిష్ వాళ్లకే యీ ప్రాంతాన్ని చూసి జాలి కలిగింది. కృష్ణా గోదావరుల మీద కోస్తాలో కట్టినట్లు యిక్కడ కూడా కృష్ణా నది మీద ఆనకట్ట కడితే తప్ప యిక్కడి కరువుకు పరిష్కారం దొరకదనుకున్నారు. ఆ మేరకు సర్వే కూడా చేసారు. కృష్ణా తుంగభద్ర కలిసే సంగమేశ్వరం తర్వాత రెండు కొండల మధ్య సిద్దేశ్వరం వద్ద ఆనకట్ట నిర్మాణం చేయొచ్చు అనుకున్నారు. అయితే బ్రిటిష్ కాలంలోనే కలిగిన ఆకాంక్ష, ఆకాంక్ష గానే మిగిలిపోయింది. బ్రిటిష్ ప్రణాళికలను అందిపుచ్చుకుని అప్పటి మద్రాసు గవర్నమెంట్ చేసిన ప్రయత్నాలను, రాజకీయాలు చేసి సాగకుండా చేసారు. అస్సలు కృష్ణా నది మీద యెలాంటి ప్రాజెక్టులూ లేనప్పుడు ప్రణాళికలను అంగీకారం చేయించినా అములు కానీకుండా చేసింది యే బలమైన శక్తో ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. మద్రాసుకు మన నీళ్లిచ్చే అవసరమేముందని వాదిస్తూ, మొరుసునాడు వరకూ వున్నా రాయలసీమ ప్రజలకు అన్యాయం చేశారు. ఈ ప్రాంతం నుంచి ప్రవహిస్తున్న నది నుంచి యీ గట్టున వున్న వాళ్లని నీళ్లను తీసుకోనీకుండా చేసిన ద్రోహులను యేమనాలా. మహారాష్ట్ర దాటుకుని కర్ణాటక నుంచి వచ్చే నీళ్లవి...' వక్త బాధామయ గొంతుకతో చెప్పుకు పోతున్నాడు. మూర్తి గారు అది వింటున్నా, లలిత కథే గుర్తుకు వస్తోంది.

మహారాష్ట్ర నుంచి కర్ణాటక నుంచి కృష్ణా తుంగభద్ర నదులే కాదు ఆ పరీవాహక ప్రాంతాల్లోని ప్రజలు కూడా ఆ నదుల వెంట శ్రీశైలం భ్రమరాంబ కోసం, ఆమె తమ యింటి ఆడపడుచుగా భావించి చూడ్డానికి వస్తుంటారు. అదీ, మొత్తం దూరాన్ని కాలినడకనే ప్రయాణించి వస్తుంటారు. నీళ్లు మోసుకొని వచ్చే నదులే కాదు, ప్రేమల్ని, సాంస్కృతిక సంబంధాలనీ మోసుకొని వచ్చే జననదులతో యీ నేలకు తరతరాల అనుబంధం వుంది. అలాంటి జననదిలోని ఒక జంట, ఒక రోజు ఒక పసిపాపతో కేశవస్వామి యింటికి వచ్చారు. ఆ వచ్చినవాళ్లెవరో కేశవస్వామికి తెలుసు. ఆ జంట ఢిల్లీ జెఎన్‌యూలో కేశవస్వామికి సహాధ్యాయులు. తమకున్న నైపుణ్యాన్ని, సుఖంగా బతకడానికి వున్న అవకాశాన్నీ ప్రజల కోనం వనిచేయాలనే ఆశయానికి వణంగా పెట్టిన సాహసవంతులు. వాళ్లు, ఆ పాపను ఆ యింటి పొత్తిళ్లలో పెట్టి మళ్ళీ జననదిలో కలిసి శ్రీశైలానికి వెళ్లిపోయారు. అటునుండి నల్లమలలో కలిసిపోయారు. కేశవస్వామి భార్య ఆ పాపను చనిపోయిన తన తల్లి పేరుతో 'లలితమ్మా' అనిపిలిచి పెంచింది.

"ఒకసారి కాదు మూడుసార్లు యీ ప్రాంతపు ఆకాంక్షను వమ్ముచేసారు. మొదటిసారి బ్రిటిష్ హయాంలో, రెండవసారి సిద్దేశ్వరం వద్ద ఆనకట్ట కడితే కర్నూలు, అలంపూర్ మునిగిపోతాయని భయపెట్టి నందికొండకు, మూడోసారి నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు బ్యాలెన్సింగ్ రిజర్వాయర్ లాగా శ్రీశైలం జల విద్యుత్ ప్రాజెక్టు కట్టడం ద్వారా, యీ నేల ఆకాంక్షకు శాశ్వతంగా తలుపులు మూసేసారు...."

లలిత చిన్నప్పటి నుంచీ చాలా అల్లారుముద్దుగా, చురుకుగా పెరిగింది. చదువుల్లో ఆటల్లో హుషారుగా వుండేది. ఆ యింటికి వచ్చిపోయే వందలాది మంది కార్యకర్తలనూ, ఆలోచనాపరులనూ చూస్తూ, యేది తెలుసుకోవాలో అదే తెలుసుకుంటూ ఎదిగింది. అయితే పెళ్లి విషయంలో వాళ్లమ్మ ఆలోచనలకు భిన్నంగా వెళ్లింది. కూతురు మంచి స్థితిమంతున్ని చేసుకొని సుఖవంతమైన జీవితం గడపాలని తల్లి తలచింది గానీ, లలిత ఉద్యమాల్లో తిరుగుతూండిన అనిల్‌ను ప్రేమించింది. అతణ్ణి

అజ్ఞాత కార్యకర్తగా మారాలని ఆశించింది. తీరా అతను వెళ్లిన కొద్ది కాలానికే అమరుడైతే నిబ్బరంగా తట్టుకుంది. అయితే కూతురి గురించి యెన్నో కలలుగన్న తల్లి ఆ దెబ్బకు ప్రాణాలు వదిలింది. కేశవస్వామి కూతురి దుఃఖాన్నీ, భార్య మరణాన్నీ దేనికదిగానే యెదుర్కొన్నాడు. తను చూసిన ఎన్నో క్లిష్ట పరిస్థితులూ, చావులూ, ఎన్‌కౌంటర్లూ ఆయన్ని రాటుదేల్చే వున్నాయి. మనిషి కూడా స్వభావ రీత్యా తొణకనివాడు. దేనికీ చలించనివాడు. అసలు యీ మనిషి సన్యాసి, సర్వసంగ పరిత్యాగీ కావాల్సిన వాడు మన మధ్య పడ్డాడని, మనకోసమే దొరికాడనీ ఆయన మిత్రులూ, శిష్యులమని చెప్పుకొనేవారు అనుకుంటూ వుంటారు. ఆ తర్వాత లలితకు కేశవస్వామి శిష్యుడు కిషోర్ ఎదురుపడ్డాడు. చాలా కాలం వాళ్లిద్దరూ మంచి స్నేహితులుగానే వున్నారు . కిషోర్‌లో దాగున్న కాంప్లెక్సిటీస్ అన్నీ తర్వాత తర్వాత బయటికొచ్చాయి.

... ... ...

రజనీకాంత్, అమరేంద్ర, బిఎస్ఎన్ఎల్ యూనియన్ నాయకులు హడావుడిగా హాల్లోకి దూసుకొచ్చారు. ఇద్దరూ కేశవస్వామి శిష్యులే. ఒక నిమిషం మాట్లాడుతున్న వక్త మాటలు వైపు దృష్టి పెట్టి, పెదవి విరుపుతో, ట్రేలోని టీకప్పులందుకొని, ఎడమ వైపున్న గ్లాస్ డోర్ తోసుకొని కారిడార్‌లో సిగరెట్లు ముట్టించారు. రవి వైపు చూస్తూ యేదో మాట్లాడుకుంటున్నారు. ఆగి ఆగి నవ్వుకుంటున్నారు. తన గురించేనా లేక తను అనుమాన పడుతున్నాడా అనిపించింది రవికి. వీళ్లు రవికి తెలుసు. బీటెక్‌లో రవికి సీనియర్లు. కవిత్వమంటే పడదు. కవుల మీద సెటైర్లకు కొదవుండదు. ఆ తర్వాతెప్పుడో బిఎస్ఎన్ఎల్ డిపార్ట్మెంట్‌లో వుద్యోగాలొస్తే చేరినట్టున్నారు. విప్లవ శిబిరంలో తిరుగుతుంటారు. అది సరిగ్గా వాళ్ల స్వభావానికి సరిపోయేదేనని రవి అనుకుంటాడు. రవి చూసిన విప్లవకారులు ఎప్పుడూ సీరియస్‌గా, మనుషుల పట్ల అనహనంగా, తరతరాల అన్యాయాలను క్షణాల్లో రూపుమాపాలన్నట్లు వుండినారు. అందుకే వీళ్లంతా యింతే అనే అభిప్రాయంతో వున్నాడు. టీ సిగార్ ముగించి రజనీకాంత్, అమరేంద్ర హాల్లోకి తిరిగొచ్చి తన పక్కనే అనాసక్తిగా కూర్చోవడంతో, జేబిలోని కవిత పది టియంసిల నీళ్లంత బరువుగా అనిపించింది. కవిత చదివితే వినీ యీ లాంటి కవిత్వాల వల్ల రాయలసీమ వొస్తుందా అంటారేమోననిపించింది. సరిగ్గా సమయానికి ఒక వక్త అంటున్నాడు..

"నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణం జరుగుతూంటే పార్లమెంటరీ కమ్యూనిస్టులు ఎట్లాగూ మాట్లాడలేదు. వాళ్లు విజయవాడతోనూ కోస్తా కమ్మ రైతాంగంతోనూ వున్నారు. మరి విప్లవవాదులు ఏం చేస్తుండిరో, రాయలసీమ భవిష్యత్తు గురించి యేమనుకునేవారో. 'రాయలసీమ తల్లీ, నా కల్పవల్లీ నీలమన్న నీకోసం ఎరుపు పంట పండించెనమ్మా' అంటూ పాటలు పాడుకున్నారో. ఆ తర్వాత కొందరు ప్రభంజనం అంటూ తాళం వేసుకుంటూ రాయలసీమను పెద్ద రెడ్ల పంచన చేర్చారో గానీ యిప్పుడు మళ్ళీ మేమే అసలు సిసలు విద్యావంతుల మంటూ ప్రత్యక్షమవుతున్నారు...' ఆ మాటలకు రజనీకాంత్ కృతకంగా ఒక నవ్వు నవ్వాడు. పోబే నీకేం తెలీదు, అన్నట్లుందా నవ్వు.

ఆ ఎద్దేవాకు చాలా మంది స్పందించారు. లలిత, "ఐ అబ్జెక్ట్ యిట్ సార్, అసలప్పటికి ఐక్య కమ్యూనిస్టు పార్టీనే వుంది. యిప్పుడు మీరు ఆరోపిస్తున్న విప్లవోద్యమం లేదు కదా. మనం చూడని చరిత్ర గురించి తీర్పులు యివ్వగూడదు" అంది.

మాట్లాడుతున్న వక్త "సరే సరే నమ్మా, నాగార్జున సాగర్ నిర్మాణ సమయంలో లేరనుకుందాం, శ్రీశైలం ప్రాజెక్టు కట్టే ముందైనా అభ్యంతరం పెట్టాల్సుండె గదా. మేం వేగుచుక్కలం అనుకునే వారికి యీ ప్రశ్నలు తప్పవమ్మా..'' అంటూ కొనసాగించాడు. మాట్లాడుతున్న ప్రతి వక్తా గత విషయాల్లోనుంచే తన వాదనను వినిపిస్తున్నాడు. తనకు తెలిసిన యేదో వొకటి చారిత్రక విశేషాన్ని (అనెక్‌డోట్) చెప్తూనే వున్నాడు.

తర్వాత, యింకోకాయన అంటున్నాడు "...మనం కమ్యూనిస్టులను అంటున్నాం గానీ, కమ్యూనిస్టులను చాలా వాటికి అనాల్సిందే గానీ రాయలసీమ చరిత్రలో నీలం సంజీవరెడ్డి చేసినంత ద్రోహం మరెవరూ చేసుండరు. ఆయన ముఖ్యమంత్రి కావడానికి కోస్తా ప్రయోజనాలకు కట్టుబడి పోయాడు. అనంతపురం ప్రజలు ఆయన్ను ఎమ్మెల్యేగా ఓడించి తరిమెల నాగిరెడ్డిని ఎన్నుకోవడం మీద కూడా కోపం కలిగివుంటుంది. 1946 లోనే మద్రాసు ప్రెసిడెన్సీకి ముఖ్యమంత్రిగా వుండిన టంగుటూరి ప్రకాశం పంతులును రాజీనామా చేయించిన చాణక్యుడు సంజీవరెడ్డి. ఆ టైంలో రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు. తను అనుకొని వుంటే రాయలసీమను మద్రాసు రాష్ట్రంలోనే వుండేలా చేసుండేవాడు. రాజగోపాలాచారి వున్నంతకాలం తాను ముఖ్యమంత్రి కాలేడు అనుకొని, పట్టాభి సీతారామయ్య శిష్యుడిగా కోస్తా రాజకీయాలను సమర్థించాడు. తనకు రాయలసీమ నుంచి అడ్డు వస్తాడనుకొని బళ్లారికి చెందిన హాలహర్వి సీతారామిరెడ్డిని తొలగించుకోవడానికి బళ్లారినే ఆంధ్రప్రదేశ్‌లో కలవకుండా చేసాడు. చెప్పుకుంటూ పోతే సంజీవరెడ్డి కథలు చాలా వున్నాయి."

ఆయన అభిప్రాయం ముగియగానే, కేశవస్వామి సార్ రవిని లేపి "ఇదిగో యీ యువకుడు, ఎ బర్నింగ్ పొయెట్! యిప్పుడొక కవిత చదువుతాడు" అన్నాడు. రవి లేచి జేబిలోంచీ పేపర్ తీస్తుండగా, ఉరుకుంద, హడావుడిగా హాల్లోకి వచ్చాడు. అతను ఆలూరు ప్రాంతంలో రాయలసీమ గురించి పనిచేస్తుంటాడు. 'మొన్న సాయంత్రం రాయలసీమ యూనివర్సిటీలో మీటింగ్ పెట్టిన మన పిల్లలను పోలీసులు స్టేషన్‌కు తీసుకుపోయారట. స్వామి సార్ యీ మీటింగ్ అయిపోతూనే మనం స్టేషన్‌కు పోవాల.' అంటూ కూర్చున్నాడు. హాల్లో కలకలం రేగి, సర్దుకుంది.

"కవీ నువ్వు మొదలు పెట్టు" అన్నాడు స్వామి సార్.

"ఒరుపు కన్నుల తల్లి" కవిత చదువుతున్నంత సేపూ అందరూ పరిసరాలను మరిచిపోయారు. రాయలసీమ ఎండ మొత్తం హాల్లో నిండుకున్నట్లనిపించింది. లోపలి ఉక్కబోతనంతా అక్షరాలుగా మలచి కవి బరువు దించుకున్నాడేమో ననిపించింది.

మూర్తి సార్ లేచి చప్పట్లు కొడుతూ, "ప్రకృతిలోని ఎండ మేఘం కాదు యీ దుస్థితికి కారణం. రాయలసీమ తల్లి కన్న నాయక పుత్రులు చేసిన నిర్వాకం, అంటూ రహస్యాల గుట్టు విప్పిన కవితిది. రాయలసీమ కొత్త తరం కవి గొంతుది. ఇంత కాలం ప్రాంతీయ అస్తిత్వాన్ని, దాని చైతన్యాన్ని మాత్రమే పలికారు యిక్కడి కవులు. ధిక్కారాన్ని యీ కవి పలుకుతున్నాడు. ప్రామిసింగ్ పొయెట్

యిన్ మేకింగ్. ఇతనికి పలకండి స్వాగతం." అన్నాడు. అందరూ గట్టిగా చప్పట్లు కొట్టారు. రజనీకాంత్ షేక్‌హ్యాండ్ యిచ్చాడు. అనూహ్య పరిణామానికి రవి బిత్తరపోయాడు. ఎందుకంటే ఆ షేక్‌హ్యాండ్‌లో నిజాయితీ వుంది. ఆ తర్వాత మూర్తి గారినే మాట్లాడమన్నారు.

మూర్తి గారి పూర్తి పేరు కొప్పర్తి రాఘవమూర్తి. మూర్తి గారి తండ్రి తూర్పు గోదావరి నుంచి వుద్యోగ రీత్యా రాయలసీమకు వచ్చాడు. కర్నూలు జిల్లా కోవెలకుంట్ల మున్సిఫ్ కోర్టులో పనిచేసిన కాలంలో రాఘవమూర్తి తన హైస్కూలు చదువు కోవెలకుంట్ల లోనే పూర్తిచేసాడు. ఆ తర్వాత తండ్రితో పాటు కోస్తా జిల్లాలకే తిరిగి వెళ్ళిపోయినా, ఆంధ్రా యూనివర్సిటీలో ఎంఏ చరిత్ర చదివి, హిస్టరీ లెక్చరర్‌గా వుద్యోగం తెచ్చుకుని తిరిగి రాయలసీమ ప్రాంతంలోనే పనిచేస్తున్నాడు. ఈయన గురించి సీమ హృదయం కలవాడని అందరూ అనుకుంటారు.

"మీరింతకు ముందెప్పుడూ ఎక్కడా వినని ఒక అనెక్‌డోట్ చెప్తా. 1953లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడ్డాక కృష్ణా నది మీద ప్రాజెక్టు కట్టాలని నిర్ణయం తీసుకున్నప్పుడు, నందికొండ వద్దనా, సిద్దేశ్వరం వద్దనా ఎక్కడ నిర్మించాలని చర్చ జరిగింది. ఆనాటి రాయలసీమ నాయకులు నివర్తి వెంకటసుబ్బయ్య, పెండేకంటి వెంకట సుబ్బయ్య, అనంతపురానికి చెందిన చల్లా సుబ్బారాయుడు సిద్దేశ్వరం వద్దనే నిర్మించాలని నెహ్రూకు నివేదించారు. ఆ తరుణంలో నెహ్రూ, ఆ విషయాన్ని ప్రముఖ ఇంజనీరు కె.ఎల్.రావును పరిష్కరించ మన్నారు. అదే సమయంలో సిద్దేశ్వరం వల్ల కర్నూలు మునిగిపోతుందనీ, సిద్దేశ్వరం వద్ద పునాదులు నిలువవనీ ప్రచారం జరిగింది. కర్నూలు మునిగినా మునగకున్నా అలంపూర్ మునగడం ఖాయం అనుకొని, అలంపూర్‌లో ప్రసిద్ధుడైన గడియారం రామకృష్ణ శర్మ ఆంధ్ర సారస్వత పరిషత్తు సమావేశాన్ని అలంపూర్‌లోనే యేర్పాటు చేయించి అప్పటి ఉపరాష్ట్రపతి రాధాకృష్ణన్‌ను ఆ సమావేశాలకు పిలిపించి చెప్పించాడు. అక్కడితో ఆగకుండా కంచి కామకోటి పీఠాధిపతి చంద్రశేఖరేంద్ర స్వామీజీతో కూడా రాధాకృష్ణన్‌కు చెప్పించాడు. రాధాకృష్ణన్ నెహ్రూతో సిద్దేశ్వరం వద్ద ఆనకట్ట వద్దన్నాడు. అప్పటికే కె.ఎల్.రావు నందికొండ వద్ద ప్రాజెక్టు కట్టాలని రిపోర్ట్ యిచ్చున్నాడు. దాంతో నెహ్రూ నిర్మాణం నందికొండ వద్ద జరుగుతుందనీ వేరే చర్చ యిక లేదనీ తేల్చేసాడు. నీలం సంజీవరెడ్డికి నెహ్రూను వొప్పించేంత శక్తీ, ఆసక్తి ఎట్లాగూ లేవు. ప్రాజెక్టు నాగార్జున సాగర్‌గా నిలబడింది. అలంపూర్ రాజకీయ నాయకుల పాత్ర చరిత్రలో తెలియని కథగా మిగిలిపోయింది."

"కర్ణుడి చావుకు కారణాల లాగా రాయలసీమకు చావు నీళ్లు చల్లడానికి చరిత్రలో అంత మంది పనిచేసారా" హాల్లో కూర్చున్న వాళ్లలో ఎవరో గట్టిగా అన్నారు.

మూర్తి గారు తన మాటలు కొనసాగిస్తూ, "అంతే గాదు, ఆ శాపకారణాలలో మన విద్యావంతులు కూడా వున్నారు. చైతన్యమే లేని వాళ్లై వున్నారు. 1948లోనే ఖోస్లా కమిటీ సిద్దేశ్వరం సందర్శించి రిపోర్టు యివ్వాలనుకున్నప్పుడు, ఆ కమిటీని నందికొండకు తీసుకుపోయి చూపించడానికి స్వంత ఖర్చులతో నందికొండకు రహదారి నిర్మించిన చైతన్యం కోస్తా వాళ్లది. వావిలాల గోపాలకృష్ణయ్య, వాసిరెడ్డి గోపాలకృష్ణ, కె.ఎల్. రావూ ప్రజల్లో చైతన్యానికి కారకులు. రాయలసీమలో పప్పూరి రామాచార్యులు వంటి నాయకుడు వుండినా కోస్తా మేధావులు కడప కోటిరెడ్డిని విజయవాడలో ఏనుగు అంబారీ ఎక్కించి, తమ వైపు తిప్పుకున్నారు. బ్రాహ్మణ నాయకత్వాలకు తెరదించి శూద్ర కులాలు రాజకీయాలు చెలాయించే క్రమంలో సంజీవరెడ్డి స్ట్రాటజిక్‌గా తన కులాన్ని, తన ప్రాంతాన్ని జమిలిగా వాడుకున్నాడు. సంజీవరెడ్డికి రాయలసీమ హృదయం లేదు. ఇలాంటి నాయకులే రాయలసీమ నుంచి వెళ్తున్న నదుల నుంచి నీళ్లు తీసుకోలేని స్థితికి రాయలసీమను చేర్చారు. ఏ ట్రిబ్యునల్ తీర్పులూ అడ్డు లేని రోజుల్లో నిర్మించాల్సిన ఆనకట్టలు కట్టకుండా వుండిపోయి, ఏ నిర్మాణాలకూ జలాలు కేటాయింపు లేని కాలంలో అన్యాయాన్ని గుర్తించే చైతన్యం అబ్బి, మనమిలా మీటింగులు పెట్టుకుంటూ వుత్త మాటలు మాట్లాడుకుంటున్నాం. దాన్నుంచి మరింత వేదనా, అశాంతి తప్ప ప్రయోజనం లేకుండా పోయింది.'

"సార్, కోస్తా ఆలోచనాపరుల్లో మీలాగా రాయలసీమ గురించి ఆలోచించే వాళ్లు ఎవరూ కనపడరు. భాష పేరుతో, జాతి పేరుతో, రాష్ట్రం పేరుతో పక్క ప్రాంతానికి యింత అన్యాయం జరిగిందని సామాన్య ప్రజలకు తెలీకున్నా , మేధావులకైనా తెలుసు కదా. దాన్ని చెప్పాల కదా. అలా ఎందుకు జరగలేదు." రజనీకాంత్ తీక్షణంగా అడిగాడు.

"ఇక్కడున్న మేధావులకూ, రాజకీయ నక్కలకూ జరిగిన అన్యాయాల పట్ల స్పృహ లేనప్పుడు, ఎక్కడో వుండే వాళ్ల కెందుకుంటుంది. వాళ్ల నెందుకనాల. అవకాశం వచ్చిందీ అందిపుచ్చుకున్నారు. అక్కడి రాజకీయ నాయకుల్ని మెచ్చుకోవాలి కదా మరి." అమరేంద్ర అన్నాడు.

"మన చదువులకు అర్థం లేదు. మన ఆలోచనలకు దారి లేదు. మన చైతన్యానికి గమ్యం లేదు. మనదొక శప్తభూమి అంటూ యీ యువ కవి రాసింది అందుకే కదా", అంటూ కేశవస్వామి సార్ మళ్లీ రవి కవిత దగ్గరికే వచ్చాడు.

తను కూడా ఒక కవిత చదవడం ప్రారంభించాడు. ఆ కవిత వింటుంటే అందరూ ఉద్వేగంతో, భయంతో తీవ్రంగా వీచే రవ్వగాలిలో చిక్కుకు పోయినట్లు అనిపించింది. ఎండ గుర్రాల గిట్టలు ఎదల మీద పడుతున్నట్లనిపించింది. నిలువునా కాలిపోతున్న పచ్చని చెట్లలా దేహాలు మల మల మాడిపోతున్నట్లనిపించింది. ఒక విధ్వంస దృశ్యం కళ్లముందు నిలిచింది. కరువూ కక్షల కార్పణ్యాలూ కాదు కారణం, బతికున్న తల్లి తలకు కాష్టం పెడుతున్న పుత్రుల కుటిల నైపుణ్యాలు కారణమనీ యీ వొరుపు కన్నుల తల్లికి ఎండ గుర్రాల మీద వూరేగింపులు తప్ప పచ్చని గట్ల మీద ముచ్చట్లు వుండవని తేల్చాడు. రాయలసీమ నిర్భాగ్య నిరుద్యోగ యువతకు పారిపోయినా తలదాచుకోవడానికి పట్నంలేని స్థితిని వివరించాడు. ఆ పద విన్యాసానికి ఒక్కసారిగా హాల్ మొత్తం మరణ నిశ్శబ్దంలోకి చేరింది.

లలిత కళ్లు ధారలు కడుతున్నాయి. గతంలో ఆ కవితను వాళ్లమ్మకు చాలా సార్లు చదివి వినిపించింది మరి. రాఘవ మూర్తి సార్, "అమ్మాయ్ నెమ్మది పడూ", అని గద్గదమైన గొంతుతో అంటున్నాడు.

" రాయలసీమకు నీళ్ళు నిలుపుకునే నిర్మాణాలేవీ లేవు. చిన్న చిన్న ప్రాజెక్టులైనా సాధించుకోవడమొక్కటే మిగిలి వున్న మార్గం. వేదవతీ, గుండ్రేవుల లాంటివి. సిద్ధేశ్వరానికి చాలా అడ్డంకులున్నాయి. వీటిని సాధించుకున్నా రాయలసీమకు యేదోమేరకు న్యాయం జరుగుతుంది." మూర్తి సార్ అక్కడున్న వాళ్లని అనునయించడానికి చెప్తున్నాడు.

"సార్, గుండ్రేవులైనా, సిద్ధేశ్వరమైనా నిర్మించాలంటే తెలంగాణాను వొప్పించాలి. ఆ పని చేసే చిత్తశుద్ధి మన ప్రభుత్వాలకు లేదు. బాబు గవర్నమెంట్ గుండ్రేవుల కోసం నిధులు మంజూరు చేసే జీవో అయినా యిచ్చుండెనా, ఇప్పుడున్నాయనైతే ఎంగిలి చేతిని కూడా విదిలించింది లేదు. గుండుగుత్తగా ఎమ్మెల్యేలను యిచ్చినా ఆ పార్టీలో అడిగేవాడు లేడు. మన లాంటి వారు లెక్కలోకి కూడా రారు. ఇంకేం న్యాయం జరుగుతుంది", రజనీకాంత్ అన్నాడు.

అప్పుడు సుడిగాలిలా ఒక గుంపు లోపలికొచ్చింది. గుంపు అలా లోపలికొస్తూనే ,

"ఏం కేశవస్వామి సార్ యీ కిషోర్ చెప్పేదేమీ లేకుండానే మీరు సమావేశం ముగించాలని చూస్తున్నారా?" అనే గొంతు వినిపించింది. ఒక్కసారిగా అందరూ అటువైపు చూసారు .

"ఓ కిషోర్ నువ్వెప్పుడొచ్చావ్. అయినా నిన్నెప్పుడైనా చెప్పనీకుండా అడ్డుకున్నామా" కేశవస్వామి .

"ఓ కిషోర్ అంటే యితనా" అనుకున్నాడు రవి. మూర్తిగారు మాట్లాడేప్పుడు లోపలికొచ్చి, తలుపు దగ్గరే కూచోవడం చూసాడు. "ఏందీ నాటకీయతను ప్రదర్శిస్తున్నాడు. చూడ్డానికి చాలా స్మార్ట్‌గా వున్నాడు గానీ టక్కుటమారాల మనిషిలా వున్నాడే. లలిత యితన్నెలా నమ్మిందబ్బా" అనుకుంటుండగానే, రజనీకాంత్, "గిరీశం గాడు దిగాడ్రా" అంటున్నాడు.

"కిషోర్ యిలా పైకొచ్చి మాట్లాడూ..." పిలిచాడు మూర్తి.

"నన్నెవరు అడ్డుకుంటున్నారో మీ అందరికీ తెలుసు. ఏం మూర్తీ సార్ మీకు తెలీదా? మనుషుల్లో, వ్యవస్థల్లో మార్పు సహజమని నమ్మే మీరే నాలో మార్పొస్తే తప్పుపడతారు. మీ అందరికీ తెలిసిన కథే. నేనింకోసారి చెప్తాను. మా వూరు ఎమ్మిగనూరు. మావూళ్లో తెలిసిన ఒకతనికి ఒక ప్రేమకథ వుండేదని అనుకునేవారు. అమ్మాయీ అబ్బాయీ ప్రేమించుకున్నారు. నువ్వు చాలా చాకచక్యం కలవాడివి, ముంబాయి పోయి పెద్ద మాఫియా డాన్ అయితేనే నిన్ను పెళ్ళి చేసుకుంటా అంటుంది అమ్మాయి. లేదు యీ వూర్లోనే ప్రజలకు అండదండగా వుంటూ బతుకుదాం అంటాడు అబ్బాయి. డాన్ అయితే నేను ఎన్‌కౌంటర్ అయిపోతాను కదా అంటాడు. లేదు లేదు నువ్వు డాన్ అయితేనే మనం పెళ్లి చేసుకుందాం లేకుంటే కుదరదనేస్తుంది. వాళ్లిద్దరూ విడిపోయారు. ఇదే కథను యింకోరకంగా కూడా చెప్పుకోవచ్చు. డాన్ బదులు నక్సలైట్ అనొచ్చు. ఇప్పుడు నా పరిస్థితి అంతే. కమ్యూనిష్టులు కులం పట్టించుకోకుండా విమర్శల పాలైనారని నేను పట్టించుకుంటే కులవాదినై పోతిని. రాయలసీమ కోసం కేంద్రంలో అధికారంలో వుండబోయే వారితో కలసి పనిచేద్దామనుకుంటే అంటరాని వాడైపోతిని. ఎవరిదన్యాయమో మీ విజ్ఞతకే వదిలేస్తా"

కిషోర్ ఎవరి గురించి మాట్లాడుతున్నాడో అందరికీ అర్థమైపోయింది.

''వీడూ వీడి అవకాశవాదమూ. కమ్యూనిస్టులు మారడమంటే కుల సంఘాలు యేర్పరచి పూసుకుని తిరగడమూ, అభివృద్ధి పేరుతో ఫాసిస్టులను వెనకేసుకు రావడమూనా . కొడుకును తొక్కి చంపాల." అంటూ అమరేంద్ర లేచాడు. మూర్తి సార్ పట్టుకున్నాడు.

"కిషోర్ చెప్పాల్సినవి మాత్రమే చెప్తే బాగుంటుంది. అనవసరమైన ఉపకథలు చెప్పుకోవడం వల్ల వుపయోగం లేదు కదా"

"మీరు చంద్రశేఖరేంద్ర స్వామీజీని చరిత్ర లోంచి తవ్వితీయ్యగా లేనిది, నేను అపూర్వ ప్రేమికురాలి గురించి చెప్తే తప్పైందా సార్.'

"రాయలసీమ నీటి సమస్యకు సంబంధించిన విషయం యే మూలలో వున్నా తవ్వి తెలియజేయడమే మన అజెండాగా చేసుకోవాలి కిషోర్. రాయలసీమకు సంబంధం లేనివి చెప్పి యేం సాధిస్తావు? సంఘీయులతో కలవాలంటే నీయిష్టమే. మధ్యలో అమ్మాయి గత జీవితంలో తీసుకున్న నిర్ణయాన్ని ఎందుకు ఎత్తిచూపి బదనాం చేయడం" అంటూ స్వామి సార్ పైకి లేచాడు.

ఆ సంభాషణ వినలేక లలిత చరచరా బయటికి నడచి పోయింది. "రారా తమ్ముడూ.." అంటూ రవినీ లాక్కపోయింది. ఆమె చేతులు వణుకుతున్నాయి. ఆమె ఆందోళన రవికర్థమవుతోంది. వాళ్ల వెంటే రజనీకాంత్, అమరేంద్ర బయటికొచ్చేసారు.

"లలితా లలితా డోంట్ బీ డిస్టర్బ్.." అంటున్నాడు అమరేంద్ర.

లలిత తన కార్ లాక్ ఓపన్ చేసి డ్రైవింగ్ సీట్లో కూర్చుంటూ, "కవీ, నీకేం పని లేకపోతే రా ముందు కూచో" అని పిలిచింది.

అది రవికి ఆజ్ఞాపనగా అనిపించింది. కారు వెనుక డోర్లు తెరుచుకుని రజనీకాంత్, అమరేంద్ర కూర్చున్నారు.

"లలితా ఎక్కడికి, కాస్త నిదానంగా నడుపు" అంటున్నాడు రజనీకాంత్.

"నాలాగే ఆశపడీ దగాపడ్డ నేల సిద్ధేశ్వరం. దాన్ని చూస్తే నాకేదో మనశ్శాంతి. దాన్ని చూస్తే నాకేదో అలజడి కూడా. ఆ నీళ్ల మీద పుట్టి మునిగి మరణించిన మా పెద్దలు గుర్తొస్తారు. వాళ్ల ఆశయాలను నిలబెట్టాల్సిన బాధ్యతా గుర్తుకొస్తుంది. ఈ మధ్యాహ్నం అదే నన్ను స్వస్థత పరిచే క్షేత్రం. నాతో పాటు వచ్చే వాళ్లు రావొచ్చు" హిస్టీరిక్‌గా అంటోంది లలిత.

"సరే పదా, అదే మన దర్శనీయ స్థలం.." అన్నారిద్దరూ.

చీకటి తెరలు కమ్మిన వాస్తవంలోంచీ, ఎండగుర్రాలు ఎగురుతున్న గాల్లో ప్రయాణిస్తూ, సప్త నదులు సంగమించినా చుక్క నీళ్లు రాయలసీమ తీసుకోలేకపోతున్న ప్రదేశానికి వెళ్తున్నారు వాళ్లు. సిద్ధేశ్వరానికి లలితను నడిపిస్తున్న కథ వేరు. రవి వెళ్తున్న కారణం వేరు. అనేక సమాంతర కథనాలు నడిపిస్తే నడిచేదే కదా జీవితం.



వ్యాసం

# మార్పు-యథాతథ స్థితి: బూర్జువా ప్రజాస్వామ్యం

**పాణి**

(గత సంచిక తరువాయి..)

మార్క్సిజంలో సామాజిక మార్పుకు హింస గురించి చాలా తాత్విక, చారిత్రక విశ్లేషణ ఉన్నది. హింసను మంత్రసాని పనితనంతో పోల్చడం చాలా సంక్లిష్టమైన భావన. గర్భంలో అనేక ఆంతరంగిక పరిణామాల వల్ల పిండం రూపుదాల్చుతుంది. ఎదుగుతుంది. శిశువుగా మారుతుంది. అవన్నీ అయ్యాక తొమ్మిది నెలలకు బైటి నుంచి మంత్రసాని పనితనం శిశువు పుట్టుకకు దోహదం చేస్తుంది. ఇవేవీ లేకుండా బైటి నుంచి హింస ప్రయోగిస్తే శిశువు పుట్టుక జరగదు.

ఇది చాలా ప్రాథమిక పాఠంగా కనిపిస్తుందిగాని, హింస గురించిన అత్యున్నత తాత్విక అవగాహన. ఇదంతా మార్క్స్‌కు ఉన్నదేమోగాని మావోయిస్టుల్లో లేదనే వాళ్లూ ఉండొచ్చు. అలాంటి వాళ్లు మార్పును పక్కన పెట్టి హింసను కేంద్రం చేసుకుంటారు. అప్పుడు వాళ్ల వాదన ఊబిలా తయారవుతుంది. మార్పు క్రమాలను, హింసా రూపాలను మావోయిస్టు ఆచరణ నుంచి పరిశీలించడమే దీనికి పరిష్కారం. అప్పుడు చాలా సందేహాలు తీరుతాయి.

అజయ్ తన సంపాదకీయంలో ప్రస్తుత రాజకీయార్థిక వ్యవస్థలో బలమైన రాజకీయ నిర్మాణం ఏర్పాటు చేయడానికి మావోయిస్టులకు హింస తప్పనిసరి మార్గమైందని అంటారు. ఈ మాట అనేక రకాలుగా చెప్పడానికి ప్రయత్నించారు. దీని సారాంశం ఏమంటే-విప్లవోద్యమం అప్రజాస్వామికం అవుతుంది. బూర్జువా ప్రజాస్వామ్యం పరమ ప్రజాస్వామ్యం అవుతుంది.

ఆయన విప్లవ హింసతోపాటు మార్పు గురించి కూడా ఇందులో కొంత చర్చించారు. అయితే బూర్జువా ప్రజాస్వామ్యంలోని ఏ అంశాలు మౌలిక మార్పుకు అడ్డంగా ఉన్నదీ పరిశీలించ లేదు. దీనికి పెద్ద సిద్ధాంత చర్చలు అక్కర లేదు. క్షేత్రస్థాయిలో డెబ్బై ఏళ్ల బూర్జువా ప్రజాస్వామ్య ఆచరణ ఎలా ఉందో పరిశీలిస్తే చాలు.

మన ప్రజాస్వామ్యం తన రూపంలోనే కాక ఆంతరంగికంగా కూడా కొన్ని మార్పులకు లోనైంది. కానీ అది ఆర్థిక వ్యవస్థలో, సాంఘిక సాంస్కృతిక వ్యవస్థలలో మౌలిక మార్పులను అడ్డగించింది. బూర్జువా ప్రజాస్వామ్యం వల్ల వచ్చిన మార్పులను, రాకుండా ఆగిపోయిన మార్పులను తులనాత్మకంగా పోల్చితే దానికి నిరోధ గుణమే ఎక్కువ అని తెలుస్తుంది. సారాంశంలో ఇదే దాని మౌలిక లక్షణం.

అందుకే బూర్జువా ప్రజాస్వామ్యం ఏ ఆధిపత్య శక్తులను నిలువరించింది? ఏ హింసా రూపాలను అరికట్టింది? ఏ దోపిడీని రద్దు చేసింది? లేదా వేటిని ప్రోత్సహించింది, కొనసాగిస్తున్నది,

**భిన్న దృక్పథాలు**

ప్రజాస్వామ్యం ప్రత్యామ్నాయ రాజకీయాలు

ఎడిటర్

అజయ్ గుడవర్తి



వరవరరావు | ఆనంద్ తేల్‌తుంబ్డే | హరగోపాల్

నీరా చందోక్ | సుమంత బెనర్జీ | బాలగోపాల్




బలోపేతం చేస్తున్నదీ చెప్పడానికి శాస్త్రీయ అవగాహన ఉండాలి. ఒక సిద్ధాంత చట్రం ఉండాలి. అంతకుమించి ప్రజా జీవితంలోని వాస్తవాలను నిశితంగా గుర్తించాలి. అట్లాకాక ఒక సిద్ధాంతాన్ని తయారు చేసుకొని దాన్ని బలపరచడానికి వాదన చేయడం వల్ల ప్రయోజనం లేదు. వాస్తవాలను ఆ సిద్ధాంతానికి బలిపెట్టడం వల్ల ఏ కొత్త అవగాహనా కలగదు. బూర్జువా ప్రజాస్వామ్య విస్తరణను, దాని జనాకర్షణ స్వభావాన్ని అధ్యయనం చేయడానికి ఈ అప్రమత్తత అవసరం. అప్పుడు మాత్రమే మార్పును నిరోధించే, మార్పుకు దోహదం చేసే రెండు లక్షణాలు బూర్జువా ప్రజాస్వామ్యానికి ఎలా ఉన్నదీ దాని ఆచరణ నుంచి విశ్లేషించగలం. సమాజంలో ఏ మార్పులు వచ్చాయో, యథాతథ స్థితి ఎంత పేరుకపోయిందో మదింపు చేయగలం.

మామూలుగా బూర్జువా ప్రజాస్వామ్యం అన్ని సమాజాల్లో

ఒకేలా ఉండదు. ఆ సమాజంలోకి అది ఎలా వచ్చింది? ఎలా పాదుకున్నది? అనే వాటిని బట్టి ఆ సమాజంలో బూర్జువా ప్రజాస్వామ్యం కొన్ని ప్రత్యేక లక్షణాలను సంతరించుకుంటుంది. ఎన్నికలు జరగడం, రాజ్యాంగం ఉండటం, చట్టసభలు నడవడం అనేవి ఒక ముఖ్యమైన విషయమే. కానీ అవి బూర్జువా స్వభావంతో అయినా పని చేయగల స్థితికి సమాజం ఎదిగిందా? అనే దానినిబట్టి వాటిని అంచనా వేయాలి. వాటి పాత్రను మదింపు చేయాలి. కాబట్టి బూర్జువా ప్రజాస్వామ్యాన్ని పాలనా విషయానికి పరిమితం చేసి లిబరలిజం ఉందనుకోవడం రాజకీయ పరిణతిని సూచించదు. మన దేశంలో అనేక సాంఘిక, సాంస్కృతిక, భావజాల విషయాలను బట్టి, ఆర్థిక సంబంధాల్లో మార్పులనుబట్టి ఉదారవాద విలువలు, బూర్జువా ప్రజాస్వామ్య ప్రక్రియలు ఎంత నెలకొన్నాయో అంచనా వేయాలి. సామాజిక రాజకీయార్థిక సాంస్కృతిక వ్యవస్థలన్నిటినీ పరిగణలోకి తీసుకోకుండా ముక్కలు ముక్కలుగా దేనికది విడిగా చూడటం వల్ల ఏ ప్రయోజనమూ ఉండదు. అది కేవలం సిద్ధాంత కసరత్తుగా, పండిత చర్చగా మిగిలిపోతుంది.

ఈ పుస్తకంలో ఒక చోట కులం గురించి చెబుతూ అజయ్ – **'కుల వ్యవస్థ లౌకికీకరణ–అంటే ఆధునిక అవసరమైన ఎన్నికల కోసం సాంప్రదాయ వ్యవస్థ అయిన కులాన్ని సమీకరించుకోవడంతోపాటు పరంపరాగతమైన, కచ్చితమైన, హింసతో కూడిన కుల వ్యత్యాసాలను కొనసాగించడం అన్నమాట. ఈ అర్థాన్ని అన్వయించుకోకపోతే ఆధునిక భారతదేశంలో కులం నిర్వహించే పాత్రను కాని లేదా సంస్కృతికి హింసకు మధ్య ఉండే సంబంధాన్ని అర్థం చేసుకోవడం కష్టం..'** అన్నారు.

ఇది చాలా మంచి పరిశీలన. దీన్ని ఇంకా బాగా ఇలా చెప్పుకోవచ్చు. కులానికి, సంస్కృతికి, హింసకు ఉన్న సంబంధాన్ని పార్లమెంటరీ ప్రజాస్వామ్యం 'లౌకికీక'రిస్తున్నది, 'ఆధునికీక'రిస్తున్నది. తద్వారా అది అప్‌డేట్ అవుతున్నది. విస్తరిస్తున్నది. చాలా సంక్లిష్టమైన పని విధానాన్ని సంతరించుకున్నది. అంతిమంగా కులం, దాని ఆధిక్య సంస్కృతి, దోపిడీ కొత్త రూపాల్లో విస్తరిస్తున్నది.

దీన్ని అర్థం చేసుకోడానికి విస్తరిస్తున్న పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోని నాజూకైన రూపాలను, అత్యంత సూక్ష్మ రూపాల్లోకి విస్తరిస్తున్న అగ్రకుల, పితృస్వామ్య రూపాలను పక్క పక్కనే పెట్టుకొని పరిశీలించాలి. ప్రజాస్వామ్యం విస్తరిస్తూ ఉంటే కుల, పితృస్వామ్య తదితర ఆధిక్య సంబంధాలు బలహీనపడాలి. క్రమంగా రద్దు కావాలి. కానీ అవన్నీ కలిసి విస్తరిస్తున్నాయి. బలపడుతున్నాయి. సూక్ష్మ రూపాల్లో కుల, పితృస్వామ్య అణచివేత విస్తరిస్తోంది. ఏ అణచివేత అయినా, దోపిడీ అయినా సూక్ష్మ రూపాల్లోకి మారుతున్నదంటే మరింత బలపడుతున్నట్లే, అప్‌డేట్ అవుతున్నట్లే. మిగతా అన్ని ఆధిపత్య సంబంధాల్లోకి చురుకుగా ప్రవేసించి వాటిని కూడా బలోపేతం చేస్తున్నట్లే. కాబట్టి పార్లమెంటరీ డెమోక్రసీ కులవ్యవస్థను రద్దు చేయడం లేదు. పైగా ఆ రెండూ ఒకదాన్ని ఒకటి బలపరుచుకుంటున్నాయి. అసలు ఇండియాలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యంతో సంబంధం లేకుండా సామాజిక, సాంస్కృతిక హింసలను, ఆధిక్యాలను, ఆర్థిక రంగంలో దోపిడీని, నానాటికీ పెరిగిపోతున్న కొత్త అసమానతలను అంచనా వేయలేం. పార్లమెంటరీ ప్రజాస్వామ్య ప్రక్రియలు, వ్యవస్థలు పైన చెప్పిన సమస్యలకు పరిష్కార మార్గం అనే నమ్మకాన్ని తిప్పేసి చూస్తే ఈ వాస్తవం కనిపిస్తుంది.

అప్పుడు మొత్తంగా బూర్జువా ప్రజాస్వామ్యం కొన్ని మార్పులు తీసుకొస్తున్నప్పటికీ మౌలిక మార్పులకు ప్రతిబంధకంగా మారి యథాతథ స్థితిని పట్టి ఉంచుతుందని అర్థమవుతుంది. పైగా అదే అనేక కొత్త సవాళ్లకు కారణం అవుతున్నట్లు తెలుస్తుంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలోని 'సుగుణాల'ను గుర్తించడమంటే మార్పుకు ప్రతిబంధకమైన దాని మౌలిక స్వభావాన్ని విస్మరించడం కాదు. క్షేత్రస్థాయిలోకి వెళ్లి కుల సంబంధాలను, పితృస్వామ్యాన్ని, ఎన్నికల రాజకీయ సమీకరణాలను పరిశీలిస్తే ఇదే తేలుతుంది.

మన ప్రజాస్వామ్యాన్ని సిద్ధాంతపరంగా ఎంత విశ్లేషించినా అంతుపట్టదు. దాని జటిలమైన పనితీరును గమనించాలి. ఆచరణలో దాని వాస్తవ స్వభావాన్ని అర్థం చేసుకోవాలి.

దేనికంటే మన ప్రజాస్వామ్యం చాలా విచిత్రమైనది. అది అందరికీ ఓటు హక్కు ఇచ్చింది. దళితుల, మహిళల రక్షణకు కాయితం మీద హామీ పడింది. కొంత అనుభవంలోకి కూడా తెచ్చింది. ఇవన్నీ దాని ప్రగతిశీల పాత్రను తెలియజేస్తాయి. భూస్వామ్య వ్యతిరేక విప్లవాలతో, నూతన విలువలతో, దృక్పథాలతో, అనేక వాగ్దానాలతో బూర్జువా ప్రజాస్వామ్యం చరిత్రలోకి ప్రవేశించింది. మన దేశంలోకి వలసవాదంతో వచ్చింది. వలస పాలకులకు–దేశ ప్రజలకు మధ్య తీవ్ర ఘర్షణే జరిగింది. కానీ మౌలికంగా ఈ సాంఘిక సాంస్కృతిక వ్యవస్థలతో ఘర్షణ పడి, వాటిని వెనక్కి తోసేసి ఇక్కడ బూర్జువా ప్రజాస్వామ్యం స్థిరపడలేదు. ఆర్థిక రంగంలో పాత ఉత్పత్తి సంబంధాలు పూర్తిగా రద్దు కాలేదు. అలాంటప్పుడు మిగతా విషయాల్లో ఎలా ఉంటుందో ఊహించవచ్చు. భూస్వామ్యంతో 'సర్దుబాటు' చేసుకోవడం వల్ల ఏర్పడ్డ రాజ్యవ్యవస్థ అని అజయ్ అన్నారు. దీన్ని మిలాఖత్ అంటే ఇంకా బాగుంటుంది. అప్పుడు ఈ సూత్రీకరణను ఇంకా విస్తరించవచ్చు. ఒక్క రాజ్య వ్యవస్థ మాత్రమే కాదు.. భారతదేశంలో ఉత్పత్తి వ్యవస్థ, బూర్జువా ప్రజాస్వామ్యం, ఆధునికత, ఉదారవాదం అన్నీ ఈ సర్దుబాటు నుంచి పుట్టుకొచ్చినవే. తద్వారా జటిలమైన రాజకీయార్థిక, సాంఘిక సాంస్కృతిక వ్యవస్థలు ఏర్పడ్డాయి. వాటిలో హింస మూలాలు ఉన్నాయి. ఈ వ్యవస్థలు మౌలిక మార్పును అడ్డుకుంటున్నాయి. బూర్జువా ప్రజాస్వామ్యం ఈ వ్యవస్థలన్నిటి మధ్య ఉన్న సంబంధాలను స్థిరీకరించింది. అయితే చారిత్రకంగా బూర్జువా ప్రజాస్వామ్యం ఈ యుగానికి చెందినది. కాబట్టి అది ఆధునికంగా కనిపిస్తుంది. చట్టబద్ధమనే పేరు తెచ్చుకుంది. హేతుబద్ధంగా పని చేయడమే దాని సహజ లక్షణం అనే గుర్తింపు సంపాదించుకుంది.

ఈ పుస్తకంలోని రెండు వ్యాసాల్లో అజయ్ ప్రజాస్వామ్యాన్ని ప్రస్తుతించడానికి సరిగ్గా ఇవే కారణం. దాని మీద ఒకటి రెండు విమర్శలు ఉన్నా మౌలికంగా అది ప్రజాస్వామ్యమే... విప్లవోద్యమం దానిని తిరస్కరించింది..అందువల్ల ఈ ప్రజాస్వామ్యానికి విప్లవ హింస ప్రమాదకరంగా తయారైంది.. అనే వాదనను ఆయన తయారుచేశారు. హింసకు, యథాతథ స్థితికి బూర్జువా ప్రజాస్వామ్యంలో కారణాలను వెతకలేదు. పైగా విప్లవోద్యమంలో హింసను చూశారు. ఈ హింస ద్వారా మార్పు సాధ్యమేనా? అనే

ప్రశ్నించారు.

చాలా సందర్భాల్లో ఆయన 'ఆధునిక ప్రజాస్వామ్యం' అనే మాట వాడారు. నిజానికి మన దేశంలోని ఆధునికతను, అధికార మార్పిడి తర్వాత వచ్చిన బూర్జువా రాజకీయ వ్యవస్థను విడిగా చూసి కలిపి అర్థం చేసుకోవాలి. బూర్జువా ప్రజాస్వామ్యం యథాతథ స్థితిని పట్టి ఉంచడాన్ని ఆధునికత వైపు నుంచి కూడా చూడవచ్చు. ఉత్పత్తి సంబంధాల్లోని మార్పుల వైపు నుంచీ చూడవచ్చు. మన సమాజంలోకి నిస్సందేహంగా ఆధునికత ప్రవేశించింది. బూర్జువా ప్రజాస్వామ్యమూ కొనసాగుతున్నది. కానీ వీటి స్వభావం చాలా విచిత్రమైనది, వికృతమైనది.

సారాంశంలో బూర్జువా ప్రజాస్వామ్యం దోపిడీని చట్టబద్ధం చేసింది. కులం, హింస, సంస్కృతితో జతకట్టి తన దోపిడీ స్వభావాన్ని పదిలపరుచుకున్నది. తద్వారా అగ్రకులతత్వానికి, పితృస్వామ్యానికి, వాటి హింసా రూపాలకు, వీటన్నిటితో ముడిపడిన సంస్కృతికి ఆధునిక రూపాన్ని ఇచ్చింది. రాజకీయాల్లో వాటిని క్రియాశీలంగా విస్తరించింది. వాటికి రాజకీయ రంగాన్ని జోడించింది. వేగంగా మారుతున్న ఆర్థిక పునాది మీదికి కులాన్ని తీసికెళ్లింది. తద్వారా కుల వ్యవస్థలాగే పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కూడా మౌలికమార్పుకు పూర్తి ప్రతిబంధకంగా తయారైంది.

దీన్నంతా పట్టించుకోకుండా పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ద్వారా కులం నుంచి విముక్తి పొందాలని కోరుకుంటున్న వాళ్లు పెరిగిపోతున్నారు. వీళ్లలో ఉదారవాదులు ఉన్నారు. దళిత బహుజనవాదులూ ఉన్నారు. ఇదొక భావజాల వాతావరణంగా మారింది. ఈ పరిస్థితుల్లో ఈ ప్రజాస్వామ్యం సాధించిన మార్పులను, సాధించలేకపోయిన మౌలిక మార్పులను వేరు చేసి చూడాలి. మౌలిక మార్పులకు అవకాశం లేని పునాదిని బూర్జువా ప్రజాస్వామ్యం తయారు చేసింది. ఇండియాలో ఇది చాలా సంక్లిష్టమైన వాస్తవం. దాన్ని చారిత్రకంగా అధ్యయనం చేయాల్సే ఉన్నది. దీనికి తగిన పద్ధతి తయారు కావలసే ఉన్నది. ఉత్పత్తి సంబంధాలు, సాంఘిక సాంస్కృతిక సంబంధాలు, రాజ్యాంగం ద్వారా ఉనికిలోకి వచ్చిన వ్యవస్థలు, గత డెబ్బైఏళ్లుగా సాగుతున్న వర్గపోరాటాలు, వివిధ ప్రజా పోరాటాలు మొదలైన వాటిని పరిగణలోకి తీసుకొని ఈ పద్ధతి కోసం ప్రయత్నించాలి. భారత దేశంలోని బూర్జువా ప్రజాస్వామ్యానికి, లిబరలిజానికి ఉన్న ప్రత్యేక లక్షణాలు, పరిమితులు తెలియకుండా అవి ఉన్నాయనుకొని చర్చించడం వల్ల ప్రయోజనం ఏమీ ఉండదు.

వలసవాదం నుంచి ఉత్పత్తి సాధనాల మీద, రాజ్యం మీద అధికారం పొందిన దళారీ బూర్జువా వర్గం భూస్వామ్యంతో, కులంతో, దానికి ఒకానొక ఆధారమైన పితృస్వామ్యంతో, సనాతన ధర్మంతో సర్దుబాటు చేసుకొన్న ఆంతరంగిక అమరిక ఉన్న వ్యవస్థ మన దేశంలో ఏర్పడింది. ఈ వర్గం కేవలం ఆర్థిక సంబంధాల మీదే పని చేయడం లేదు. అత్యంత ప్రాచీనమైన సాంఘిక, సాంస్కృతిక సంబంధాలతో పెనవేసుకొని పని చేస్తున్నది. ఇవన్నీ కలగలసిన వర్గ వైరుధ్యాలు కొనసాగుతున్నాయి. అందుకే భారతదేశంలోని వర్గ వైరుధ్యాలు చాలా జటిలమైనవి. వీటిని చాలా కాలం సంప్రదాయక దృష్టితో చూశారు. నక్సలైట్ ఉద్యమం వచ్చేవరకు ఇదే ధోరణి కొనసాగింది. విప్లవోద్యమం వర్గాన్ని, వర్గ పొందికను, వర్గ సంబంధాలను పరిశీలించే పద్ధతిలో రాడికల్ మార్పు తీసుకొచ్చింది. భారతదేశంలోని ఉత్పత్తి సంబంధాలను, సామాజిక నిర్మితిని, సాంస్కృతిక వ్యవస్థలను, భావజాలాలను విస్మరించకుండా వర్గాన్ని చూడ్డం అనే ఒక కొత్త పద్ధతిని విప్లవోద్యమం తీసుకొచ్చింది. ఇది 1974లో మొదలైంది. క్రమంగా విస్తరించింది. ఒక సమగ్ర సంవిధానంగా మారుతున్నది.

భారత బూర్జువా ప్రజాస్వామ్యాన్ని తిరస్కరించినందువల్ల నక్సలైట్ ఉద్యమానికి ఇది సాధ్యమైంది. ఏ ఏ రంగాల్లో, ఏఏ రూపాల్లో యథాతథ స్థితిని బూర్జువా ప్రజాస్వామ్యం పట్టి ఉంచుతున్నదో గమనించింది. దానికి కారణమైన కులం, మతం, పితృస్వామ్యం తదితర సామాజిక, సాంస్కృతిక, భావజాల సంబంధాల మధ్య వర్గాన్ని చూసింది. ఇవన్నీ కలిసినందువల్ల యథాతథ స్థితి కొనసాగుతున్నది. అదే సమయంలో కొన్ని రంగాల్లో తీవ్రమైన మార్పులు జరుగుతున్నాయి. ఈ మార్పుల్లో దేన్నీ విస్మరించకూడదు. అయితే దోపిడీ పీడనలు, వివక్షలు, అవమానతలు మారుతున్నాయి. రూపం మార్చుకొని బలపడుతున్నాయి. సారాంశంలో యథాతథ స్థితి కొనసాగుతున్నది. దీన్ని దెబ్బతీయకుండా సమాజంలో ఏ మార్పూ రాదు. ఫ్యూడల్, వలస రాజకీయ, పాలనా వ్యవస్థలు రూపంలో రద్దయి, సారంలో సర్దుబాటు చేసుకొని రూపొందిన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఇది.

అందువల్ల పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి ఉన్న మార్పును నిరోధించే గుణాన్ని, హింసాత్మక సారాన్ని కేంద్రం చేసుకోకపోతే దాని వల్ల వచ్చిన మార్పులు కూడా అర్థం కావు. ఆ మార్పులు ఎలా జరిగిందీ వివరించలేము. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ఎన్ని ఆధునిక లక్షణాలు, వ్యక్తీకరణలు ఉన్నా ఈ తిరోగమన, యథాతథ పునాదిని అధ్యయనం చేయడం ముఖ్యమైన పని కావాలి.

ఇండియాలో మౌలిక మార్పు కోసం జరిగే ప్రయత్నానికి ఇక్కడి రాజకీయార్థిక వ్యవస్థ, సాంఘిక సాంస్కృతిక వ్యవస్థలు ఆటంకమైనట్లే ఈ రెండింటి సాంద్ర రూపమైన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అంతకంటే ఎక్కువ ఆటంకం. ఇది మార్పుకే కాదు. అసలు భారత సమాజ సమగ్ర స్వరూపాన్ని కనీసం చూడ్డానికే వీల్లేని నీడలా ఆవరించి ఉన్నది. ఈ పుస్తకం ఉపోద్ఘాతంలో అజయ్ ఒక చోట– **'సమగ్రమైన సామాజిక స్వరూపం మొత్తాన్ని మార్చడం అంటే ఏమిటో మనకు నిజంగానే బోధపడిందా? అన్న ప్రశ్న కూడా ఉదయిస్తుంది'** అంటారు. మార్చడం సంగతి తర్వాత. అసలు అందరికీ సమగ్ర సామాజిక స్వరూపం కనిపిస్తున్నదా అని ప్రశ్నించుకోవాలి. బహుశా పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి యథాతథ, దోపిడీ స్వభావం ఉన్నదనే విమర్శనాత్మక వైఖరే మన దేశ సమగ్ర సామాజిక స్వరూపాన్ని తెలుసుకోడానికి ఒక షరతు.

విప్లవోద్యమానికి పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పట్ల స్పష్టత ఉన్నందువల్ల మొదట్లోనే ఈ సమాజ సమగ్ర స్వరూపాన్ని చూడగలిగింది. అది స్థూలంగానే కావచ్చు. సమానత్వం, దోపిడీ రద్దు, వ్యక్తి స్వేచ్ఛ, ఆత్మగౌరవంతో సకల సృజనాత్మకతలు వికసించగల మానవ సంబంధాల నిర్మాణం వంటి లక్ష్యాలను ప్రకటించుకున్నది. దీనికి రాజ్యాధికారం సాధనమని అనుకున్నదేగాని అదే సర్వస్వం అనుకోలేదు. దోపిడీ వ్యవస్థను, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని, సాంఘిక ఆధిపత్య సంబంధాలను కూలదోసి

రాజ్యాధికారం సాధించాలని ప్రకటించిన తొలి రోజుల్లోనే విప్లవమంటే నూతన మానవుల ఆవిర్భావం అని తాత్వికంగా విశ్లేషించింది. నూతన మానవులు తయారుకాగల భౌతిక, భావజాల, సాంస్కృతిక పర్యావరణాన్ని నిర్మించడం విప్లవంలో అతి ముఖ్యమైన విషయమని కూడా ఆ రోజుల్లోనే చెప్పింది. సంస్కృతి, సాంఘిక సంబంధాల ద్వారా ఈ దేశంలోని ఉత్పత్తి వ్యవస్థ, రాజ్యం కూడా ఎలా పని చేస్తున్నాయో చెప్పింది. అట్లాంటప్పుడు యథాతథ స్థితిని పట్టి ఉంచే పరంపరాగత భౌతిక శక్తిగా సంస్కృతిని ఎందుకు చూడలేదు? సాంఘిక సాంస్కృతిక జీవితాన్నే కాదు, ఆర్థిక జీవితాన్ని కూడా కుల వ్యవస్థలోని అంటరానితనం ద్వారా ఎట్లా నిర్దేశిస్తున్నదో విప్లవోద్యమానికి తొలి రోజుల్లోనే అవగాహన ఉన్నది. కుల వ్యవస్థతో, భూస్వామ్యంతో సర్దుబాటు చేసుకున్న పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఒక ఆధిపత్య వ్యవస్థగా ప్రజల భావజాలాన్ని, ఆలోచనారీతులను నిర్దేశిస్తున్నదని కూడా అప్పట్లోనే చెప్పింది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని తిరస్కరించడమంటే దాని మీద ఆధారపడిన రాజకీయార్థిక, సాంఘిక సాంస్కృతిక వ్యవస్థలను సహితం కూలదోయడం. దేనికంటే భారతదేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కేవలం రాజ్య రూపం మాత్రమే కాదు. రాజకీయ, సామాజిక భావజాలంగా కూడా అది ముందుకు వచ్చింది. అందువల్లే దానిపట్ల తొట్రుబాటు లేని దృఢమైన వైఖరి ఉన్నది. కానీ అజయ్‌కి ఒక పెద్ద సందేహం. **'మావోయిస్టులు తమ విప్లవ అవగాహనలో సంస్కృతికి ఇలాంటి స్థానం ఇస్తారో లేదో తెలియదు'** అన్నారు.

**"స్వభావ రీత్యా సూక్ష్మస్థాయిలో ప్రజాస్వామ్యబద్ధమైన మార్పుకు శ్రీకారం చుట్టిన చరిత్ర, ప్రజాస్వామిక ప్రక్రియలో చొరవతో ప్రారంభించబడిన మార్పులను పరిగణలోకి తీసుకోకుండా 'సమగ్రమయిన సామాజిక స్వరూపం' పూర్తిగా మార్చాలన్న చర్చను ప్రతిపాదించడానికి అవకాశం ఇస్తుందా? హింసకు పాల్పడటం అంటే ఆ మార్పులు అంగీకారం కాదంటూ బలవంతంగా నిరాకరించడమా? 'సమగ్రమైన సామాజిక స్వరూపం'లో తప్పనిసరిగా మార్పు తీసుకరావలసిన అవసరం గుర్తించకుండా అసమగ్రంగా వచ్చిన మార్పును ఎత్తి చూపడమా? ఈ అర్థంలో చూసినప్పుడు, దేశం పరివర్తన చెందే ప్రక్రియలో భాగంగా ప్రజాస్వామ్యం, విప్లవ హింస ఒక దానికి ఒకటి అడ్డుకోకుండా పరస్పరం స్వీయ ప్రతిబింబాలుగా ఉంటూ ఒకదానికొకటి సహాయకారిగా ఉంటాయి అన్న వాదనకు తావుందా? సమాజ పరివర్తనకు సంబంధించిన కీలకమైన స్థానం గుర్తించడం, దానిపై దృష్టి కేంద్రీకరించడం ఎలా?.."** అంటారు అజయ్.

దాదాపు ఇలాంటి భాష ఈ పుస్తకం ఉపోద్ఘాతంలో, ఉపసంహారంలో చాలా చోట్ల కనిపిస్తుంది. ఇంత పెద్ద ఉటంకింపు సారం ఏమంటే-స్వభావరీత్యానే పార్లమెంటరీ ప్రజాస్వామ్యం సాధించిన సూక్ష్మస్థాయి మార్పులను విప్లవకారులు గుర్తిస్తారా? లేదా? అసలు ప్రజాస్వామ్యం, విప్లవ హింస పరస్పరం కలిసి సమాజ మార్పుకు దోహదం చేయలేవా? అని అజయ్ ప్రశ్నించారు.

బూర్జువా ప్రజాస్వామ్యం, విప్లవ హింస పరస్పర స్వీయ ప్రతిబింబాలని అనుకోవడంలోనే అసలు సమస్య ఉన్నది. 'పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఒక వాస్తవం. కాబట్టి దాన్ని అంగీకరించాలి. దాన్ని సాయుధంగా ఎదుర్కోకుండా దానికి స్వీయ ప్రతిబింబంగా విప్లవహింస మారాలనే ఆకాంక్ష ఇందులో ఉంది.

ఇలా కాకుండా బూర్జువా ప్రజాస్వామ్యాన్ని వర్గపోరాటం ద్వారా అధిగమించి రాజకీయార్థిక సాంఘిక సాంస్కృతిక రంగాల్లో నూతన ప్రజాస్వామ్యాన్ని సాధించడమే విప్లవం అని అర్థం చేసుకొని ఉంటే ఇలా అనేవారు కాదు. అసలు విప్లవాన్ని విప్లవ హింసకు సమానం చేసేవారే కాదు. విప్లవ హింస-ప్రజాస్వామ్యం అనే చర్చకు దిగేవారే కాదు. ఒక వేళ హింసను చర్చనీయాంశం చేద్దామనుకున్నా 'ప్రజాస్వామ్య హింస-విప్లవం' అనే వరుసలో ఈ చర్చ సాగేది.

అలా అనుకోకపోవడానికి కారణం ఏమంటే- ఈ ప్రజాస్వామ్యాన్ని చారిత్రక ప్రగతిలో భాగంగా ముందుకు వచ్చిన బూర్జువా ప్రజాస్వామ్యమని, ఆచరణలో అది బూర్జువా నియంతృత్వమని కాకుండా దాన్నొక అమూర్త దశగా భావించారు. ప్రజాస్వామ్యం అనే పేరుతో చెలామణి అవుతున్నది కాబట్టి ప్రజాస్వామ్యమే అనుకున్నారు. ఏవో లోటుపాట్లు ఉంటే ఉండ వచ్చుగాని అదే మానవాళి చేరుకోగల చివరి లక్ష్యం అనుకున్నారు. బూర్జువా ప్రజాస్వామ్యం సర్దుబాటుతో ఏర్పడటం చారిత్రక విశేషమేగాని, ఇప్పటి ప్రజాస్వామ్య ఆచరణకు, ఆ చారిత్రక విశేషానికి సంబంధం ఏమీ లేదనుకున్నారు.

మన దేశంలో బూర్జువా ప్రజాస్వామ్యం సర్దుబాటు వల్ల ఏర్పడం అనేది కేవలం ఒక కాలానికి సంబంధించిన సమాచారం కాదు. అది వ్యవస్థీకృత రూపం దాల్చి నేటికీ కొనసాగుతున్న వాస్తవం. ఈ సత్యాన్ని విస్మరించడం వల్ల ఈ పుస్తక సంపాదకీయం అవసరమైన నిర్ధారణలు చేయలేకపోయింది. ఇది అజయ్ లోపమే కాదు. ఇప్పుడున్న భావజాల వాతావరణమే అలాంటిది. ప్రజాస్వామికంగా ఉండాలంటే బూర్జువా ప్రజాస్వామ్యానికి కట్టుబడి ఉండాలని, ఉదారవాదం శిరోధార్యం కావాలనే భావజాల వలయం మేధోరంగం చుట్టూ తిరుగుతున్నది. దీని వల్ల విప్లవకారులు తప్ప మిగతా అందరూ ప్రజాస్వామికవాదులుగా గుర్తింపు పొందుతున్నారు. విప్లవ శిబిరంలో ఉన్నామని అనుకుంటున్నవారు కూడా అస్తిత్వవాదాలు, రాజ్యాంగవాదం పేరుతో 'ప్రజాస్వామికవాదుల'నే గుర్తింపు పొందాలని ప్రయత్నిస్తున్నారు. విప్లవంతో ఉంటూనే ప్రచ్ఛన్న అస్తిత్వవాదులుగా మారుతున్నవారూ ఉన్నారు. పార్లమెంటరీ ప్రజాస్వామ్య సమర్థకులుగా మారుతున్నారు. మధ్యస్థ వైఖరిని, ఉదారవాద వైఖరిని సాధన చేస్తున్నవారే ఎక్కువ అవుతున్నారు.

ఇలాంటి వారు పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పాత్రను గుర్తిస్తారు కాని చరిత్ర నిర్మాతలైన ప్రజల పాత్రను గమనించలేరు. **'అణగారిన ఈ సామాజిక వర్గాలకు నిర్మాణాత్మక మార్పులు చేయాలన్న ఉదాత్త ఆశయాలు, మొత్తం మానవ జాతిని విముక్తం చెయ్యడం లాంటి ఉన్నత ఆశయం కోసం పోరాడాలన్న ఆదర్శాలు లేనప్పటికీ, వారికి ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా గురించి ప్రత్యేకమయిన భావన లేకపోయినప్పటికీ కేవలం వారి మనుగడ వారికి ఇంకా మరింత హింసాత్మకమయిన ప్రతిఘటనా రూపాలు అవసరం అవుతాయి. భూగోళం యావత్తు విరామమెరుగక వినిపిస్తున్న అభివృద్ధి కథనాల పగుళ్ల కింద పడి నలిగిపోతున్న చాలా మందికి హింస ప్రతి రోజూ అనుభవిస్తున్న వాస్తవం. హింసా**

ప్రయోగం చేస్తేనే వాళ్లు గుర్తింపబడుతారని కూడా వారు నమ్ముతారు. మధ్యభారత దేశంలో ఇప్పుడు జరుగుతున్న రాజకీయ యుద్ధం కూడా అలాంటి కథే..' అని అజయ్ అంటారు.

'రాజకీయ, సామాజిక మార్పు కోసం చేసే హింసాప్రయోగం న్యాయబద్ధమైనదా? అది సమర్థవంతంగా ఉపయోగపడుతుందా?' అనే సందేహం వెలుబుచ్చిన అజయ్ ప్రజాస్వామ్య వ్యవస్థ విస్తరించే క్రమంలో కొన్ని సమూహాలు బలిపశువులు అవుతున్నాయని, దానికి వ్యతిరేకంగా వారు చేసే 'ఈ ప్రతిఘటన న్యాయమైనది కూడా' అంటారు. 'హింసా ప్రయోగం'గా మారిన పోరాటాలపట్ల ఉన్న అనుమానం పార్లమెంటరీ ప్రజాస్వామ్యంపట్ల నమ్మకంగా మారింది. దీనికి కొనసాగింపుగా ఆయనకు పీడిత సమూహాల చారిత్రక పాత్ర పట్ల సందేహం కలిగింది. వాళ్లకు ఎలాంటి ఆశయాలు ఉండవని, ప్రత్యామ్నాయాలు ఉండవని చెబుతూ కేవలం మనుగడ కోసమే ఇప్పటికంటే హింసాత్మక పోరాట రూపాలను విధిలేక ఆశ్రయిస్తారని అన్నారు. ఇవాళ సువిశాల మధ్య భారతదేశమంతా సాగుతున్న విప్లవోద్యమంలో పాల్గొంటున్న ప్రజలు కేవలం మనుగడ కోసమే పాల్గొంటున్నారని అజయ్ చెప్పదల్చుకుంటున్నారు. బూర్జువా ప్రజాస్వామ్యమేమో 'స్వభావరీత్యానే సూక్ష్మస్థాయిలో ప్రజాస్వామ్యబద్ధమైన మార్పులు తీసుకవస్తుంది.. పీడిత ప్రజలకేమో ఎలాంటి ఉన్నత ఆశయాలు లేకుండా కేవలం మనుగడ కోసం పోరాడుతూ ఉంటారు' అనే దిగ్భ్రాంతికరమైన సూత్రీకరణ చేశారు.

పైగా 'హింసా ప్రయోగం చేస్తేనే వాళ్లు గుర్తింపబడతారని కూడా వారు నమ్ముతార'ని అంటారు. 'ప్రతిఘటనలో పాల్గొంటున్న సమూహాలకు, సమరశీల రాజకీయ సమీకరణ చేస్తున్న మావోయిస్టులకు, ఇటు వైపు ప్రభుత్వానికి ప్రజాస్వామ్య సూత్రాలుగాని, రాజ్యాంగబద్ధమైన పరిపాలనగాని ఏ మాత్రం చెవికెక్కని, అర్థం కాని పదాలు..' అంటారు.

ఒక రకంగా హింసా ప్రయోగానికి మధ్యభారత దేశంలోని విప్లవోద్యమం ఒక తార్కాణంగా అజయ్ చెబుతారు. అక్కడి ప్రజలు విప్లవోద్యమ 'నాయకత్వపు శ్రేణుల బయటికి విదితమవుతున్న ఉదాత్తమయిన లక్ష్యాల కోసం అణచివేయబడిన వర్గాలు మందుగుండు సామాగ్రిగా ఉపయోగపడుతున్నాయా అన్న సందిగ్ధం కూడా కలుగుతున్నది,.' అంటారు ఈ పుస్తకం ఎడిటర్.

మధ్యభారత దేశంలోని విప్లవోద్యమం నూరేళ్ల కమ్యూనిస్టు ఉద్యమంలోనే ఒక గుణాత్మక పరిణామం. భౌగోళిక విస్తరణ, భావజాల సాంస్కృతిక రంగాల్లో విముక్తిదాయకమైన మార్పులు, ప్రత్యామ్నాయ రాజకీయార్థిక పాలనా ప్రయోగాలు మొదలైన వాటిలో అది ఒక ఉదాహరణ. దండకారణ్య ఆచరణ విప్లవంలోని అనేక సంక్లిష్ట క్రమాల కలయిక. అజయ్ విప్లవాన్ని హింసాత్మక ప్రతిఘటన అనుకోకుండా ఇంకాస్త విశాలంగా, దాని మౌలిక స్వభావంలోకి వెళ్లి అర్థం చేసుకొని ఉంటే ఇలాంటి నిర్ధారణకు వచ్చేవారు కాదు.

నిజంగానే దండకారణ్య విప్లవోద్యమం భారతీయ మేధో రంగాన్ని, ప్రజాస్వామిక శిబిరాన్ని పాలు నీళ్లలా వేరు చేస్తున్నది. బూర్జువా ప్రజాస్వామ్యాన్ని ఎవరు ఎలా అర్థం చేసుకుంటున్నారనే సున్నితపు త్రాసులా వ్యవహరించగల స్థాయికి విప్లవోద్యమం ఎదిగింది. విప్లవోద్యమాన్ని బూర్జువా ప్రజాస్వామిక విలువలు, విధానాల ప్రకారం అంచనా వేయడమా? లేక దానికి వ్యతిరేకంగా వర్గపోరాట ఆచరణగా అంచనా వేయడమా? అనే దాన్నిబట్టి నిర్ధారణలు ఉంటాయి.

### 3

'ప్రజాస్వామ్యాలలో హింస విప్లవాలలో ఉన్నంత బహిరంగంగా ఉండదు. గుప్తంగా దాపరికంతో ఉంటుంది. చరిత్రలో విప్లవానంతర సమాజాలలో ఇది మనం చూస్తున్నాం. ప్రజాస్వామ్యాలు మన ఆలోచనలు పెంపొందడానికి, తడబడడానికి, తప్పులు చేయడానికి, అభివృద్ధి చెందడానికి తగినంత సమయమిస్తాయి. విప్లవాలు మన నుంచి కచ్చితత్వాన్ని, తప్పులు లేకుండా ఉండటాన్ని ఆశిస్తాయి. ప్రజాకర్షక ప్రజాస్వామ్యాల ప్రజాస్వామిక శక్తిని విప్లవ కార్యాచరణ తనలో కలుపుకొని ఇముడ్చుకోగలదా అన్నది విప్లవ కార్యాచరణ యొక్క ఔచిత్యాన్ని గురించి చర్చనీయాంశమయిన ప్రశ్న. అలా కలుపుకొని కూడా జనరంజకవాదాన్ని తమదిగా చేసుకొన్న ప్రజాస్వామ్యాలు మెజార్టీ సామాజిక వర్గాలకు వాస్తవమైన సమానత్వాన్ని సాధించలేక చిక్కి బలహీనమైపోయిన ఈ పరిస్థితులలో ఆ పరిమితులను దాటి విప్లవాలు విజయం సాధించగలవా? అన్నది ప్రశ్న..'

ప్రజాస్వామ్యంలోని ప్రజాకర్షక శక్తిని విప్లవోద్యమం కలుపుకోవాలనే ఆశ్చర్యకరమైన ప్రతిపాదన అజయ్ చేశారు. ఈ పుస్తకానికి రాసిన ఉపసంహారం దీంతో ముగుస్తుంది. 'విప్లవ హింస'కు ఉన్న పరిమితులు, సవాళ్లు అధిగమించడానికి ఇదొక పరిష్కారంగా సూచించారు. వేర్వేరు సిద్ధాంత పునాదుల మీద పని చేస్తున్న బూర్జువా ప్రజాస్వామ్యం, విప్లవోద్యమం ఎలా కలుస్తాయి? వాటికి ఉన్న వేర్వేరు వర్గ ప్రయోజనాలు ఒకటి ఎలా అవుతాయి? బూర్జువా ప్రజాస్వామ్యానికి జనరంజకత్వాన్ని ఆపాదించి దాన్ని విప్లవోద్యమం సొంతం చేసుకోగలదా? అనడంలోని అర్థం ఏమిటి? ఇదెలా విప్లవోద్యమ ఔచిత్యానికి గీటురాయి అవుతుంది? అజయ్ ఈ ప్రశ్నలను ఊహించలేదు.

'శాసనబద్ధంగా, ప్రజాస్వామ్య స్ఫూర్తిననుసరించి కూడా సమరశీలమైన ప్రతిఘటన ఒక నిశితమైన ఎంపికగా మలుచుకోడానికి అన్ని మార్గాలు తెరిచి ఉన్నాయి..' కాబట్టి విప్లవ హింసను వదిలిపెట్టి ఈ సమరశీల మార్గాన్ని అనుసరించవచ్చని చెప్పడం ఉద్దేశమా? ఇక్కడి నుంచి 'ప్రజాస్వామ్యం, విప్లవం మధ్య ఈ కలయిక ఏ మేరకు నిలదొక్కుకోగలదు అన్న విషయం మీదే భారతదేశంలో ప్రత్యేకంగా, సాధారణంగా ప్రపంచం మొత్తం మీద విప్లవ హింస భవిష్యత్తు అధారపడి ఉంటుంది' అని నిర్ధారించారు.

'ప్రజాస్వామ్యాలు ప్రజల భాగస్వామ్యానికి పరిమితులు లేకుండా చర్యలు తీసుకుంటూ, జనరంజక వాదానికి గేట్లు ఎత్తివేస్తున్నాయి..' అంటూ బూర్జువా ప్రజాస్వామ్యానికి జనరంజక స్వభావాన్ని ఆపాదించి, దాన్ని అత్యున్నత స్థాయికి తీసికెళ్లారు. ఈ ప్రజాస్వామ్యం అనేక పీడిత సమూహాలను తనలో కలుపుకొని, తన చుట్టూ తిప్పుకుంటున్నట్లు కనిపిస్తున్నదిగాని వాస్తవానికి వ్యవస్థ అంచుల్లోకి వారిని అతి దారుణంగా తోసేస్తోంది. పాత ఉత్పత్తి ప్రక్రియల నుంచి బైటికి లాగేసి వాళ్లను ఎక్కడా కుదురుగా ఉండనీయడం లేదు. ఉండగల జీవనోపాధులు కల్పించడం లేదు. ఈ వ్యవస్థను బూర్జువా వర్గం విశాలం చేసి దురాక్రమించుకొని

ప్రజలను నిరాశ్రయులుగా, పూట కూలి వెతుక్కోవలసిన వాళ్లుగా మార్చి చెల్లాచెదరుగా విసిరేసింది. చట్టం, హక్కులు ఏవీ వర్తించని గుంపుగా వీధుల్లోకి, మురికివాడల్లోకి, చెత్త కుప్పల మీదికి తోసేసింది. ఇదేమి జనరంజక స్వభావం? ప్రజలను ఏ రకంగానూ సంఘటితంగా ఉండనీయని ఈ స్థితిలో అజయ్‌కు **'కొత్త తరహా సమిష్టి తత్వం'** కనిపిస్తోంది.

ఆయన ఇంకో ఆశ్చర్యకరమైన సూత్రీకరణ చేశారు. **'సంప్రదింపుల రాజకీయ వాతావరణం'..** ఇదే ఇవాళ **'రాజకీయ సమీకరణాల ముఖ్య లక్షణం'** అన్నారు. రాజకీయ పాలనా రంగంలో, ఉత్పత్తి రంగంలో ఎవ్వరినీ సంప్రదించే అవకాశమే ప్రజలకు లేకుండా చేసింది. ఈ దారుణమైన స్థితి ముప్పై నలభై ఏళ్ల కిందే ఏర్పడింది. ప్రైవేటీకరణ కార్పొరేటీకరణగా మారాక కూలీలు, కార్మికులు ఎవరితో సంప్రదిస్తారు? తరతరాలుగా పోరాడి సాధించుకున్న హక్కులన్నీ ధ్వంసమైపోయాక, వందలాది కార్మిక చట్టాలు రద్దయిపోయాక వాళ్లు ఎవరితో చర్చలు చేస్తారు? అసలు ఎవరు దగ్గరికి రానిస్తారు? బూర్జువా ప్రజాస్వామ్యం విస్తరించేకొద్దీ కోటానుకోట్ల ప్రజలపట్ల జవాబుదారీతనం లేని నిరంకుశ, నిర్లక్ష్య, అమానవీయ స్వభావంతో అది కుళ్లిపోయింది. అసలు ప్రజా జీవితానికి రాజకీయ రంగం సుదూరంగా వెళ్లిపోయి దశాబ్దాలు గడుస్తోంది. ఉచితాలు, పైరవీలు, అవినీతిలో కిందిస్థాయి నాయకులకు వాటాలు, ఎన్నికల కోసం నాయకులు నడిపే ముఠాలు, వాటి చుట్టూ జనం తిరగడం..మొదలైనవి బాగా పెరిగాయి. ఒప్పందాలు, పరస్పర ప్రయోజనాలు ముమ్మరంగా సాగుతున్నాయి. బహుశా వీటిని చూపే సంప్రదింపుల రాజకీయ వాతావరణం పెరిగిందని అంటున్నారా? రాజకీయ సమీకరణాల ముఖ్య లక్షణం అంటే ఇదేనా?

ఇలాంటివి సిద్ధాంత పరిభాషలో చెప్పుకోడానికి బాగుంటుందేమోగాని మామూలుప్రజలు వీటిని అంగీకరించలేరు.

ఉదారవాద సిద్ధాంతాలు, అస్తిత్వవాదాలు కొన్ని కొత్త ఆలోచనలు ముందుకు తెచ్చే క్రమంలో ప్రజల జీవితంలోని ఆర్థికాంశాల ప్రాధాన్యతను తెరవెనక్కి తోసేయాలని చూశాయి. అస్తిత్వవాదాలు బలంగా ఉన్నంత వరకు ఈ పని ముమ్మరంగా చేశాయి. అజయ్ కూడా **'ఆర్థిక సమానత్వానికి సంబంధించిన విషయాలపట్ల సమీకరణాలు రోజు రోజుకు బలహీనపడుతున్నా'**యనే వాదన చేశారు. ఆర్థికాంశాల ప్రాధాన్యతను జీవితంలోని మరే అత్యవసరాలతో పోటీ పెట్టనవసరం లేదు. ఆర్థికాంశాల ప్రాధాన్యత తెలుసుకోడానికి సిద్ధాంతాల అవసరమే లేదు. నిజానికి గత ఇరవై పాతికేళ్లుగా ఆర్థికాంశాల చుట్టూ దేశంలో అతి పెద్ద ప్రజా పోరాటాలు జరుగుతున్నాయి. మిగతా సాంస్కృతిక విషయాల మీద కూడా జరుగుతున్నాయి. అస్తిత్వ సమస్యలు ఆ సమూహాలకు మాత్రమే చెందినవి. వాటికి కూడా వర్గ కోణం ఉంటుంది. అలాంటి సమూహాలన్నీ వర్గ దోపిడీకి గురవుతూ ఉంటాయి. అది వాటన్నిటి ఉమ్మడి క్షేత్రం. అందువల్ల సహజంగానే ప్రజా సమీకరణలు అక్కడే ఎక్కువగా జరుగుతున్నాయి. మిగతా ఎక్కడైనా సంప్రదింపులకు రాజ్యం సిద్ధమవుతుందేమోగాని వర్గ విషయాల్లో నిర్లక్ష్యం, వంచించడం, జైళ్లలోకి తోసేయడం, కాల్చిపారేయడం తప్ప మాటలే లేవు. అసలు అలగా జనంతో సంప్రదింపుల బల్లను ఈ ఉదారవాద ప్రజాస్వామ్యం ఎన్నడో తుత్తినియలు చేసింది. అందువల్లే సంఘటిత, అసంఘటిత ఆర్థిక పోరాటాలు ఏదో ఒక స్థాయిలో నడుస్తున్నాయి.

విప్లవోద్యమం మిగతా సాంఘిక సాంస్కృతిక పోరాటాలతోపాటు ఇలాంటి ఆర్థిక పోరాటాల పునాది మీద సాగుతూ ఉన్నది. అయితే సమాజం అనేక సాంస్కృతిక గుర్తింపులుగా చీలిపోయిందని, వాటి కోసం పోరాటమే ఇక ప్రధానమని, 20వ శతాబ్దిలాగా శ్రామికవర్గ పోరాటాలకు చోటు లేదని చెప్పే ఉదారవాదాన్ని అజయ్ ఈ పుస్తకంలో కొనసాగించారు. ఈ చీలికలు, వాటి నుంచి పుడుతున్న న్యాయభావనలు, పోరాటాలు, వాటి సిద్ధాంతాలను తప్పక పట్టించుకోవలసిందే. అయితే ఈ ఉదారవాద సిద్ధాంతాలేవీ వర్గ దోపిడీ గురించి పట్టించుకోవు. పట్టించుకున్నా దోపిడీ లేని నూతన వ్యవస్థ నిర్మాణం వాటి లక్ష్యం కాదు. పైగా అవన్నీ వర్గపోరాటాలను ప్రశ్నిస్తూ ఉంటాయి. నాజూకు పద్ధతుల్లో తిరస్కరిస్తుంటాయి.

అయితే అజయ్ ఇలాంటి ఉదారవాద ప్రజాస్వామ్యంతో విప్లవోద్యమం సఖ్యంగా మసలుకోవాలంటారు. **'ఈ ప్రజాస్వామ్యాలతో విప్లవాలు అర్థవంతమైన సంబంధాలు కలిగి ఉండగలవా?'** అనే సందేహం వెలుబుచ్చారు. ఉదారవాదులు బూర్జువా ప్రజాస్వామ్యాన్ని ప్రజాస్వామ్యమని అనుకోవడం, ఈ దేశంలో ఉదారవాద రాజ్య పాలనా వ్యవస్థలు రూపొందాయని భావించడం వల్ల దాన్ని శిఖరాయమాన ప్రమాణంగా మార్చేస్తారు. మన సమాజాన్ని, దాని చరిత్రను, అందులో వచ్చిన మార్పులను ఉదారవాద దృక్పథంతో చూడ్డం వల్ల ఇంత విచిత్రమైన వాదన తలెత్తింది. నిజానికి ఉదారవాదులు ఈ ప్రశ్నను భారత రాజ్యానికి వేయాలి. ఈ ప్రజాస్వామ్యాన్ని అనుభవిస్తున్న పాలకవర్గానికి వేయాలి. మీ దోపిడీ విధానాలు ఈ వ్యవస్థను యథాతథంగా నిలిపి ఉంచుతున్నందు వల్లే, వ్యవస్థలో మౌలిక మార్పు కోసం విప్లవోద్యమం తలెత్తిందని చెప్పాలి. దానితో నీవు ఎలా వ్యవహరిస్తావని ప్రభుత్వాన్ని అడగాలి.

ఆ పని అప్పుడప్పుడూ సమస్యల ప్రాతిపదిక మీద చేస్తే చేయవచ్చుగాని, మౌలికంగానే ఇలాంటి వాళ్లది ఉదారవాద వైఖరి. ఈ సిద్ధాంతం ప్రకారం రాజ్యం తటస్థంగా ఉంటుంది. వర్గాలకు అతీతంగా రాజ్యం పని చేస్తూ ఉంటుంది. బూర్జువా ప్రజాస్వామ్యం సామాజిక మార్పు క్రమంలో వచ్చినప్పటికీ మౌలిక మార్పులను నిరోధిస్తోందనే విషయాన్ని ఉదారవాదులు పట్టించుకోరు. మార్పును అడ్డుకోవడంలో పాత పాలక వర్గాలకు, బూర్జువా వర్గాలకు ఒక కీలకమైన తేడా ఉంది. బూర్జువా ప్రజాస్వామ్యం రాజ్యాంగం ద్వారా మార్పును నిరోధిస్తుంది. అంటే చట్టబద్ధంగా మార్పును అడ్డుకుంటుంది. అప్పటి దాకా చరిత్రలో జరిగిన సామాజిక మార్పులకు ఒక సిద్ధాంత చట్రాన్ని ఇస్తూ, ప్రజలు సాధించిన విజయాలకు రాతలో హక్కుల రూపం ఇస్తూ తయారైన రాజ్యాంగం బూర్జువా వర్గ దోపిడీకి మార్గదర్శకత్వం వహిస్తుంది. తద్వారా మార్పును నిరోధించే సాధికార పత్రంగా దోపిడీకి చట్టబద్ధత కల్పిస్తుంది.

అదే సమయంలో ఉదారవాదం చట్టం ముందు అందరూ సమానమే, చట్టం ప్రకారమే పాలన సాగాలి, అధికారంలో ఉన్న

వ్యక్తుల ఇష్టానుసారం కాకుండా రాజ్యాంగ మార్గదర్శకత్వంలో పాలన సాగాలనే ఉదార్త విషయాలను తీసుకొని వచ్చింది. ఉదారవాదం ఆధునికతా వికాసంలో భాగంగా ముందుకు వచ్చింది. అయితే ఉత్పత్తి సంబంధాలపై దోపిడీ వర్గ యాజమాన్యం ఉన్నది. ప్రజా ప్రాతినిధ్యం పేరుతో ఆ వర్గమే రాజ్యాంగయంత్రం మీద పెత్తనం చేస్తున్నది. కాబట్టి ఉదారవాదంలోని చట్టబద్ధ పాలననూ, బూర్జువా ప్రజాస్వామ్యమే దోపిడీని చట్టబద్ధం చేయడాన్ని కలిపి చూడాలి. లేకపోతే బూర్జువా ప్రజాస్వామ్యంలో సామాజిక సాంస్కృతిక హింసలతో సహా ఏ హింసా రూపమూ అర్థం కాదు.

మనిషిని సమగ్రంగా చూడకపోవడం ఉదారవాదం పరిమితి. అసలు ఆధునికత, ఉదారవాదం, బూర్జువా ప్రజాస్వామ్యం అనే మూడు ఇండియాలో సక్రమంగా రూపొందలేదు. వలసవాదం వల్ల పరిచయమైన ఆధునికత, ఉదారవాదం భారత సామాజిక సాంస్కృతిక రంగాల్లోని ఆధునిక పూర్వ వ్యవస్థలతో, విలువలతో రాజీపడ్డాయి. నిజమైన అర్థంలో ఆధునికత, వలసవాదం ఏర్పడక ముందు దళారీ బూర్జువా వర్గానికి అధికారం బదలాయింపు జరిగింది. రాజ్యాంగం తయారైంది. దానిదైన చట్టబద్ధ పాలన మొదలైంది. అందువల్ల ఇండియాలో ఎంత ఉదారవాదం ఉన్నది? ఏ విషయంలో చట్టబద్ధ పాలన నడుస్తున్నది? రాజ్యాంగంలోని ఆదర్శాలు అమలు కాగల స్థాయికి భారత సామాజం అన్ని రంగాల్లో ఎంత ఎదిగింది? చట్టం ప్రవేశించని సాంఘిక సాంస్కృతిక ప్రపంచం ఎంత ఉన్నది? అనే ప్రశ్నలేవీ వేసుకోకుండా ఉదారవాద ఆలోచనలను పదే పదే వినిపించడం వల్ల ఫలితం ఏమీ ఉండదు. రాజ్యాంగం, బూర్జువా ప్రజాస్వామ్యం, ఉదారవాదాల వల్ల అట్టడుగు కులాలకు, తెగలకు, పీడిత ప్రజలకు దొరికిన కొద్దిపాటి రక్షణను గుర్తిస్తూనే ఈ సమగ్రమైన విమర్శ బూర్జువా ప్రజాస్వామ్యం మీద పెట్టాలి. లేకపోతే దోపిడీ చట్టబద్ధమైన సమాజంలో ఎలాంటి సామాజిక సంబంధాలు ఉంటాయో ఎన్నటికీ అంచనా వేయలేం. ఉత్పత్తి సాధనాల మీది యాజమాన్యం, రాజ్యాంగ యంత్రం మీద బూర్జువా యాజమాన్యం నుంచి పుట్టుకొచ్చిన హింసను ఎన్నటికీ గుర్తించలేం. పైగా ఆ హింసా క్రమాలన్నీ చట్టబద్ధతను సంతరించుకుంటాయి.

**4**

**"చిన్న చిన్న విభాగాలకు సామాజిక ఆధిపత్యాన్ని విభజించడం లేదా పెద్ద 'సమూహాలు'గా పునర్నిర్మించడంగా అనేక భాగాలుగా విడిపోయిన 'సమాజ సంస్కరణ' స్వభావాన్ని విశ్లేషించడం కూడా ఇక విధంగా 'సమాజ పరివర్తన' అనే భావననే తలపిస్తుంది. యునైటెడ్ స్టేట్స్‌లో 'ఆకుపై' ఉద్యమం, మధ్య ప్రాచ్యంలో 'అరబ్ వసంతం' లేదా లాటిన్ అమెరికాలో 'బ్రెజిల్ వసంతం'లాంటి వాటితో సహా ఇటీవల ప్రపంచవ్యాప్తంగా జరిగిన సంఘటనలు 'వ్యవస్థ' అనే భావనకు వ్యతిరేకంగా వర్గాలకు అతీతంగా సంఘటనగా ఏర్పడటం కొత్తగా మొదలైంది..."** అని హింసా ప్రయోగ ఉద్యమాల చర్చ నేపథ్యంలో పై ఉద్యమాలన్నిటినీ ఈ పుస్తక సంపాదకుడు ప్రస్తావించారు. బహుశా హింసతో నిమిత్తం లేకుండా, పెద్ద ఆశయాలు, కథనాలు లేకుండా పోరాటాలు జరగగలవని చెప్పడానికి ప్రయత్నించారు.

వాల్‌స్ట్రీట్ తరహా ఉద్యమాలు ప్రపంచ ప్రజలను ఉత్తేజపరిచిన మాట నిజం. అవి కొత్త తరహా ఉద్యమాలు. వాటి నుంచి నేర్చుకోవాల్సినవీ ఉన్నాయి. అయితే సమగ్రమైన సామాజిక స్వరూపం మొత్తాన్ని తెలుసుకొని, దాన్ని సమూలంగా మార్చాలనే లక్ష్యంతో నడుస్తున్న పోరాటాలతో వాటిని పోటీ పెట్టాల్సిన పని లేదు. వాటిలో సామాజిక పరివర్తనకు సంబంధించిన కొన్ని కోణాలు ఉన్నాయి. 'వ్యవస్థ' అనే భావన లేకపోవడం, వర్గాలకు అతీతమని చెప్పడంలోనే వాటి ప్రత్యేకత ఉన్నదని అజయ్ అన్నారు. ఈ ఉదాహరణలు, విశ్లేషణలు మౌలిక మార్పు కోసం ప్రయత్నించే వర్గపోరాటాలకు కాలం చెల్లిందని చెప్పడానికా? 'ఈ ఉద్యమాలు ఉత్పాతాలు, హింస ప్రమేయం లేకుండా సమీకరించబడి విప్లవ హింస ద్వారా సమాజ పరివర్తన జరగాలన్న భావనకు పెద్ద సవాలు విసురుతున్నాయి..' అని నిర్ధారించడానికా?

నిజానికి మన విశ్లేషణలతో నిమిత్తం లేకుండా వర్గాలు ఉన్నాయి కాబట్టి, వర్గ దోపిడీ ఉన్నది కాబట్టి వర్గపోరాటం సాగుతూనే ఉంటుంది. దానికి నాయకత్వం వహించగల నిర్మాణం బలంగా ఉన్నంత కాలం ఆ పోరాటాలు సమూల మార్పు దిశగా వేగవంతంగా సాగుతూనే ఉంటాయి. అట్లాగే ఇతర సామాజిక సాంఘిక అస్తిత్వ వైరుధ్యాలు ఉన్నంత వరకు వాటికి వ్యతిరేకంగా వర్గపోరాటశక్తులు, ఉదారవాద, అస్తిత్వశక్తులు పోరాడుతూనే ఉంటాయి.

అసలు విషయం ఏమంటే 'ఆకుపై' ఉద్యమం, 'అరబ్ వసంతం' లాంటి ఉద్యమాలు కొద్ది కాలం నడిచాక ఆగిపోయాయి. భారత విప్లవోద్యమం తీవ్రమైన రాజ్యహింసను అధిగమిస్తూ దశాబ్దాలుగా కొనసాగుతున్నది. అణచివేత మధ్యనే విస్తరణ, కుదింపు, విస్తరణల పథంలో పురోగమిస్తున్నది. దీర్ఘకాలిక పోరాటంగా దశాబ్దాల అవధిలో ఇది రుజువు అవుతున్నది. ఒక్క మాటలో చెప్పాలంటే భారత విప్లవోద్యమం సీజనల్ పోరాటం కాదు. అనుకూల కాలంలో నడిచి విరామం ప్రకటించే ఉద్యమం కాదు. ఏవో కొన్ని ఫలితాలు వస్తే.. ఇక చాల్లే అని విశ్రాంతి తీసుకొనే వ్యూహంతో అవి పని చేయడం లేదు. పోరాట ఫలితాలు ఏ కొందరికో దొరికితే ముగింపు పలికేది కాదు. ఏ ఒక్కరో చనిపోతేనో, వెళ్లిపోతేనే నిలబడిపోయేది కాదు.

బహుశా 21వ శతాబ్దంలోనే అతి పెద్ద అననుకూల పరిస్థితుల్లో సహితం దీర్ఘకాలంగా అనేక ఆటుపోట్ల మధ్య కొనసాగుతూ విస్తరణ కోసం భారత విప్లవోద్యమం ప్రయత్నిస్తున్నది. మన చుట్టూ అనేక ప్రజా సమూహాలు, గుంపులు తమకు అత్యవసరమైన డిమాండ్ల సాధన కోసం సాగుతున్న పోరాటాలు ఎన్నో ఉన్నాయి. కానీ దీర్ఘకాలిక సమగ్ర పరివర్తన లక్ష్యంగా నిర్మాణాత్మంగా సాగుతున్నది మావోయిస్టు ఉద్యమమే. కావాలంటే 'ఆకుపై' ఉద్యమం, 'అరబ్ వసంతం' 'బ్రెజిల్ వసంతం'లాంటి పోరాటాలతో ఇటీవలి సిలింగేర్ తదితర పోరాటాలను పోల్చి చూడండి. భావోద్వేగాలు, రాగద్వేషాలు లేకుండా అచ్చమైన మేధో ఆసక్తితో చూసినా ఈ పోరాటాల్లోని నిర్మాణాత్మక విస్తృతి తెలుస్తుంది. తక్షణ-దీర్ఘకాలిక, నిర్దిష్ట-సార్వజనీన లక్షణాలు కనిపిస్తాయి. కేవలం ఆ పోరాటాలు చేస్తున్న సమూహాలు తమ అవసరాల కోసం, మనుగడ కోసం మాత్రమే

కాకుండా వ్యవస్థను మార్చవలసిన రాజకీయ వ్యూహంతో ఉద్యమిస్తున్నట్లు తెలుస్తుంది.

ఈ పుస్తక సంపాదకుడు ఉపోద్ఘాతంలో, ఉప సంహారంలో మావోయిస్టుల ప్రజా, రాజకీయ సమీకరణల గురించి కూడా కొన్ని పరిశీలనలు చేశారు. దీనికి పైన చెప్పిన తరహా పోరాటాల్లో ఎలాంటి రాజకీయ సమీకరణలు ఉన్నదీ గమనిస్తే సరిపోతుంది. సంపాదకుడు తన విమర్శకు కొనసాగింపుగా **'చాలా వర్గాలను కలుపుకోగల శక్తి ప్రజాస్వామ్యానికి ఉంద'**ని అన్నారు. **'ప్రజాస్వామ్యానికి ఉన్న అట్టడుగు వర్గాలను కలుపుకోగలిగిన సానుకూల అంశాన్ని మావోయిస్టులు పెద్దగా పట్టించుకోలేదు..'** అన్నారు.

గతంలో ఏమోగాని ఇటీవలి నలభై ఏళ్లలో భారత పార్లమెంటరీ ప్రజాస్వామ్యం నిస్సిగ్గుగా బడా బూర్జువా వర్గ ప్రయోజనాలు తప్ప మరే వర్గ ప్రయోజనాలనూ పట్టించుకోవడం లేదని వివరాల్లోకి వెళ్లితే ఎవరైనా చెప్పగలరు. ఈ మార్గంలో అది పరుగులు తీస్తున్న దృశ్యం మన కళ్ల ముందు కనిపిస్తున్నది. ముఖ్యంగా అట్టడుగు వర్గాలను వంచితులుగా, నిరాశ్రయులుగా, విస్థాపనలో ధ్వంసమైపోయేవారుగా మార్చేసింది. వలస కూలీల దగ్గరి నుంచి కార్పొరేట్ ఉద్యోగుల దాకా అందరినీ శ్రమశక్తి దోపిడీకి గురయ్యేవాళ్లుగా దిగజార్చింది. బహుశా ప్రజా జీవన రంగాలన్నీ కార్పొరేట్ల ఉక్కిపిడికిట్లో ధ్వంసమైపోతున్నాయి. ఈ దృశ్యాన్ని కూడా పరిగణలోకి తీసుకొని ఈ ప్రజాస్వామ్యం ఏ అట్టడుగు వర్గాలను ఎలా కలుపుకపోతున్నదో నిర్జీవ గణాంకాలతో అయినా వివరించడం సాధ్యమేనా? ఆలోచించాలి. ఈ ప్రజలందరూ విప్లవానికి చోదకశక్తి అని మావోయిస్టు ఉద్యమానికి తెలుసు. ఇప్పటికిప్పుడు ఈ అందరినీ సమీకరించలేకపోవచ్చు. ఎదురుదెబ్బలు తినవచ్చు. కానీ ఈ దేశంలో సమగ్రంగా, మౌలికంగా సామాజిక పరివర్తన ఎలా సాధించవలసి ఉన్నదో ఆ ఉద్యమానికి స్పష్టత ఉన్నది.

అనేక రంగాల్లో ప్రజలు చేస్తున్న పోరాటాల వల్లనే మన సమాజంలో చర్చాస్థాయి బాగా పెరిగింది. దీనికి బూర్జువా ప్రజాస్వామ్యం అనుమతి ఇవ్వడం లేదా? ప్రేరేపించడం లేదా? అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. ఆ అవకాశం ఎంత ఇస్తే అంత గుర్తించడానికి ఇబ్బంది పడాల్సిన పని లేదు. తనతో సర్దుబాటు కోసం చేసే విమర్శతో బూర్జువా ప్రజాస్వామ్యం ఎలా వ్యవహరిస్తున్నది? విప్లవాత్మక విమర్శ పెట్టే వారితో ఎలా నడుచుకుంటున్నది? అనే తేడా కూడా ఉంది. బూర్జువా ప్రజాస్వామ్యం మీద అన్ని రకాలుగా, అన్ని స్థాయిలో విమర్శ పెట్టగల స్థాయికి విప్లవ శిబిరం ఎదగాల్సి ఉంటుంది. అట్లా విమర్శ పెడుతూ తన ప్రతిపత్తిని నిలబెట్టుకోవాలి. దేనికంటే సమాజంలో ముందుకు వచ్చిన అనేక ప్రగతిశీల భావనలు ఎన్నికల మార్గంలోకి మళ్లి గిడసబారిపోయాయి. ప్రగతిశీల భావనలు ఎన్నికల రాజకీయాల్లోకి భాగమయ్యాక బూర్జువా ప్రజాస్వామ్యం వికసించాలి. పాలన, సామాజిక రాజకీయార్థిక రంగాల్లో ప్రజాస్వామికీకరణ జరగాలి. కానీ పార్లమెంటరీ ప్రజాస్వామ్యం వాటిని తనలో జీర్ణం చేసుకొని మాయం చేసింది. తద్వారా ప్రజాస్వామికీకరణను అడ్డుకొనే వ్యవస్థీకృత శక్తిగా మారిపోయింది.

అది ఎలా ఉంటుందో తాజా ఉదాహరణతో చెప్పవచ్చు. ఒక ఆదివాసీ మహిళను భారత రాష్ట్రపతిని చేస్తుంది. ఆదివాసుల మీద వైమానిక దాడులు చేస్తుంది. అంటే ఉదారవాద, అస్తిత్వవాద ఆకాంక్షలను బూర్జువా వర్గం తనంత తనే నెరవేర్చుతుంది. మౌలిక సమస్యలను పరిష్కరించపోగా వాటి గురించి మాట్లాడే జనాలను చుట్టుముట్టి చంపేయాలనుకుంటుంది. బూర్జువా ప్రజాస్వామ్యం లోని మార్పుకు-యథాతథ స్థితికి ఇంత కంటే వివరణ ఏదీ అక్కరలేదు.

**5**

మళ్లీ మొదటికి వెళదాం. ఆశయాలు భగ్నమై విప్లవోద్యమం 'ఎక్కువ' హింసను ఆశ్రయించడం లేదు. విజయవంతం కాని రాజకీయాలను నిలబెట్టుకోడానికి సైనికీకరణకు పాల్పడటం లేదు. విప్లవోద్యమ ప్రత్యామ్నాయం వల్లనే కార్పొరేట్ వర్గాలు అభద్రతకు గురై తన చేతిలోని పని ముట్టులాంటి రాజ్యాన్ని మరింతగా వాడుకుంటున్నాయి. తద్వారా రాజ్యహింస పెరుగుతోంది. సైనికీకరణ ఉధృతమవుతోంది. బూర్జువా ప్రజాస్వామ్యం బూర్జువా నియంతృత్వంగా మారిపోయింది. ఈ విషయాన్ని అజయ్ తిరగేసి చూశారు. ఆయనొక్కరే కాదు. వర్గపోరాటం తీవ్ర స్థాయికి చేరుకున్నాక విప్లవోద్యమాన్ని అర్థం చేసుకోవడంలో మేధావులకు సహజంగానే ఈ ఇబ్బంది ఉంటుంది.

హింసను కేంద్రం చేసుకొని సమాజాన్ని, రాజ్యాన్ని, విప్లవోద్యమాన్ని పరిశీలించడం దానికదే తప్పు కాదు. అయితే హింస మూలమేమిటి? వందల వేల ఏళ్ల కింద ఈ సమాజం హింసాత్మకంగా ఎట్లా నిర్మాణమై ఉన్నది? వలస పాలన కాలంలో రూపొందడం మొదలు పెట్టిన భారత రాజ్యవ్యవస్థకు, పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి అంతర్గతంగానే హింసా స్వభావం ఎట్లా ఉన్నది? ఈ ప్రజాస్వామ్యంలో హింస ఎట్లా పుడుతున్నది? ఎట్లా విస్తరిస్తున్నది? బలపడుతున్నది? సామాజిక, సాంస్కృతిక హింసకు ఈ 'ప్రజాస్వామ్య హింస' ఎట్లా 'ఆధునిక' వ్యవస్థీకృత రూపం ఇస్తున్నది? ఎట్లా అప్‌డేట్ చేస్తున్నది? ఇలాంటి హింసాత్మక సమాజంలో విప్లవోద్యమం కూడా అదనంగా హింసను అమలు చేసే బైటిశక్తిగా ఉన్నదా? లేక ఈ హింసాత్మక సమాజం లోపలి నుంచే దాన్ని రద్దు చేయడానికి బయల్దేరి ఆ దిశగా కృషి చేస్తున్నదా? అని ఆలోచించాలి.

హింసాత్మక ప్రత్యర్థితో సుదీర్ఘకాలం తలపడే క్రమంలో, హింసను రద్దు చేసే పనిలో ఒకవేళ విప్లవోద్యమం హింసపట్ల సున్నితత్వాన్ని కోల్పోతే తప్పక నిలదీయవలసిందే. ఆ రకంగా కూడా హింస గురించి చర్చించవలసిందే. కానీ 'ప్రజాస్వామ్యానికి' బైటి నుంచి సాగుతున్న హింసా ప్రతిఘటనగానే విప్లవాన్ని చూడవచ్చునా? అనే సందేహాన్ని ఈ పుస్తకం పాఠకుల్లో బలంగా కలిగిస్తుంది. విప్లవ హింస-ప్రజాస్వామ్యం అనే ఇతివృత్తం చుట్టూ చాల వ్యూహాత్మకంగా ఎడిటర్ తన భావాలను సంపుటీకరించారు. అయితే అది పాఠకుల మీద ప్రతికూల ముద్ర వేస్తున్నది. తాను బూర్జువా ప్రజాస్వామ్యం పక్షాన దృఢమైన వైఖరి తీసుకొన్నందు వల్ల, దాని గురించి ఇంత చర్చించే, ఆలోచించే అవకాశం ఇచ్చినందుకు మాత్రం సంపాదకుడికి పాఠకులు తప్పక కృతజ్ఞతలు తెలుపుకుంటారు.

(అయిపోయింది)



# నీ గురించి
# నీకు తెలుసా రాహుల్

వడ్డెబోయిన శ్రీనివాస్




ఆదివాసీల
బతుకు నిరాకరణ
వేదాంతభరిత హత్యాకాండల గ్రీన్‌హంట్
వేల తుపాకుల మేఘమై కదిలి
వేల వాగులు కలిసిన నెత్తుటినదై ప్రవహిస్తున్నప్పుడు
నువ్వు సాక్షి
నీ పార్టీ సాక్షి
తెరువని నీ నోరుతో నువ్వు ముద్దాయివే రాహుల్

లా అండ్ ఆర్డర్‌తో
రాష్ట్రాల గుండెల్లోకి చొరబడే
ఎన్.ఐ.ఏ. విశ్వరూపానికి
నువ్వూ సాక్షి
నీ పార్టీ సాక్షి
నిలువరించని నీ చేష్టతో నువ్వు ముద్దాయివే రాహుల్

కార్పొరేట్ కంపెనీ యు.పీ.ఏ.
రక్తసంబంధాల విశ్లేషకుడు
ఆదివాసీ బంధాల సాయిబాబాను
అండసెల్‌లో అండం చేసినప్పుడు
నువ్వు సాక్షి
నీ పార్టీ సాక్షి
ప్రశ్నించని కళ్ళతో నువ్వు ముద్దాయివే రాహుల్

భీభత్సమాన ఉ.పా.కు
నెత్తుటి కోరల సవరణలు ఎలుగెత్తిన
కార్పొరేట్ ప్రియుడు చిదంబరం మాయకు
నువ్వు సాక్షి
నీ పార్టీ సాక్షి
చెవులారా విని ప్రోత్సహించిన నువ్వు ముద్దాయివే రాహుల్

జాతీయ విద్యావిధానం
జాతివిద్వేష విద్యావిధానమై
కాషాయ దుర్గంధం బడుల కళాశాలల విశ్వవిద్యాలయాల
వినాశకమై జ్వలించే రేపటి దృశ్యానికి
నువ్వు సాక్షి
నీ పార్టీ సాక్షి
ఉపఖండ ఉపద్రవాన్ని అడ్డుకోని నువ్వు ముద్దాయివే రాహుల్

దేశాన్ని
కంటికి రెప్పవేయకుండా మాట్లాడుతున్న
హక్కుల గొంతుల్లో జైళ్లనుకుక్కినపుడు
నువ్వు సాక్షి
నీ పార్టీ సాక్షి
ఈ ప్రజాస్వామ్యానికి సిలువ వేసిన నువ్వు ముద్దాయివే రాహుల్

ఛత్తీస్‌గఢ్ కాంగ్రెస్ బాంబింగ్
అడివి అంటుకొని హాహాకారాలు చేస్తోంటే
వేదాంతంలో మునిగితేలిన
నువ్వు సాక్షి
నీ పార్టీ సాక్షి
నీ పార్టీ ఆదివాసీ వ్యతిరేకతను ఖండించని నువ్వు ముద్దాయివే రాహుల్

అయినా నువ్వేం మాట్లాడుతున్నావ్
అదాని మోదీ రక్తసంబంధ
సాయిబాబా విశ్లేషణేగా
నువ్వు సాక్షిగా
నీ పార్టీ సాక్షిగా
నీ నటనకు తగిన సత్కారంగా నువ్వు ముద్దాయివే రాహుల్

మా హక్కుల గురించి మాట్లాడనందుకే
మీ హక్కుల దాకా వచ్చింది
మా హక్కులను కాలరాచినందుకే
నీ హక్కులకూ ప్రమాదం వచ్చింది
మీవైపు కత్తి దూసుకు రాగానే
నువ్వు సాక్షిగా
నీ పార్టీ సాక్షిగా
మిమ్మల్ని మీరు రక్షించుకోడానికి ఆరాటపడుతున్న
ఈ సందర్భంలోనూ నీవు ముద్దాయివే రాహుల్.



ఎన్. రవి

# రాజ్యాంగవాదం : మార్క్సిస్టు విమర్శ

**ప్రస్తుతం భారతదేశంలో రాజ్యాంగం గురించి పలు రకాలైన చర్చలు నడుస్తున్నాయి. వీటిని స్థూలంగా మూడు రకాలుగా విభజించవచ్చు. ఒకటి, సంఘ పరివార్ శక్తులు, బిజేపి ప్రస్తుత రాజ్యాంగపు మౌలిక స్వరూపాన్ని మార్చి ఫెడరల్ వ్యవస్థ స్థానంలో యూనిటరి వ్యవస్థను స్థాపించడంతో పాటు, మౌలికంగా మనువాద విలువలతో రాజ్యాంగాన్ని తిరగరాయడానికి చేస్తున్న ప్రయత్నాలు. రెండు, బిజేపి చేస్తున్న ఈ ప్రయత్నాలను వమ్ము చేయడానికి రాజ్యాంగాన్ని పరిరక్షించుకోవాలనే పిలుపుతో ఎంతో మంది ఉదారవాద లౌకికవాదులు, రాజ్యాంగవాదులు, ప్రజాస్వామిక వాదులు, అంబేద్కర్ వాదులు, దళిత వాదులు చేస్తున్న ప్రచారం. రాజ్యాంగహక్కులను కాపాడుకోవాలని మాత్రమే కాక అంబేద్కర్ రచించాడు కాబట్టి రాజ్యాంగాన్ని పరిరక్షించాలి అనేది వీరిలో కొందరి వాదన. మూడు, రాజ్యాంగం గురించి మార్క్సిస్టు విప్లవకారుల విమర్శ.**

ఎన్నో ప్రజాపోరాటాల కారణంగా నేటి రాజ్యాంగంలో ఎన్నో ప్రజానుకూల హక్కులు, అంశాలు పొందుపరచబడి ఉన్నాయి కనుక వాటిని కాపాడుకోవడానికి పోరాటం చేయాలి అనే మేరకు పై రాజ్యాంగవాదులతో మార్క్సిస్టు విప్లవకారులు అంగీకరిస్తారు. కానీ ప్రస్తుతమున్న రాజ్యం, రాజ్యాంగం మౌలికంగా నేటి పాలకవర్గాలైన దళారీ బడా పెట్టుబడిదారుల, భూస్వాముల ప్రయోజనాలను నెరవేర్చేది అనేది మార్క్సిస్టు అవగాహన. కాబట్టి నేటి వ్యవస్థతో పాటు ఈ రాజ్యాంగాన్ని, రాజ్య యంత్రాంగాన్ని కూలదోసి దాని స్థానంలో కార్మిక వర్గ రాజ్యాన్ని స్థాపించి కార్మికుల, ఇతర పీడిత వర్గాల ప్రయోజనాలను కాపాడే రాజ్యాంగాన్ని రచించుకోవాలనేది వారి వాదన.

బ్రిటిష్ వలసవాద వ్యతిరేక స్వాతంత్ర్య పోరాటం, పాశ్చాత్య దేశాలలో జరిగిన ప్రజాస్వామిక విప్లవాలు, రష్యా అక్టోబర్ విప్లవం, మన దేశంలో జరిగిన భూస్వామ్య వ్యతిరేక పోరాటం, అంబేద్కర్, ఫూలే, పెరియార్‌లతో సహా ఇతర ప్రగతిశీల శక్తుల కుల వ్యతిరేక, బ్రాహ్మణవాద వ్యతిరేక పోరాటాల వలన ప్రజలలో హక్కుల చైతన్యం ఏర్పడింది. ఈ చైతన్యాన్ని హక్కుల రూపంలో రాజ్యాంగంలో పొందుపరచడానికి అంబేద్కర్, ఇతర ప్రగతిశీల, ప్రజాస్వామిక శక్తులు తమ శాయశక్తులా విశేషమైన కృషి సలిపారు. రాజ్యాంగం అమలులోకి వచ్చిన తరువాత కూడా జరిగిన ఎన్నో ప్రజా పోరాటాల వల్ల, నిజాం వ్యతిరేక తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం వల్ల, 1967లో ప్రారంభమయిన నక్సల్బరీ పోరాటం, తదనంతర విప్లవోద్యమం వలన అంబేద్కర్ అనంతర కాలంలో కూడా రాజ్యాంగంలో ఎన్నో ప్రగతిశీలమైన సవరణలు చోటు చేసుకున్నాయి. ఈ హక్కులన్నింటినీ కాపాడుకోవడం ప్రజలందరి విధి. ఆ హక్కులకు విఘాతం కలిపించి కాలరాసేందుకు పాలకవర్గాలు, ముఖ్యంగా నేడు అధికారంలో ఉన్న బిజేపి ప్రభుత్వం చేస్తున్న, చేసే ప్రయత్నాలకు వ్యతిరేకంగా మాత్రం పోరాడవలసిందే. ఆ ప్రయత్నం మార్క్సిస్టు విప్లవకారులతో సహా,



**ఈ రాజ్యాంగాలు మతం నుండి స్వేచ్ఛను ఇవ్వలేదు. మతాన్ని ఎంచుకునే స్వేచ్ఛను ఇచ్చాయి (Not freedom from religion, but freedom of religion). అట్లాగే ఆస్తి నుండి స్వేచ్ఛను కాక ఆస్తిని కలిగి ఉండడానికి, సంపాదించడానికి స్వేచ్ఛను ఇచ్చాయి (Not Freedom from property, but freedom of property). దీని వల్ల వచ్చే వైరుధ్యాలకు ఈ రాజ్యాల దగ్గర కానీ, రాజ్యాంగాల దగ్గర కానీ సమాధానం లేదు – మార్క్స్**

ప్రగతిశీల శక్తులందరూ చేయాలి. అలా చేస్తూనే రాజ్యాంగమే సర్వస్వం, విమర్శలకు అతీతం, రాజ్యాంగానికి లోబడి మాత్రమే సమస్యలను పరిష్కరించుకోవాలి అనే రాజ్యాంగవాదాన్ని మాత్రం తిప్పికొట్టాల్సిన అవసరం ఉంది.

ఈ విషయాలను మరింత వివరంగా చూసే ముందు అసలు రాజ్యాంగవాదం అంటే ఏమిటి, చారిత్రకంగా రాజ్యం, రాజ్యాంగం, రాజ్యాంగ హక్కుల పుట్టుకటీ వర్గ వ్యవస్థకూ – వర్గ దోపిడీకి రాజ్యంతో, రాజ్యాంగంతో ఉన్న సంబంధం వంటి విషయాలను కొంత లోతుగా చూడవలసి ఉంది.

**రాజ్యాంగవాదం:**

రాజ్యాంగవాదం అనే దానికి స్థూలంగా రెండు రకాల వ్యాఖ్యలు ఉన్నాయి.

ఒకటి ఉదారవాద దృక్పథంతో చేసే వ్యాఖ్య కాగా మరొకటి మార్క్సిస్టు దృష్టికోణంతో చేసే వ్యాఖ్య.

రాజ్యాంగం అనేది ప్రభుత్వ సంస్థల, దేశ రాజకీయ సంస్థల నిర్మాణాన్ని నిర్ణయించే నిబంధనలను కలిగి ఉన్న అధికారిక పత్రం. ఇది ప్రభుత్వానికీ, పౌరులకూ నిబంధనలను, పరిమితులను విధిస్తుంది.

పాశ్చాత్య ఉదారవాద రాజ్యాంగవాదం ప్రకారం 'రాజ్యాంగబద్ధమైన రాజ్యం' అంటే కొన్ని పరిమితులతో ప్రభుత్వం పనిచేయడానికి స్పష్టమైన చట్టాలు, స్పష్టంగా గుర్తింపబడిన పాలనాపరమైన మర్యాదలు ఏర్పడి ఉండాలి. నిర్దేశించిన పద్ధతి ప్రకారం ఒక చట్రంలో పనిచేసే చట్ట సభలు, కార్యనిర్వాహక వర్గం, న్యాయ వ్యవస్థ ఉండాలి. ఒక వేళ ఏదైనా మార్పులు చేయాలనుకుంటే వ్యవస్థపై ఎటువంటి హింస ప్రయోగం లేకుండా శాంతియుతంగా, ఒక పద్ధతి ప్రకారం జరగాలి. అందరికీ స్వేచ్ఛ, సమానత్వం అందేలా చట్టబద్ధమైన పాలన ఉండాలి, పత్రికా స్వాతంత్ర్యం ఉండాలి, ఎవ్వరైనా అధికారంలోకి రావడానికి వీలుగా ఉండే బహుళత్వం కలిగిన సమాజం ఉండాలి.

ఉదారవాద దృష్టిలో రాజ్యపు విభిన్న విభాగాల మధ్య అధికారాల విభజన ఉంటుంది. ఏ విభాగం కూడా తన పరిధిని దాటకుండా కట్టుబాట్లు, అడ్డుకట్టలు ఉంటాయి. ఉదాహరణకు చట్ట సభలకు, కార్యనిర్వాహక విభాగానికి, న్యాయ వ్యవస్థకు మధ్య అధికారాల విభజన ఉండి అవి ఆయా పరుధులు దాటకుండా ఉండేలా రాజ్యాంగంలోనే నియమాలు ఉంటాయి.

ఈ దృష్టిలో రాజ్యం నిష్పక్షపాతమైనది. రాజ్యాంగం ముందు, చట్టం ముందు అందరూ సమానులే. ఏ వర్గం పట్ల కూడా పక్షపాతం వహించదు. సంక్షిప్తంగా చెప్పాలంటే రాజ్యాంగవాదం అంటే చట్టబద్ధ పాలన.

**ఇదీ స్థూలంగా రాజ్యాంగవాదం పట్ల ఉదారవాద దృష్టి.**

కానీ, పెట్టుబడిదారీ వ్యవస్థలో ఎట్లాగైతే కార్మికులకు, పెట్టుబడిదారులకు మధ్య సమానమైన వినిమయం జరుగుతున్నట్టు పైకి కనిపిస్తుందో, అదే విధంగా రాజ్యాంగం అందరికీ సమానమైన హక్కులను కల్పిస్తున్నట్టు కనిపిస్తుంది. రాజ్యం వర్గాతీత తటస్థ సంస్థ లాగా అనిపిస్తుంది.

కానీ అధికారంలో ఉండే వర్గాలకు మౌలికంగా సేవ చేయడమే రాజ్యం, రాజ్యాంగం మౌలికంగా చేసే పని అనే వాస్తవాన్ని ఆ దృక్పథం గ్రహించదు. లేదా ఆ వాస్తవం పట్ల ఉపేక్షాభావాన్ని ప్రదర్శిస్తుంది. పాలక వర్గాల వద్ద పేరుకుపోయిన సంపద, వారి అధికారాలు, పలుకుబడి రాజకీయాలపై చూపే ప్రభావం; పేదలకు ఎటువంటి అధికారం, పలుకుబడి లేకపోవడం వంటి అంశాలను అది పరిగణనలోకి తీసుకోదు. మొత్తం మీద ఈ ఉదారవాద రాజ్యాంగవాద సిద్ధాంతం 'సామాజిక సమస్య'లను పరిగణనలోకి తీసుకోదు.

కొంత మంది ప్రగతిశీల రాజ్యాంగవాదులు రాజ్యాంగాన్ని ప్రగతిశీలంగా వ్యాఖ్యానించడం పైన ఎక్కువ కేంద్రీకరిస్తారు. అంటే – కొన్ని లోపాలు ఉన్నప్పటికీ రాజ్యాంగం బాగానే ఉంది, దానిని అమలు పరచడంలోనే సమస్య అంతా – అనే రీతిలో వీరి అవగాహన ఉంటుంది. నిజమైన ప్రజాస్వామ్యం అమలు కావడానికి అవసరమైన వ్యవస్థాగతమైన మార్పుల గురించి వీరికి పట్టింపు ఉండదు.

**రాజ్యాంగం పట్ల మార్క్స్ అవగాహన:**

మార్క్స్ తన జీవితకాలమంతా రాజ్యాంగ విషయాన్ని సైద్ధాంతికంగానూ, చారిత్రకంగానూ పరిశీలించాడు. 'హెగెల్ హక్కుల సిద్ధాంతం గురించిన విమర్శ' గ్రంథంలో రాజ్యాంగ సమస్యను వివరంగా చర్చించాడు. ఫ్రెంచ్ విప్లవ సందర్భంలోనూ, జర్మన్ విప్లవ సందర్భంలోనూ వచ్చిన రాజ్యాంగాలనూ, రాజ్యాంగ చర్చలనూ విమర్శనాత్మకంగా పరిశీలించి చర్చించాడు. '18వ బ్రూమేర్'లోనూ దీని గురించి విపులమైన చర్చ చేశాడు.

మార్క్స్ అభివృద్ధి పరిచిన రాజ్యాంగ సిద్ధాంతం రాజకీయమైనదే కాక సామాజికమైనది, సోషలిస్టు స్వభావంతో కూడుకున్నది. అది రాజ్యాంగపు చిక్కుముడులను సైద్ధాంతిక కోణంలోనే కాక సామాజిక-ఆర్థిక కోణం నుండి విశ్లేషిస్తుంది. రాజ్యాంగాన్ని మహనీయులైన, జాతి నిర్మాతలైన గొప్ప నాయకులు రచించారు కాబట్టి అది పవిత్రమైనదనే వాదనను, భవిష్యత్తు తరాల మీద అది విధించే ఆంక్షలను తిరస్కరిస్తుంది. రాజ్యాంగాన్ని ప్రజలకు అతీతమైనదానిగా పరిగణించడాన్ని వ్యతిరేకిస్తూ అది మార్పులను, ప్రయోగాలను ఆహ్వానిస్తుంది. రాజ్యాంగం సాధారణ చట్టాలకు అతీతమైనదనే భావనను, సాధారణ రాజకీయాలను కలిపి ఉంచుతుందనే వాదనను తిరస్కరిస్తుంది. రాజ్యాంగం వర్గ పోరాట ఫలితంగా పుట్టినదనీ, విభిన్నమైన అనేక సామాజిక సంబంధాలతో కూడుకొని ఉంటుందనీ భావిస్తుంది.

రాజ్యాంగం పట్ల మార్క్స్ విమర్శ రాజ్యంలో అధికారాల విభజనకు సంబంధించినదో, రాజ్యంలో భాగస్వామ్యం కొరకు పోరాటం చేయడం గురించి మాత్రమే కాదు. ప్రజాస్వామ్యాన్ని రాజకీయ రంగానికే కాక ఆర్థిక రంగానికి కూడా విస్తరించడాన్ని గురించి మార్క్స్ సిద్ధాంతం మాట్లాడుతుంది. రాజ్యం నుండి ప్రజల పరాయీకరణను దూరం చేయడానికి రాజ్యంపై సామాజిక అదుపు ఉండాలనీ, సమాజం 'స్వేచ్ఛాయుతమైన శ్రమజీవుల సంఘంగా' ఉండాలనీ మార్క్స్ సిద్ధాంతం వాదిస్తుంది. అంటే మార్క్స్ దృష్టిలో ప్రజాస్వామ్యం, సామ్యవాదం ఒక్కటిగానే ఉండాలి. పెట్టుబడిదారీ విధానానికి ప్రత్యామ్నాయాన్ని స్థాపించాల్సిన అవసరం, అవకాశాల నుండి మార్క్స్ రాజ్యాంగ విమర్శ ఉంటుంది.

ఆధునిక రాజ్యాంగాలలోని మౌలిక వైరుధ్యం సామాజిక, రాజకీయ విముక్తిలను విడదీయడంలో ఉంది అని మార్క్స్ 18వ బ్రూమేర్ లో వాదిస్తాడు. 'ఒక వైపు ఫ్రెంచ్ రాజ్యాంగం వర్గాలపై ఆధార పడిన సామాజిక వ్యవస్థను (కార్మికులు పెట్టుబడి పై ఆధార పడి, దోపిడితో కూడిన వేతన శ్రమపై ఆధార పడే వ్యవస్థ) బలోపేతం చేస్తుంది; మరో వైపు అది పౌరులందరికీ ఓటు హక్కును కల్పిస్తుంది. అది ఒకవైపు రాజకీయ విముక్తిని ప్రసాదిస్తుంది, కానీ సామాజిక విముక్తిని అడ్డుకుంటుంది. దీని వల్ల ఒక వైరుధ్యం పుడుతుంది. ఒకవైపు కార్మికుల, రైతాంగ, పెటీ-బూర్జువా వర్గాల సామాజిక బానిసత్వాన్ని కొనసాగిస్తుంది. మరొకవైపు సార్వజనీన ఓటు హక్కు ద్వారా ఆ వర్గాల చేతిలో రాజకీయ హక్కును పెడుతుంది. బూర్జువా వర్గం చేతిలో పాత సామాజిక అధికారం కొనసాగడాన్ని అది అనుమతిస్తుంది. అదే సమయంలో ఆ అధికారానికి ఉన్న రాజకీయ గ్యారంటీని అది తొలగిస్తుంది. అంటే పెట్టుబడిదారీ వర్గం తన ఇష్టా రాజ్యంగా పాలించకుండా కొన్ని ప్రజాస్వామిక పరిమితులకు లోబడి పనిచేయడానికి బాధ్యులను చేస్తుంది. రాజకీయ స్వేచ్ఛ నుండి సామాజిక విముక్తి వైపు ముందుకు కదలకూడదని కార్మిక వర్గం పై ఆంక్షలు విధిస్తుంది. అంటే ఓటు హక్కు వినియోగించుకోవచ్చు, ఎన్నికలలో పాల్గొనవచ్చు, కానీ తమ ఆర్థిక, సామాజిక సమానత్వం కోసం అడగకూడదు, వాటి కోసం పోరాటమైతే అసలే చేయకూడదు.

పెట్టుబడిదారీ వర్గం పాత సామాజిక అణచివేతను కొనసాగించుకోవచ్చు కానీ పాత తరహా రాజకీయ అధికారం వైపు (రాజరికంలోని అధికారం వంటిది) వెళ్ళకూడదని ఆ వర్గంపై ఆంక్షలు విధిస్తుంది. అంటే శ్రమ దోపిడీ, అదనపు విలువ దోపిడీని కొనసాగించవచ్చు కానీ, రాజరికాల పాలనలో, భూస్వామ్య పాలనలో ఉన్నట్లు అంతులేని రాజకీయ అధికారం కోసం చూడకూడదు. 'ప్రజాస్వామ్యం' రాజకీయ అధికారం పై విధించే కొన్ని పరిమితులకు లోబడి పనిచేయాలి తప్పితే పాత కాలపు అపరిమిత రాజకీయ అధికారాలకై చూడకూడదు.

ఏ రాజ్యాంగమైతే పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని స్థాపిస్తుందో అదే రాజ్యాంగం ప్రైవేటు ఆస్తి హక్కును పరిరక్షించడం ద్వారా, అనేక ఇతర అంశాల ద్వారా సామాజిక వ్యవస్థను మౌలికంగా మార్చడంలో ప్రజానీకానికి ఉన్న రాజకీయ శక్తిని అడ్డుకుంటుంది. రాజకీయ విప్లవం ద్వారానే ప్రజాస్వామ్యం, రాజ్యాంగం ఉనికిలోకి వచ్చాయి కానీ అది అసంపూర్ణమైన విప్లవం. సమాజం మరింత ప్రజాస్వామికం కావడాన్ని రాజ్యాంగం నిరోధిస్తుంది. ఆర్థిక వ్యవస్థను ప్రజాస్వామికీకరణ చేయడం ద్వారా సమాజాన్ని మార్చే శక్తిని కార్మికులకు, రైతాంగానికి, పెటీ-బూర్జువా వర్గాలకు లేకుండా చేయడానికి ప్రయత్నిస్తుంది. మరో విధంగా చెప్పాలంటే, ఒక సామాజిక-రాజకీయ వ్యవస్థను స్థిరీకరించి ప్రజల రాజకీయ ప్రజాస్వామ్యాన్ని మరింతగా విస్తరింపజేయడాన్ని మరింత లోతుగా చేయడాన్ని నిరోధించి, విప్లవం కొనసాగడాన్ని అడ్డుకుంటుంది'.

రాజ్యాన్ని ప్రజలకు అతీతమైనదానిగా, భౌతిక సంపదకు అతీతమైన రాజకీయ సాధనంగా చిత్రీకరించడం అనేది ఆధునిక ప్రజాస్వామ్యం చేస్తున్న పని అని మార్క్స్ అంటాడు. ఉదాహరణకు భూస్వామ్య సమాజంలో భూస్వాములకు రాజకీయ అధికారం ఉంటుంది. సంపద కూడా భూస్వామి లేదా రాజు సొత్తు. కానీ ఆధునిక రాజ్యంలో రాజకీయ హక్కు అందరికీ సమానం; చట్టపరంగా సంపదకు, రాజ్యానికి సంబంధం లేదు. కానీ వాస్తవంలో ఆ రాజకీయ హక్కును ప్రభావితం చేసే సంపద కొందరి సొత్తు. ఆ సంపద పెంపు కోసం రాజ్యాన్ని ఉపయోగించుకున్నా అది కూడా ప్రజాస్వామ్యం పేరుతోనే జరుగుతుంది. ఇలా జరుగుతున్నదని ప్రజలు కూడా చూస్తుంటారు. కానీ ఈ స్థితిని మార్చడానికీ ఉత్పత్తి వ్యవస్థను మార్చడానికీ ఉన్న సంబంధాన్ని ఈ రాజ్యాంగం, ప్రజాస్వామ్యాల మేలి ముసుగులు మరుగు పరుస్తుంటాయి.

ఆధునిక రాజ్యాంగాలు పౌరులందరినీ ఏక రూపత కలిగిన ఒక సమూహంగా పరిగణిస్తాయి. కానీ వారిలో ఉండే వర్గ అంతరాలను, ఇతర అంతరాలను పరిగణనలోకి తీసుకోదు. చట్టం

ముందు అందరూ సమానులే అన్న ఉదాత్తమైన విలువను మాత్రం ప్రకటిస్తుంది. ఎన్నో పోరాటాల తరువాత కొన్ని రకాల అంతరాలను - ఉదాహరణకు కుల అంతరాలను, ఆదివాసీ-ఆదివాసీయేతర అంతరాలను కొన్ని పరిమిత అవసరాల కోసం మాత్రమే పరిగణనలోకి తీసుకుంటుంది. వర్గ అంతరాలను మాత్రం పరిగణనలోకి తీసుకోదు. రాజకీయ అధికారానికి, ఇతర హక్కులకు ఈ అంతరాలకు మధ్య ఉన్న సంబంధాన్ని పరిగణనలోకి అస్సలు తీసుకోదు. న్యాయవ్యవస్థ కూడా సామాజిక వర్గాల అస్తిత్వాన్ని ఏ మాత్రం పట్టించుకోదు. వీటన్నింటి వల్ల ఆ వర్గ అంతరాలు, కుల అంతరాలు, ఇతర అంతరాలు ఎన్ని రకాలుగా పునరుత్పత్తి అవుతున్నాయనే విషయం పట్ల ఉదారవాద రాజ్యాంగవాదం కళ్ళు మూసుకుంటుంది.

రాజ్యాంగం పట్ల ఈ మార్క్సిస్టు అవగాహనను మరింత అర్థం చేసుకోవాలంటే సంక్షిప్తంగానైనా సరే రాజ్యం, రాజ్యాంగాల పుట్టుకను, చరిత్రను తెలుసుకోవాలి. అవి తెలుసుకున్నప్పుడే రాజ్యాంగవాదం పట్ల మార్క్సిస్టు దృక్పథాన్ని అర్థం చేసుకోగలం.

**రాజ్యం పుట్టుక - వర్గ దోపిడీ:**

మానవులు ఉత్పత్తి చేయడం ఆరంభించాక, ఉత్పత్తి పెరిగేకొద్దీ ఉత్పాదనలు పెరిగి ఉత్పత్తి శక్తులు బాగా అభివృద్ధి చెంది సమాజం ఎడతెగని వర్గ వైరుధ్యాలలో చిక్కుకుపోయినప్పుడు చారిత్రకంగా రాజ్యం ఆవిర్భవించింది.

ఈ వైరుధ్యాల కారణంగా భిన్న ప్రయోజనాలతో ఉన్న వర్గాల మధ్య ఎడతెగని నిష్ప్రయోజనమైన ఘర్షణలలో సమాజం కూరుకుపోకుండా ఉండటానికి, ఈ ఘర్షణలను నియంత్రించి సమాజంలో 'శాంతిని' నెలకొల్పడానికి ఆ సమాజానికి అతీతంగా, 'నిష్పక్షపాతంగా' వ్యవహరించే శక్తి అవసరమైంది. ఈ శక్తి సమాజాన్నుంచే ఆవిర్భవించినా అది తనను తాను సమాజానికి అతీత స్థానంలో ఉంచుకొన్నది. అది క్రమంగా మరింత ఎక్కువగా ఆ సమాజం నుండి దూరం జరిగింది. అదే రాజ్యం - అని ఎంగెల్స్ అంటాడు.

సమాజంలో ఆ 'శాంతిని' నెలకొల్పడానికి రాజ్యం ఉపయోగించే సాధనం 'సాయుధ బలగాలు'. కోర్టులు, జైళ్ళు, సైన్యం ఇవన్నీ అందులో భాగమే. మరో మాటలో చెప్పాలంటే, పైకి భిన్నంగా కనిపించినా, రాజ్యపు శక్తి సమాజానికి అతీతంగా నిష్పక్షపాతంగా ఉండదు. సంపద కలిగి ఉన్న వర్గం, సంపద లేని వర్గాన్ని అణచి ఉంచేందుకు అది ఒక సాధనం.

అయితే బలంతో, బలగాలతో మాత్రమే ప్రజలను అణచి ఉంచడం సాధ్యం కాదు కాబట్టి దానికి తోడుగా చట్టాలు, రాజ్యాంగం వంటివి (మతం, సాహిత్యం, కులం వంటి ఇతర అంశాలు) ఉనికిలోకి వచ్చాయి. ఇప్పటి వరకు ఏర్పడిన రాజ్యాలన్నీ ఒక దానికి మించి మరొకటి బలపడుతూ వచ్చాయి. ఆధునిక రాజ్యం అన్నింటి కంటే కూడా బలవత్తరమైనది. ఈ రాజ్యపు నిజస్వభావాన్ని కప్పిపుచ్చే అందమైన కవచమే రాజ్యాంగం. అది నగిషీలతో కూడి ఉంటుంది.

రాజ్యం ఏర్పడినప్పటి నుండి పరిపాలన కోసం ఆయా వ్యవస్థలకు సంబంధించిన నియమాలను పాటిస్తూనే వచ్చింది. అయితే ఆధునిక ప్రజాస్వామ్య రాజ్య ఆవిర్భావానికి ముందున్న అన్ని చట్టాలు, నియమాలు అసమానతలతో కూడి ఉండేవి. ఉదాహరణకు చట్టరీత్యానే బానిసలకు సంబంధించి ఉండే నియమనిబంధనలు వేరే, బానిస యజమానులకు ఉండే నియమ నిబంధనలు వేరే. భూస్వాములకు ఉండే నియమ నిబంధనలు వేరే, రైతులకు, అర్ధ బానిసలకు ఉండే నియమాలు వేరే. మన దేశంలో ఉన్నది కుల ఆధారిత భూస్వామ్యం కాబట్టి బ్రాహ్మణులకు ఒక నియమం, క్షత్రియులకు ఒక నియమం, వైశ్యులకు ఒక నియమం, శూద్రులకు ఒక నియమం, దళితులకు ఒక నియమం, స్త్రీలకు ఒక నియమం - అదికూడా కులాల వారీగా, అసమానమైన నియమాలు ఉంటూ వచ్చాయి. అసమానతలతో కూడిన వర్ణాశ్రమ ధర్మమే అన్ని చట్టాలకు, నియమ నిబంధనలకు మూలం. పెట్టుబడిదారీ విధానం అవతరించి బూర్జువా ప్రజాస్వామ్య పాలన కోసం పోరాటం చేస్తున్న క్రమంలోనే ప్రజలందరికీ సమాన రాజకీయ అధికారం అనే భావన పుట్టింది. ఆదివాసీ సమాజాలలో వర్గాలు పూర్తిగా స్థిర పడక ముందు ఉన్న ప్రజాస్వామ్య భావన మళ్ళీ బూర్జువా ప్రజాస్వామ్య కాలంలోనే వేళ్లూనుకుంది. ఇదే ఆధునిక రాజ్యాంగాల పుట్టుకకు దారి తీసింది. ఈ రాజ్యాంగాలలో వయోజన ఓటింగు హక్కు వంటి అందరికీ సమానమైన రాజకీయ హక్కులు, కొన్ని సామాజిక హక్కులు ఉంటాయి. ఈ రాజ్యాంగాలలో పాలకుల అధికారాలకు కూడా కొన్ని పరిమితులు వచ్చాయి.

**ఈ సమాన హక్కుల భావన అభివృద్ధి చెందడం వెనుక ఉన్న ఆర్థిక, సామాజిక, రాజకీయ నేపథ్యం:**

సమాజ పరిణామ క్రమంలో భూస్వామ్య సమాజాలలోనే సరుకుల ఉత్పత్తి క్రమంగా పెరిగింది. ఆ సరుకుల ఉత్పత్తిదారులు తమ సరుకులను అమ్ముకోవాలంటే వారికి తాము ఉత్పత్తి చేసిన సరుకులపై స్వంత యాజమాన్యానికి సంబంధించిన రక్షణ ఉండాలి. భూస్వాముల ఆధిపత్యం ఉండకూడదు. భూస్వామ్య సమాజాలలో, రాజరికాలలో భూస్వాములు విధించినవే నియమాలు, చట్టాలు. పైగా ఇవి ప్రాంత ప్రాంతానికి మారుతుంటాయి. అందుకోసం యూరప్ లోని భూస్వాములు తమ తమ రాజ్యాలలో వాణిజ్యం పెరగడం కోసం 'మేము మీ వ్యాపారానికి రక్షణ కల్పిస్తామనీ, వ్యాపార కూడళ్ళ నగరాలలో వ్యాపారం చేసుకోవడానికి వెళ్ళి వచ్చే దారులలో తాము సాయుధ రక్షణ కల్పిస్తాం' అనీ ప్రకటనలు ఇచ్చే వాళ్ళు. వ్యాపారులు తామే స్వంత బలగాలను కూడా నియమించుకునేవారు. అయితే ఇటువంటి పరిస్థితిలో ఎవరి దగ్గర ఎక్కువ బలం, బలగం ఉంటే వారిది పై చేయి అవుతుంది. అంటే ఒక అసమాన స్థితి ఉంటుంది. సరుకుల సమాన వినిమయం సాధ్యం కాదు. సరుకుల సమాన వినిమయం లేకపోతే సరుకుల చలామణి, సరుకుల ఉత్పాదనలలో అంతరాయం కలుగుతుంది. పెట్టుబడిదారులకు/ సరుకుల ఉత్పత్తిదారులకు ఇది ఎంత మాత్రం ఆమోదయోగ్యమైన పరిస్థితి కాదు. కాబట్టి సరుకుల ఉత్పత్తిదారుల/ పెట్టుబడిదారుల మధ్య సమానత్వం అనే ఒక సూత్రం, నియమం, నినాదం పుట్టింది. వ్యాపార స్వేచ్ఛ భావన నుండి పుట్టిందే సమానత్వ భావన. ఆధునిక రాజ్యాలలో, రాజ్యాంగాలలో సమానత్వం అనే భావన

ప్రవేశించడంలోని ఆర్థిక కారణం ఇది. పెట్టుబడిదారులు భూస్వామ్యానికి వ్యతిరేకంగా పోరాడటానికి రైతాంగంతో సహా అశేష ప్రజానీకాన్ని కదిలించడానికి రకరకాల హక్కుల గురించి, సమానత్వ భావన గురించిన భావాలను ప్రచారం చేశారు. సమానత్వ భావన లోని రాజకీయ కారణం ఇది. ఈ ఆర్థిక, రాజకీయ కారణాల వల్ల ఆధునిక రాజ్యాలలో, రాజ్యాంగాలలో సమానత్వం అనే భావన ప్రవేశించింది.

భూస్వామ్యాన్ని కూలదోసి పెట్టుబడిదారీ వర్గం అధికారంలోకి వచ్చే క్రమంలో, బూర్జువా ప్రజాస్వామ్యం ఉనికిలోకి వచ్చింది. దానితోనే బ్రిటన్‌లో తప్ప దాదాపు మిగిలిన ఆధునిక ప్రజాస్వామిక రాజ్యాలన్నింటిలో లిఖిత రాజ్యాంగాలు ఉనికిలోకి వచ్చాయి.

ఈ రాజ్యాంగాలన్నింటిలో కూడా ఒక వైరుధ్యం ఉంది. ఏ పెట్టుబడిదారీ దేశపు రాజ్యాంగం కూడా ఆర్థిక సమానత్వాన్ని ఇవ్వలేదు. రాజకీయ సమానత్వం మాత్రం ఇచ్చాయి. ఫ్రెంచ్ రాజ్యాంగాన్ని గురించి చేసిన విశ్లేషణలో మార్క్స్ ఈ వైరుధ్యాన్ని గురించి విశ్లేషిస్తాడు. 'ఒక వైపు సామాజికంగా, ఆర్థికంగా తీవ్ర అసమానతలు ఉన్నాయి, మరొక వైపు రాజ్యాంగం ప్రకారం అందరికీ సమానంగా రాజకీయ హక్కు ఉంది. ఇది ఒక వైరుధ్యం. అంతే కాకుండా, పెట్టుబడిదారులకు విస్తృతమైన ఆర్థిక వనరులు, సంపద ఉన్నాయి. మరొక వైపు రాజ్యాంగం వారి రాజకీయ అధికారాల మీద కొన్ని పరిమితులను, నిబంధనలను విధిస్తున్నది. ఇది మరొక వైరుధ్యం. ఈ రెండు వైరుధ్యాలు ఒక సంక్షోభానికి దారి తీస్తాయి'- అని మార్క్స్ అంటాడు.

రాజ్యం ఆవిర్భవించినప్పటినుండి అది శ్రామికులను నియంత్రించి, అదుపు చేసి శ్రమ దోపిడీని సజావుగా సాగించడానికి ఆయా కాలాల, వ్యవస్థల పాలకవర్గాల చేతిలోని సాధనంగా ఉపయోగపడింది. అది బానిస వ్యవస్థ నాటి రాజ్యమైనా, మన దేశంలో మగధ సామ్రాజ్య కాలం నాటి తొలి రాజ్యమైనా, భూస్వామ్య వ్యవస్థ లోని రాజ్యమైనా లేదా ఆధునిక ప్రజాస్వామిక రాజ్యంగా చలామణీ అవుతున్న రాజ్యాలైనా – మౌలికంగా రాజ్యం నిర్వహించిన కర్తవ్యం అదే. రాజ్యాంగాలు కూడా అదే కర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్నాయి. ఈ కర్తవ్యాన్ని నెరవేర్చడంలో రాజ్యాంగాలు పాలకవర్గాల చేతిలో ఒక సాధనం మాత్రమే. పాలకులకు, పాలితులకు మధ్య నిష్పక్షపాతం అనేది ఆధునిక రాజ్యాంగాల విషయంలోనైనా ఒక భ్రమ మాత్రమే. భారత రాజ్యాంగమైనా అంతే.

పైగా ఈ రాజ్యాంగాలు, ఆధునిక బూర్జువా ప్రజాస్వామిక రాజ్యాలు ఉనికిలోకి రావడం కోసం కొన్ని శతాబ్దాల పాటు రక్తసిక్తమైన పోరాటాలు జరిగాయి. అవేవీ అహింసాయుత పోరాటాలతో ఉనికిలోకి రాలేదు. బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ, అమెరికా తదితర దేశాల రాజ్యాంగాల, ప్రజాస్వామిక రాజ్యాల ఆవిర్భావ చరిత్ర అంతా రక్తసిక్త పోరాట చరిత్రే.

ఈ స్వభావాన్ని, ఈ చరిత్రను అర్థం చేసుకోకుండా సాధారణంగా రాజ్యాంగానికి ఒక పవిత్రతను, ఉన్నతమైన స్థానాన్ని ఆపాదించడం జరుగుతున్నది. జాతిని నిర్మించిన లేదా దేశాలకు స్వాతంత్ర్యాన్ని సముపార్జించి పెట్టిన జాతి నిర్మాతలు, మహానాయకులు రాజ్యాంగాలను రచించారు కాబట్టి వాటి మౌలిక స్వభావాన్ని మార్చకూడదు అనే భావన కూడా ప్రచారంలో ఉండడం పరిపాటి. రాజ్యాంగం పవిత్రమైంది, మార్పులకు అతీతమైంది అనడమే అసలు అప్రజాస్వామికమైన వాదన. థామస్ జెఫర్సన్ అన్నట్టు 'చట్టం/రాజ్యాంగం బతికి ఉన్న మనుషులది, చనిపోయిన వారిది కాదు', కాబట్టి రాజ్యాంగాలకు స్థల కాలాల పరిమితులు ఉంటాయి, ఆ సమాజంలో నిర్దిష్టంగా ఏదైనా సమయంలో ఉన్న వర్గ బలాబలాలను బట్టి రాజ్యాంగం ఎన్నో మార్పులకు లోను కావడం సహజం. అట్లా జరగక పోవడమే అసహజమైన విషయం.

ప్రతీఘాతుకశక్తుల చేతిలో అధికారం కేంద్రీకృతమైనప్పుడు, ప్రజాస్వామ్యం ముసుగులోనే, రాజ్యాంగపు పవిత్రతను గురించి జపిస్తూనే న్యాయవ్యవస్థతో సహా అన్ని వ్యవస్థలు రాజ్యాంగ హక్కులను ఉల్లంఘించడం చూస్తూనే ఉన్నాం.

మతాన్ని మనుషులకు అతీతమైనదిగా ఎట్లా మార్చారో అట్లాగే రాజ్యాంగాన్ని కూడా ఇతర చట్టాలకు, మార్పులకు అతీతమైనది అనే భావనను ప్రచారం చేస్తున్నారు. కానీ, "ఏ విధంగానైతే మనుషులు మతాన్ని సృష్టించారు తప్పితే మతం మనుషులను సృష్టించలేదో, అదే విధంగా రాజ్యాంగాన్ని మనుషులు సృష్టించారు కానీ, మనుషులను రాజ్యాంగం కాదు".

ఆధునిక రాజ్యాలలో ఉండే మూడు విభాగాలైన చట్ట సభలు, కార్యనిర్వాహక వర్గం, న్యాయ వ్యవస్థల మధ్య అధికారాల విభజన ఉండటం ఆధునిక రాజ్యాంగాలలోని ముఖ్య లక్షణం. ఆ మూడు విభాగాలు స్వతంత్రంగా పని చేస్తూ పరస్పరం ఒక దానిపై మరొకటి కొన్ని పరిమితులను విధిస్తూ, సమతౌల్యంతో ఉంటూ అధికార కేంద్రీకరణ, దుర్వినియోగం జరగకుండా చూస్తాయని ఉదారవాద రాజ్యాంగవాదం చెబుతుంది. రాజ్యాంగానికి ఉన్న అణచివేత స్వభావానికి, అది పాలకవర్గాల చేతులలో ఒక పనిముట్టు అనే వాస్తవానికి ఈ వాదం ఒక ముసుగు కప్పుతుంది. అధికారాల ఈ విభజన పైకి ఉన్నప్పటికీ పాలకవర్గాల సంపద వీటిని తెర వెనుక నుండి ప్రభావితం చేసే విషయాన్ని మాత్రం మరుగున ఉంచుతారు.

ఈ అంతస్సారాన్ని గురించి మార్క్సిస్టులు బహిర్గతపరచాల్సిన అవసరం ఉంది.

న్యాయవ్యవస్థను విమర్శకు అతీతులను చేయడాన్ని గురించి, ఉన్నత న్యాయస్థానాల న్యాయమూర్తులను తొలగించడం దుస్సాధ్యమైన విషయంగా చేయడాన్ని కూడా మార్క్స్ విమర్శిస్తాడు. గత కాలపు దోపిడీ వ్యవస్థతో సన్నిహితంగా ఉన్న న్యాయ వ్యవస్థ రాజ్యాంగాన్ని వ్యాఖ్యానించవలసి వచ్చినప్పుడు యథాస్థితిని కొనసాగించే రీతిలోనే వ్యాఖ్యానించి మార్పును అడ్డుకుంటుంది. ప్రజలు చేయగలిగేది ఏమీ ఉండదు. మెజారిటీ ప్రజానీకానికి వ్యతిరేకమైన అటువంటి న్యాయాధికార వ్యవస్థ ఉండటం ఆధునిక రాజ్యాంగ వ్యవస్థలలో ఉన్న ఒక ముఖ్య లక్షణం.

న్యాయవ్యవస్థ స్వతంత్రమైనదనేది ఒక కాల్పనిక భావన మాత్రమే. సామాజిక నియంత్రణను ఈ న్యాయ వ్యవస్థ వ్యతిరేకిస్తుంది. రాజ్యాన్ని మరింత ప్రజాస్వామ్యయుతంగా

మార్చడాన్ని అడ్డుకుంటుంది. న్యాయవ్యవస్థ కూడా ప్రజలకు జవాబుదారీతనం వహించాలంటే ఇతర పబ్లిక్ సర్వెంట్‌ల లాగానే జడ్జిలను కూడా ఎన్నుకోవాలనీ, వారు తమ తీర్పులకు బాధ్యత వహించాలనీ, వారిని ప్రజలే తొలగించే పద్ధతులు కూడా ఉండాలనీ మార్క్స్ ప్రతిపాదిస్తాడు.

కోర్టులకు ఉన్న వర్గ దృష్టిని మరుగు పరిచి అవి న్యాయాన్ని, ధర్మాన్ని ఎత్తి పట్టే పవిత్ర సంస్థలని నిరంతరం హోరెత్తిస్తూ ఉండటం మనం చూస్తాం. కానీ, కోర్టులు ఈ డెబ్బై అయిదేళ్లలో పాలకవర్గాల, ఆధిపత్య కులాల ప్రయోజనాలనే ప్రధానంగా ఎత్తి పట్టాయి. కొన్ని మినహాయింపులు మాత్రం ఉండవచ్చు.

పార్లమెంటు రాజభరణాలను రద్దు చేస్తూ చట్టం చేస్తే ప్రైవేటు ఆస్తి హక్కు ఉల్లంఘన అని సుప్రీం కోర్టు ఆ చట్టాన్ని కొట్టి వేసింది. భూసంస్కరణ చట్టాలను చేసినప్పుడు, బ్యాంకులను జాతీయం చేసినప్పుడు కూడా ప్రైవేటు ఆస్తి హక్కుకు భంగకరమనే ప్రజా వ్యతిరేక వైఖరినే కోర్టులు అవలంబించాయి. మరో వైపు ఎస్ఈజెడ్ ల పేరు మీద, పరిశ్రమల పేరు మీద, గనుల పేరు మీద, విమానాశ్రయాలు, నౌకాశ్రయాల పేరు మీద రైతుల, ఆదివాసీల భూములను లాక్కుంటూ వాళ్ళను నిర్వాసితులను చేస్తుంటే పార్లమెంటులో తామే చేసిన పెసా చట్టాన్ని, 5వ 6వ షెడ్యూల్‌లను నిస్సిగ్గుగా ఉల్లంఘిస్తుంటే కోర్టులు ప్రైవేటు ఆస్తుల ఉల్లంఘన చేయకూడదని తీర్పులు వెలువరించడం లేదు. వీటన్నింటిలో కోర్టుల వర్గ స్వభావం స్పష్టంగా బయటపడుతూనే ఉంది. ఇక ఈ దేశంలో అసంఖ్యాకంగా జరిగిన అగ్రకుల దాడుల, మారణకాండల విషయంలో అగ్రకులాల వారిని నిర్దోషులుగా విడుదల చేస్తూ ఎటువంటి తీర్పులు వెలువరించాయో మన అందరికీ తెలిసిన విషయమే. రిజర్వేషన్లపై 50శాతం వరకు మాత్రమే పరిమితి విధించడంలోనూ, ఆర్థికంగా వెనుకబడిన వర్గాల పేరుతో అగ్రకులాలకు పది శాతం ఈడబ్ల్యూఎస్ రిజర్వేషన్ కల్పించడంలోనూ కోర్టుల అగ్రకుల స్వభావం బయటపడుతూనే ఉంది. బిజెపి రాజకీయ ప్రాబల్యం పెరగగానే కోర్టులు హిందూత్వకు అనుకూలంగా అసంఖ్యాకమైన తీర్పులను వెలువరించడం కూడా మనం చూస్తూనే ఉన్నాం.

కోర్టులు చాలా అరుదుగా ఎప్పుడైనా రాజ్యానికి వ్యతిరేకంగా ఏదైనా తీర్పు ఇస్తే లేదా ప్రజానుకూల తీర్పులు వెలువరిస్తే వాటిని చూపించి అంతా సజావుగా ఉంది, చక్కగా ఉంది అని కోర్టుల సాధారణ వర్గ స్వభావాన్ని కప్పి పెట్టే ప్రయత్నాలు కొనసాగుతుంటాయి.

ఈ మధ్య కాలంలోనైతే కోర్టుల ప్రజా వ్యతిరేక, లేదా పాలక వర్గ అనుకూల తీర్పులను ప్రగతిశీల కోణంలో విమర్శించడాన్ని కూడా నేరంగా పరిగణించి కోర్టు ధిక్కార నేరంగా పరిగణించడం సాధారణమైంది. ఇక కార్పొరేట్ మీడియా ఐతే అటువంటి విమర్శలను రాజ్యాంగ వ్యతిరేకత కింద, దేశద్రోహం కింద లెక్కకట్టి ప్రచారం చేస్తున్నాయి. తీర్పులను విమర్శించే వాళ్ళు కూడా కోర్టు ధిక్కార భయంతో 'మాకు భారత న్యాయ వ్యవస్థపై నమ్మకముంది' అని ప్రకటన జత చేస్తూ సుతిమెత్తగా విమర్శించాల్సిన పరిస్థితిని చూస్తూనే ఉన్నాం.

సామ్రాజ్యవాద దేశాలలోని 'చట్టబద్ధ పాలన'కు కూడా మరో పరిమితి ఉంది. యూరోప్‌లోని దాదాపు అన్ని దేశాలలో, అమెరికాలో 18,19 శతాబ్దాలలోనే రాజ్యాంగాలు, 'చట్టబద్ధ పాలన' అమలులోకి వచ్చినా అవి ఆయా దేశాలకు మాత్రమే పరిమితమైనాయి. అవి ఆక్రమించుకున్న వలస దేశాలలో మాత్రం అవి చేసింది 'చట్టబద్ధ పాలన' కాదు, బలప్రయోగ పాలన. ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా దేశాలలో అవి అమానుషమైన బలప్రయోగం, హింసా కాండ, రక్తపాతంతోనే మూడు, నాలుగు శతాబ్దాల పాటు తమ పాలనను కొనసాగించాయి, 'చట్టబద్ధ పాలనతో కాదు'. తమ దేశంలో నిషేధించిన నల్లమందును యూరోపియన్ దేశాలన్నీ చైనాకు రవాణా చేస్తే, అక్కడి ప్రభుత్వం అడ్డుకున్నందుకు స్వేచ్ఛా వ్యాపారాన్ని అడ్డుకుంటున్నారంటూ చైనాపై దాడి చేశాయి. అవే నల్లమందు యుద్ధాలుగా ప్రసిద్ధమైన యుద్ధాలు. అట్లా ఉంటుంది వీటి చట్టబద్ధ పాలన. అన్ని అంతర్జాతీయ చట్టాలను ఉల్లంఘిస్తూ అమెరికా ఈ రోజు చేస్తున్న సైనిక దాడుల సంగతైతే ఇక చెప్పనే అక్కర్లేదు. సామ్రాజ్యవాద దేశాలు ఇతర దేశాల పట్ల అవలంబించే ఈ ద్వంద్వ నీతినే దేశంలో అంతర్గతంగా రాజ్యాంగాన్ని, చట్టాలను అమలు పరచడంలో కూడా కనబరుస్తాయి. వేరే దేశాలతో వాణిజ్య ఒప్పందాల ముసుగుతో తమ సరుకులను అమ్మడానికి ఆర్థిక వ్యవస్థను తెరవాలని బలవంత పెట్టడం, ఆంక్షలను ఏక పక్షంగా విధించడం వంటివి కూడా 'చట్టబద్ధ పాలన' పేరుతోనే జరుగుతున్నాయి.

అందుకే ఈ రాజ్యాలకు, రాజ్యాంగాలకు ఉత్పత్తి వ్యవస్థలకు మధ్య ఉన్న సంబంధాన్ని అర్థం చేసుకోవాలి. పెట్టుబడిదారీ వ్యవస్థతో ముడిపడి మాత్రమే ఆధునిక రాజ్యాంగాలు వచ్చాయి. పెట్టుబడిదారుల/పాలకవర్గాల, సామ్రాజ్యవాదుల ప్రయోజనాలు కాపాడడం మాత్రమే వీటి ప్రాథమిక కర్తవ్యం అనే ఎరుక ఎప్పుడూ మనకు ఉండాలి.

**భారతదేశంలో రాజ్యాంగం:**

యూరప్ దేశాల్లో భూస్వామ్య వ్యవస్థను కూలదోసి పెట్టుబడిదారీ సమాజం, దానికి అనుగుణమైన బూర్జువా ప్రజాస్వామిక రాజ్యం అవతరిస్తున్న క్రమంలో ఆధునిక రాజ్యాంగాలు వచ్చాయి. భారతదేశంలో రాజ్యాంగం అవతరించిన నేపథ్యం భిన్నమైనది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత బలహీనపడిన బ్రిటిష్ వలసవాదం మన దేశంలో జరుగుతున్న వలసవాద వ్యతిరేక పోరాటాన్ని అణచివేయటం సాధ్యం కాని స్థితిలో తన ఆర్థిక ప్రయోజనాలను కాపాడుకుంటూ ఇక్కడి నుండి వైదొలగడం క్షేమమని భావించింది. అట్టి పరిస్థితులలో ఇక్కడి దళారీ పెట్టుబడిదారులకు, సంస్థానాధీశులకు, భూస్వాములకు ప్రత్యక్ష రాజ్యాధికారాన్ని అప్పగించింది. ఆ నేపథ్యంలో ఇక్కడ రాజ్యాంగ రచన జరిగింది. అంటే భారత దేశం ఒక అర్ధ భూస్వామ్య-వలస దేశం నుండి అర్ధ వలస-అర్ధ భూస్వామ్య దేశంగా అవతరించిన నేపథ్యంలో రాజ్యాంగ రచన జరిగింది. మన రాజ్యాంగానికి ఆ పరిమితులు ఉంటాయి.

**మన దేశంలో రాజ్యాంగ సభ ఏర్పాటు:**

ఆంగ్లేయులు మన దేశంలో ఉన్న కాలంలోనే రాజ్యాంగ

సభను ఎన్నుకునేందుకు 1946 జనవరిలో ప్రావిన్షియల్ (ప్రాదేశిక) ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికలలో ఓటు వేసే హక్కు అందరికీ లేదు. సార్వజనిక వయోజన హక్కు లేదు. భూమి ఉన్న వాళ్ళు, కౌలు చెల్లించే వాళ్ళు, విద్యావంతులు, కొందరు మహిళలు - వీళ్ళు మాత్రమే ఓటు హక్కు కలిగిన వాళ్ళు. వాళ్ళు ప్రావిన్షియల్ సభలకు ప్రతినిధులను ఎన్నుకోగా ఆ ప్రతినిధులు రాజ్యాంగ సభ సభ్యులను ఎన్నుకున్నారు. అంటే ఇవి పరోక్ష ఎన్నికలు. అట్లా దాదాపు భారతదేశ వయోజనులలో నూరింట ఆరవ వంతు మంది మాత్రమే ఓటర్లుగా ఉన్న ఎన్నికలతో, అదీ పరోక్ష ఎన్నికలతో గెలిచిన 299 మంది సభ్యులతో రాజ్యాంగ సభ ఏర్పాటైంది. వీరికి తోడు 93 మంది సంస్థానాల నుండి నామినేట్ అయిన ప్రతినిధులు. అంటే వారు సంస్థానాధీశుల ప్రతినిధులు. ఎటువంటి ఎన్నిక లేకుండా వచ్చిన వారు.

వీరితో ఏర్పడిన రాజ్యాంగ సభ రాజ్యాంగాన్ని రచించడానికి ఒక రచనా కమిటీని నియమించింది. దానికి అధ్యక్షుడు డా. అంబేద్కర్.

అంబేద్కర్ బాంబే ప్రాదేశిక (ప్రావిన్షియల్) ఎన్నికలలో ఓడిపోగా, తూర్పు బెంగాల్ నుండి ఎన్నికయ్యాడు. కానీ పాకిస్తాన్ విడి దేశంగా ఏర్పడే ప్రక్రియ అప్పటికే ప్రారంభమైనందువల్ల తూర్పు బెంగాల్ నుండి ఎన్నికైన అంబేద్కర్ భారత రాజ్యాంగ సభలో స్థానం కోల్పోయాడు. తాను రాజ్యాంగ రచనలో ఎటువంటి పాత్ర నిర్వహించలేకపోతున్నానని భావించిన అంబేద్కర్ రాజ్యాంగంలో పొందు పరచడానికి 'షెడ్యూల్డ్ కాస్ట్స్ ఫెడరేషన్' తరపున 'స్టేట్స్ అండ్ మైనారిటీస్' అనే పత్రాన్ని రాశాడు. ఇందులో పొందుపరిచినవి అంబేద్కర్ అసలైన ఆలోచనలు. కానీ రాజ్యాంగ నిర్మాణంలో అంబేద్కర్‌ను అంతర్భాగం చేసేందుకు బాంబే లెజిస్లేటివ్ కాంగ్రెస్ పార్టీ డా. అంబేద్కర్‌ను ప్రతినిధిగా ఎన్నుకొని రాజ్యాంగ సభకు పంపించింది. ఆ తరువాత అంబేద్కర్‌కు కూడా ఆశ్చర్యం కలిగించే రీతిలో ఆయనను డ్రాఫ్టింగ్ కమిటీలో సభ్యునిగా, ఆ తరువాత దానికి అధ్యక్షునిగా ఎన్నుకున్నారు.

బి.ఎన్. రావు అనే ఒక న్యాయాధికారిని రాజ్యాంగ సభకు రాజ్యాంగ సలహాదారునిగా నియమించారు. (ఒకప్పుడు బ్రిటిష్ ఐసిఎస్ అధికారిగా పనిచేసి ఆ తరువాత కలకత్తా కోర్టులో న్యాయమూర్తిగా పని చేసిన ఈయన బర్మా రాజ్యాంగాన్ని కూడా రచించాడు). డిసెంబర్, 1946 లోనే నెహ్రూ రాజ్యాంగంలో ఉండవలసిన సూత్రాలను ఒక లక్ష్య ప్రకటనగా ప్రవేశ పెట్టాడు. అదే ఆ తరువాత రాజ్యాంగపు పీఠిక అయ్యింది. విభిన్న విషయాల మీద సూచనలు చేసేందుకు ఎన్నో కమిటీలను నియమించారు. రాజ్యాంగ రచనా కమిటీ కాక మరో 12 ప్రధాన కమిటీలు నెహ్రూ, పటేల్, రాజేంద్ర ప్రసాద్, అబుల్ కలాం ఆజాద్ తదితరుల ఆధ్వర్యంలో ఏర్పడి విభిన్న విషయాల మీద సూచనలు చేశాయి. వారికి ఉన్న బలమైన పలుకుబడి, ప్రతిష్టల కారణంగా ఈ కమిటీల సిఫారసులు రాజ్యాంగ రచనా కమిటీకి దాదాపు శిరోధార్యమైనాయి. ఈ కమిటీల రిపోర్టులను, ఇతర దేశాల రాజ్యాంగాలను పరిగణనలోకి తీసుకొని బి.ఎన్. రావు రాజ్యాంగపు తొలి చిత్తు ముసాయిదా తయారు చేసి రాజ్యాంగ సభకు సమర్పించాడు. ఆ తరువాత అంబేద్కర్ ఆధ్వర్యంలోని డ్రాఫ్టింగ్ కమిటీ రాజ్యాంగపు ముసాయిదాను వివరంగా రాసి చర్చ కోసం రాజ్యాంగ సభ ముందు ప్రవేశ పెట్టింది. వివరమైన చర్చ తరువాత మొత్తం రెండు సంవత్సరాల పదకొండు నెలల పద్దెనిమిది రోజుల తరువాత రాజ్యాంగం అమలులోకి వచ్చింది.

రాజ్యాంగ సభలో పెట్టుబడిదారీ మనస్తత్వంతో ఉన్న వాళ్ళు ఉన్నారు, సంస్థానాల ప్రతినిధులైతే భూస్వామ్యానికి ప్రత్యక్ష ప్రతినిధులు. వారే కాక కాంగ్రెస్, ముస్లిం లీగ్ నుండి ఉన్న ప్రతినిధులలో ఎంతో మంది భూస్వాములో, భూస్వామ్య భావజాలంతో ఉన్నవారో ఉన్నారు. ఉదారవాద సోషలిస్టు భావాలు కలిగిన వారు కూడా ఉన్నారు. 389 సభ్యులతో కూడిన సభలో ఎక్కువ మంది అగ్రకులాల వాళ్ళు. 15 మంది మాత్రమే మహిళలు.

ఈ వివరాలను చూసినప్పుడు మనకు అర్థమయ్యేది ఏమిటంటే అసలు రాజ్యాంగ సభయే ప్రజలు ఎన్నుకున్నది కాదు. పైగా, రాజ్యాంగాన్ని మొత్తంగా అంబేద్కర్ భావాలకు ప్రతిరూపమని గానీ, అంబేద్కరే రాజ్యాంగాన్ని రాసాడని గానీ అర్థం చేసుకోవడం తప్పు. అది అంబేద్కర్ భావాల పట్ల కూడా అన్యాయమే.

**రాజ్యాంగ రచనలో అంబేద్కర్ పాత్ర - పరిమితులు; రాజ్యాంగంలోని వైరుధ్యాలు**

రాజ్యాంగ రచనా బాధ్యత లభించగానే అంబేద్కర్ ఏ 'షెడ్యూల్డ్ కులాల', ఇతర అణగారిన వర్గాల జీవనోద్ధరణకై తన జీవితాన్ని సమర్పించాడో వారికి వీలైనంత వరకు హక్కులను రాజ్యాంగంలో పొందుపరచడానికి ప్రయత్నించాడు. షెడ్యూల్ కులాల వారికి, షెడ్యూల్ తెగల వారికి రిజర్వేషన్లను పొందుపరచడంలోనైనా, అంటరానితనాన్ని, వెట్టి చాకిరిని రాజ్యాంగబద్ధంగా నిషేధించడంలోనైనా అంబేద్కర్ ది కీలక పాత్ర. ఇతర అన్ని విషయాల పట్ల ఆయన తన అభిప్రాయాలను బలంగా పొందుపరచడానికి ప్రయత్నించినా అంతిమంగా రాజ్యాంగ సభలో ఉన్న ప్రతినిధులు తమ వర్గాల ప్రయోజనాలకు అనుకూలమైన వాటినే ఆమోదించారు. అంబేద్కర్ ఎదుర్కొన్న పరిమితి ఇది. రాజ్యాంగ నిర్ణయ సభలో అంబేద్కర్ మాట్లాడుతూ 'రచనా సంఘం కొన్ని పద్ధతులకు నియమాలకు లోబడి పనిచేయాలి, వేరే గత్యంతరం లేదు', అన్నాడు. అలాగే 'సభ్యులు ఇచ్చిన సూచనలను, ఆదేశాలను రచనా సంఘం చిత్తశుద్ధితో అమలు చేసింద'ని అన్నాడు. పార్లమెంటులో ఒక విషయంపై చర్చ సందర్భంగా రాజ్యాంగంలో ఫలానా వాటిని పొందుపరిచింది మీరే కదా, రాజ్యాంగ నిర్మాత మీరే కదా అని విమర్శించినప్పుడు, 1953 సెప్టెంబరు 3న రాజ్యసభలో మాట్లాడుతూ 'నా జవాబు ఏమంటే నేను రాజ్యాంగ నిర్మాతను కాదు, నేను గుర్తింపులేని రాజకీయ నాయకుణ్ణి, నన్ను ఏవైతే చేయమని ఆదేశించారో వాటిని నా మనోభీష్టానికి వ్యతిరేకంగా చేసాను', అన్నాడు. సభ్యులు దీనిపై మరింత ప్రేరేపించగా తాను ఈ రాజ్యాంగాన్ని తగులబెడతానన్నాడు. మరోసారి రాజ్యాంగంలోని ఆర్టికల్ 31 (ప్రభుత్వం ప్రైవేటు ఆస్తిని స్వాధీనం చేసుకునే విధానం) గురించి మాట్లాడుతూ 'నాకు, రాజ్యాంగ రచన కమిటీకి ఈ ఆర్టికల్‌తో సంబంధం లేదు. దాన్ని మేము ప్రతిపాదించలేదు' అన్నాడు.

రాజ్యాంగంలో ఉన్న ప్రజా వ్యతిరేక అంశాలలో ఒకటి ఆస్తి హక్కు. తొలి రాజ్యాంగంలో ఆస్తి హక్కు ప్రాథమిక హక్కుగా ఉండింది. కాబట్టి భూ పరిమితి చట్టాలను, సంస్థానాల రద్దు వంటి చట్టాలను పార్లమెంట్ చేసినప్పుడు భూస్వాములు (కేశవానంద భారతి అనే కేరళ భూస్వామి) దానిని సుప్రీం కోర్టులో సవాలు చేస్తే కోర్టు ఆస్తి హక్కు రాజ్యాంగబద్ధమైనదే అని ఎత్తిపట్టి ఆ చట్టాన్ని కొట్టి వేసింది. ఏ సందర్భంలో, ఏ పద్ధతిలో ప్రైవేటు ఆస్తిని (ప్రైవేటు భూములను, వరిశ్రమలను) స్వాధీనం చేసుకోవచ్చో రాజ్యాంగంలోని ఆర్టికల్ 31 వివరిస్తుంది. దాని ప్రకారం న్యాయమైన లేదా సముచితమైన నష్ట పరిహారం చెల్లించాలి. నష్టపరిహారం లేకుండా ఆస్తిని ప్రభుత్వం తీసుకోవడానికి వీల్లేదని అంబేడ్కర్ అభిప్రాయపడ్డాడు. ఈవిధంగా రాజ్యాంగం ఆస్తిహక్కును పదిలంగా కాపాడుతూ రక్షణ కల్పిస్తూ వచ్చింది. 1950-70ల వరకు సుప్రీంకోర్టు ఆస్తిహక్కులో రాజ్యం జోక్యాన్ని అడ్డుకుంది. ఆస్తిహక్కును పవిత్రమైనదిగా భావించింది.

పార్లమెంట్ రాజ్యాంగ సవరణ చేయవలసి వచ్చింది. పార్లమెంట్ 1978లో చేసిన 44వ సవరణతో ఆస్తి హక్కును ప్రాథమిక హక్కుగా తొలగించి సాధారణ చట్టబద్ధమైన హక్కుగా మార్చింది.

భూస్వాముల భూములను స్వాధీనం చేసుకుంటే పరిహారం చెల్లించడం రైతుల, భూమిహీనుల కోణం నుండి చూస్తే ఎంత దుర్మార్గమైన అంశం!

కేంద్రం వద్ద ఎక్కువ అధికారాల కేంద్రీకరణను సోషలిస్టులు, కమ్యూనిస్టులు వ్యతిరేకిస్తూ రాష్ట్రాలను మునిసిపాలిటీల స్థాయికి దిగజారుస్తున్నారు అని వాదించారు. ఈ విమర్శకు అంబేడ్కర్ జవాబు చెబుతూ ఆ అధికారాలు యుద్ధ కాలంలో, ఇతర అత్యవసర పరిస్థితులలో వాడటానికి మాత్రమే అనీ, సాధారణ పరిస్థితులలో రాష్ట్రాలకు, కేంద్రానికి సమాన అధికారాలు ఉంటాయనీ సమాధానం ఇచ్చాడు. కానీ ఆచరణలో ఏం జరిగిందో, జరుగుతున్నదో చూస్తూనే ఉన్నాం.

రాజ్యాంగంలో ప్రాథమిక హక్కులను, ఆదేశిక సూత్రాలను పొందుపరిచారు. హక్కులను రాజ్యం ఉల్లంఘిస్తే కోర్టుల్లో విచారణ చేయవచ్చు, కానీ ఆదేశిక సూత్రాలను అమలు పరచకపోతే ఎవ్వరికీ జవాబుదారీతనం ఉండదు. ఈ ఏర్పాటును రాజ్యాంగ సభలో చాలా మంది వ్యతిరేకించారు. మొదట అంబేడ్కర్ కూడా ఆదేశిక సూత్రాలను విచారణ యోగ్యం చేయాలన్నాడు. కానీ ఆ తర్వాత జరిగిన చర్చలలో, బి.ఎన్.రావు తదితరుల ప్రతిపాదనలను ఒప్పుకోవాల్సి వచ్చింది. ఈ విధంగా పరిపాలనా వ్యవస్థ మౌలికంగా అనుసరించాల్సిన ఆదేశిక సూత్రాలను కోర్టు విచారణకు బయట ఉంచారు. కనీస అవసరాలను హక్కులుగా గుర్తించలేదు.

రాజ్యాంగ నిర్ణయ సభకు అంబేడ్కర్ ఒక సుదీర్ఘమైన ప్రాథమిక హక్కుల జాబితాను సమర్పించాడు. ప్రాథమిక హక్కులు, ఆదేశిక సూత్రాలు ఒకేచోట ఉండాలని ఆయన అభిప్రాయపడ్డాడు. అందుకే ఆయన సమర్పించిన జాబితాలో అల్ప సంఖ్యాక వర్గాలకు ప్రత్యేకించి షెడ్యూల్ట్ కులాలకు సంబంధించిన న్యాయమైన హక్కులు, నిబంధనలు, పదేళ్ళపాటు అమలుచేయాల్సిన ఒక సామాజిక పథకం ఉన్నాయి. అయితే ఆయన ప్రతిపాదించిన సామాజిక పథకాన్ని రాజ్యాంగంలో పొందుపరచలేమంటూ, వాటిని చట్టాలకే వదిలివేయాలంటూ రాజ్యాంగ నిర్ణయ సభ పలు సందర్భాల్లో తిరస్కరించింది.

రాజ్యాంగం విషయంలో అంబేడ్కర్ భిన్న సమయాల్లో భిన్న అభిప్రాయాలను వ్యక్తపరచి ఉన్నాడు. రాజ్యాంగంలో ఉన్న సామాజిక, రాజకీయ విషయాలకు సంబంధించిన వైరుధ్యాన్ని కొంత మేరకైనా మార్క్స్ వలెనే సరిగానే ఊహించి హెచ్చరించాడు.

"జనవరి, 26, 1950న మనం వైరుధ్యాల్లోకి ప్రవేశిస్తున్నాం. రాజకీయ రంగంలో సమానత్వం ఉన్నప్పటికీ సామాజిక, ఆర్థిక రంగంలో అసమానతలు కొనసాగుతూ ఉన్నాయి. రాజకీయాల్లో ప్రతి ఒక్కరికి ఓటు హక్కు ఉంది. ఒక విలువగా గుర్తించ బడింది. ప్రస్తుత ఆర్థిక నిర్మాణం కారణంగా సామాజిక, ఆర్థిక రంగంలో ఈ విలువ గుర్తించబడలేదు. ఈ వైరుధ్యాన్ని మనం ఎంత కాలం కొనసాగించగలం? సామాజిక, ఆర్థిక జీవితంలో సమానత్వం లేకుండా ఎంతకాలం ఉండగలం? ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే రాజకీయ ప్రజాస్వామ్యం ప్రమాదంలో పడుతుంది. ఎంత తొందరగా ఈ వైరుధ్యాన్ని రూపుమాపగలిగితే అంత మంచిది. అలా కాకపోతే అసమానత్వంతో బాధపడుతున్న వారు ఏ ప్రజాస్వామ్యాన్ని రాజ్యాంగ సభ రూపొందించిందో దాన్ని బద్దలు కొడతారు", అని రాజ్యాంగ సభ ముగింపు సమావేశంలో మాట్లాడాడు.

ఈ హెచ్చరిక ఉన్నప్పటికీ తాను పేర్కొన్న వైరుధ్యాలను పరిష్కరించగలిగే మార్గాన్ని ఆయనకున్న ప్రాపంచిక దృక్పథం కారణంగా చెప్పలేకపోయాడు.

రాజ్యాంగాన్ని అమలు పరచడంలో రాజ్య యంత్రాంగం నిర్వహించే పాత్రను, దాని నిజ స్వరూపాన్ని అంబేడ్కర్ పూర్తిగా అంచనా వేయలేకపోయాడు. అంబేడ్కర్‌కు ఉన్న ప్రాగ్మాటిస్ట్ (ఆచరణవాద) దృక్పథమే, ఫేబియన్ సోషలిస్ట్ ఉదారవాద దృక్పథమే ఇందుకు కారణం. ఒక వేళ సరియైన అంచనా ఉండి ఉంటే రాజ్యాంగ సభ చివరి సమావేశంలో చేసిన ప్రసంగంలో 'ఇప్పుడు రాజ్యాంగం అమలు లోకి వచ్చింది కాబట్టి ఇక తమ హక్కుల సాధన కోసం రాజ్యాంగబద్ధంగా, చట్టబద్ధంగా మాత్రమే ప్రయత్నించాలి తప్పితే సత్యాగ్రహంతో సహా ఎటువంటి ఆందోళనలు చేయకూడద'ని చెప్పేవాడు కాదు. అటువంటి ఆందోళనలంటే అది అరాచకత్వమే అన్నాడు.

"నా ఉద్దేశం ప్రకారం మనం చేయవలసిన మొదటి విషయం ఏమిటంటే, మన సామాజిక, ఆర్థిక లక్ష్యాలను సాధించడానికి బలంగా రాజ్యాంగ పద్ధతులకు కట్టుబడి ఉండటం. రక్తపాతంతో కూడిన విప్లవ పద్ధతులను మనం వదిలివేయాలి. అంటే మనం శాసనోల్లంఘన, సహాయ నిరాకరణ, సత్యాగ్రహ పద్ధతులను కూడా విడనాడాలి. ఆర్థిక, సామాజిక లక్ష్యాలను సాధించడానికి రాజ్యాంగ పద్ధతులకు మార్గం లేనప్పుడు, రాజ్యాంగేతర పద్ధతులను అనుసరించినా అది సమర్థనీయం అవుతుంది. కానీ రాజ్యాంగ పద్ధతులు అందుబాటులో ఉన్నచోట, ఈ రాజ్యాంగేతర పద్ధతులు ఏ విధంగానూ సమర్థనీయం కాదు.

ఈ పద్ధతులు అరాచకమైనవి తప్ప మరేమీ కాదు మరియు వాటిని ఎంత త్వరగా వదిలివేస్తే అంత మంచిది".

**రాజ్యాంగంపై అంబేద్కర్‌కు ఉన్న భరోసా!**

అయితే అదే ఉపన్యాసంలో సమానత్వాన్ని సాధించకపోతే 'అసమానత్వంతో బాధపడుతున్న వారు ఏ ప్రజాస్వామ్యాన్ని రాజ్యాంగ సభ రూపొందించిందో దాన్ని బద్దలు కొడతారు' అనే హెచ్చరిక కూడా చేసాడు.

విప్లవాలు జరిగిన చోట రాజ్య యంత్రాంగాలను కూడా గణనీయమైనస్థాయిలో మార్చివేసారు. కానీ మన దేశంలో బ్రిటిష్ వారితో కుదిరిన రాజీతో మనకు 'స్వాతంత్ర్యం' వచ్చింది కాబట్టి, బ్రిటిష్ కాలంలో ఉన్న రాజ్య యంత్రాంగ వ్యవస్థ, అధికార వ్యవస్థ అంతా దాదాపు యధావిధిగా కొనసాగింది. పోలీసు యంత్రాంగం, సైనిక యంత్రాంగం, గ్రామ కరణాల వ్యవస్థ, కలెక్టర్లతో సహా రెవెన్యూ యంత్రాంగం, న్యాయ వ్యవస్థ - ఇవేవీ మారలేదు. బ్రిటిష్ పాలకులకు అంతే విధేయంగా సేవ చేశారు, పాలన మారిన తరువాత కొత్త పాలకులైన దళారీ పెట్టుబడిదారులకు, భూస్వామ్య వర్గానికి అంతే విధేయంగా సేవ చేస్తున్నారు. ఈ అధికార యంత్రాంగమే పెసా చట్టాన్ని, రాజ్యాంగంలోని 5వ, 6వ షెడ్యూల్‌లను, దళితుల హక్కుల చట్టాలను, ఇంకా ఎన్నో ప్రగతిశీల ప్రజానుకూల చట్టాలను ఎట్లా అమలు చేస్తున్నాయో చూస్తూనే ఉన్నాం. అటువంటి రాజ్య యంత్రాంగం నిర్వహించే అభివృద్ధి నిరోధక పాత్ర గురించి అంబేద్కర్ ప్రజలను చైతన్య పరచలేదు. ఆ పాత రాజ్య యంత్రాంగాన్ని ధ్వంసం చేయకుండా పీడిత ప్రజలకు, శ్రామిక ప్రజలకు, పీడిత కులాలకు (పీడిత కులాల నుండి పాలకవర్గాల సరసన/పంచన చేరే పిడికెడు మంది తప్ప) లభించేది ఏమీ ఉండదు.

రాజ్యాంగాన్ని మొత్తంగా అంబేద్కర్‌కు ఆపాదిస్తే దానిలోని పాజిటివ్ అంశాలకు మాత్రమే కాదు ప్రజల హక్కులను హరించి వేసే అంశాలన్నింటికీ కూడా ఆయననే బాధ్యుడిని చేయ వలసి వస్తుంది. ఇది అంబేద్కర్‌కు ఏ విధంగా న్యాయం చేసినట్టు అవుతుంది? కాబట్టి అంబేద్కర్‌తో సహా ప్రజాస్వామిక భావాలు గల ఇతర రాజ్యాంగ సభ సభ్యులు పీడితకులాలకు, వర్గాలకు, స్త్రీలకు సంబంధించిన ఏయే హక్కులను నిర్దిష్టంగా పొందుపరిచారో వాటిని మాత్రమే మనం స్వీకరించి, శ్రామిక ప్రజల ప్రయోజనాలకు భంగకరమైన అంశాలను వ్యతిరేకించవలసి ఉంటుంది. అలా చేసినప్పుడే అది నిజంగా అంబేద్కర్‌ను గౌరవించినట్టు అవుతుంది. అంతే కాదు, అంబేద్కర్ తన ఉదారవాద రాజకీయ దృక్పథం వల్ల రాజ్యంపై, రాజ్యాంగం పై విశ్వాసంతో స్వయంగా కొన్ని మనకు ఆమోదయోగ్యం కాని అంశాలను ప్రవేశ పెట్టాడు. వాటి పట్ల మన విమర్శనాత్మక దృక్పథాన్ని చేపట్టకపోవడం కూడా సరియైనది కాదు.

రాజ్యాంగంలోని కొన్ని అంశాలను వ్యతిరేకిస్తూ లోక్ సభ సభ్యులు అంబేద్కర్‌ను ఇవి మీరు చేర్చిన అంశాలే కదా అని విమర్శించినప్పుడు 'రాజ్యాంగ రచనలో నేను నిమిత్తమాత్రుణ్ణి' అని స్వయంగా అంబేద్కర్ అన్న మాటలను కూడా మరిచిపోకూడదు. హిందూ కోడ్ బిల్లు వంటి ఒక్క అంశాన్ని అంగీకరించక అంబేద్కర్ రాజీనామా చేయాల్సిన పరిస్థితిని కల్పించిన పార్లమెంట్ - అంటే ఈ దేశ పాలకవర్గాలు - దేశ రాజ్యాంగాన్ని ఎలా ఎందుకు ఆమోదించారనే కనీస ప్రశ్ననైనా వేసుకోవాలి కదా. వారి ప్రయోజనాలకు మౌలికంగా పూర్తిగా అనుకూలమైనది కాబట్టే అంగీకరించారు, ఆమోదించారు. అంబేద్కర్ రాజ్యాంగ రచయిత కాబట్టి రాజ్యాంగాన్ని నెత్తికెత్తుకుందాం అనుకునే వైఖరి పాలకవర్గ ప్రయోజనాలను నెరవేర్చే వైఖరి మాత్రమే అని మనం గ్రహించాలి. నూతన ప్రజాస్వామిక రాజ్య స్థాపన కొరకు కార్మికులు, రైతాంగం, దళితులు, ఆదివాసీలు, మైనారిటీలు ఇతర పీడితులు పోరాడకుండా వారు ఈ రాజ్యంలోనే, ఈ వ్యవస్థలోనే దారులు వెతికే భ్రమలను నెలకొల్పేందుకే రాజ్యాంగవాదం ఉపయోగపడుతుంది. ఈ రాజ్యం కుహనా దేశభక్తిని ఎట్లాగైతే ఉపయోగించుకుంటుందో రాజ్యాంగవాదాన్ని కూడా అట్లాగే ఉపయోగించుకుంటుందని గ్రహించాలి. పార్లమెంటరీ పంథాకు ప్రజలను కట్టివేసి, వారిలో మిలిటెంట్‌గా పోరాడే చైతన్యాన్ని, చేవను చంపివేస్తుందని గ్రహించాలి.

అంబేద్కర్ 'స్టేట్ అండ్ మైనారిటీస్'లో వ్యవసాయ భూమిని, కీలక పరిశ్రమలను రాజ్యం తన స్వాధీనంలో ఉంచుకొని ప్రజల అవసరాలను తీర్చాలనీ, ఉత్పత్తి వనరులపై రాజ్యం అజమాయిషీ ఉండాలనీ, ఉత్పత్తి అయిన వాటిని కులభేదాలు తదితర తేడాలు లేకుండా అందరికీ సమంగా పంపిణీ చేయాలనీ ప్రతిపాదించాడు. వీటితో పాటు ఆర్థిక రంగంపై ప్రభుత్వ నియంత్రణ ఉండాలన్నాడు. ప్రైవేటు పరిశ్రమలను ప్రోత్సహించాలన్నాడు.

అంబేద్కర్ ప్రతిపాదించిన ఈ తరహా 'స్టేట్ సోషలిజం' మార్క్సిస్టులు చెప్పే సోషలిస్టు సిద్ధాంతానికి భిన్నమైంది. అయినా తాను ప్రతిపాదించిన లక్ష్యాలనైనా ఎట్లా చేరుకోవాలనే దానిపై ఆయనకు స్పష్టత లేదు. రాజ్యం మీద ఆధారపడి, పార్లమెంటరీ ప్రజాస్వామ్య చట్రంలోనే సామాజిక మార్పు సాధ్యమని ఆయన ప్రగాఢంగా విశ్వసించాడు. నామ మాత్రపు భూ సంస్కరణ చట్టాలను కూడా అమలు చేయని రాజ్యం ఆయన ప్రతిపాదించిన పథకాన్ని అమలు చేస్తాయా? ఇది ఈ దోపిడీ రాజ్యం పై ఉన్న భ్రమయే కదా? ఎంత సదుద్దేశ్యంతోనైనా లక్ష్యం ప్రకటించినంతన మాత్రాన మార్పు సాధ్యం కాదు కదా! లక్ష్య సాధనకు అవలంబించాల్సిన మార్గం ఏమిటి?

అందుకే మనం రాజ్యాంగ రచనలో అంబేద్కర్‌కు ఉన్న పరిమితులను గ్రహించాలి. ఆయన, అతనితో పాటు ఇతర ప్రగతిశీల శక్తులు పొందుపరిచిన హక్కులను ప్రజల ప్రయోజనాలకై వినియోగించుకుంటూనే, రాజ్యాంగం పేరుతో ప్రజల పోరాట పటిమను మొద్దుబార్చి, వారిని, మరీ ముఖ్యంగా దళితులను, ఆదివాసీలను, బహుజనులను, మైనారిటీలను పార్లమెంటరీ పంథాకే కట్టి పడేసే రాజ్యాంగవాదాన్ని తిరస్కరించాలి. అందుకే దళిత-బహుజన రాజ్యాంగవాదానికి ఉన్న పరిమితులను గ్రహించాలి.

**దళిత-బహుజన రాజ్యాంగవాదం:**

దళితుల హక్కుల కోసం అంబేద్కర్ నాయకత్వంలో జరిగిన పోరాటాల వల్ల, అంబేద్కర్ ఇచ్చిన స్ఫూర్తి వల్ల, ఆయన బోధనల

**(మిగతా 37వ పేజీలో...)**

పుస్తక పరిచయం

# కవిత్వంగా మారిన విప్లవోద్యమ భావోద్వేగాలు

- కె. నాగేశ్వరాచారి

ఇక్బాల్ ఆరవ కవితా సంకలనం 'కళచెదరని స్వప్నం'. ఆయన దాదాపు నలభై సంవత్సరాల నుంచి కవిత్వం రాస్తూనే వున్నారు. 'కఫన్' అనే కథా సంకలనం కూడా వేశారు. పాలమూరు జిల్లా నుంచి రాస్తూవున్న ఉదయమిత్ర, నారాయణ (కథకుడు) ఇక్బాల్ ఉదయ్, రేడియమ్, కర్నకోట రవీంద్రనాథ్ కవితా సంకలనాలు వెలువడతూనే వున్నాయి.

ఇక్బాల్ కవితలు అన్నీ ఒక్కచోట చేర్చి చూస్తే ఆయన అవగాహనలో వస్తున్న మార్పులు కవితా నిర్మాణంలో వస్తున్న మార్పులు సమగ్రంగా అధ్యయనం చేయవచ్చును. 2022 నవంబర్‌లో వెలువడిన కళచెదరని స్వప్నం కవితా సంకలనంలో నూట ముప్పై కవితలున్నాయి. అందులో పదహారు ఉర్దూ కవితలున్నాయి. కొన్ని పాటలు కూడా వున్నాయి. ఈ కవితలు 2020 నుంచి 2022 ఫిబ్రవరి మధ్యకాలంలో రాసినవే. దేశంలో జరిగిన పరిణామాలకు కవి స్పందన ఈ కవితల్లో చూడగలం.

దాదాపు నూట పద్నాలుగు తెలుగు కవితల్లో ఇక్బాల్ రాజకీయ తాత్వికతను గమనించవచ్చును. సంఘటనలకు స్పందించిన కవితలు కూడా వున్నాయి. స్థానికత నుంచి విశ్వజనీనత వరకు విస్తరించిన కవితలు వున్నాయి. అణచివేత, ప్రతిఘటన, మారుతున్న ఉద్యమ స్వరూపాలు, నాయకత్వాల విద్రోహాలు అన్నిటిని వివరించిన కవితలున్నాయి. విప్లవ కవిత్వమంటే ఉద్యమ పురోగతినే కాదు వక్రగతులను కూడా ఆత్మవిమర్శలో భాగంగా చిత్రించిన కవితలున్నాయి.

కవులు ఎన్నుకోబడని ప్రతిపక్ష నాయకులని ఇంగ్లీషు విమర్శకులన్నారు. ప్రాచీన తెలుగు అలంకారికులు రసస్పృష్టివల్ల పాఠకునిలో హృదయసంస్కారాన్ని కలుగజేస్తుందన్నారు. వీరు ప్రజా పంథాను సాహిత్యంలో అనుసరించలేదు. నక్సల్‌బరీ తరువాత సాహిత్య స్వభావంలోనే గొప్ప మార్పువచ్చింది. ఇక్బాల్ 'కవి ఏంచేస్తడు' అన్న కవితలో మారిన సాహిత్య స్వభావాన్ని వివరిస్తారు.

"కన్నీటి వూటల్ని
కడుపిప్పి మండించి
గ్రహణాల గతులిప్పి
గ్రనేడ్లు పూయిస్తాడు...

కవి ఏంజేస్తడు
బతుకు బాధల్ని
బాకు జేసిస్తడు...

కాడెడ్లు రంకేసి
బంజర్లు బరిగీసె
సేద్యపు యుద్ధంల




సీతుల్ల కొమ్మైతడు

సుస్తెక్కి మస్తెక్కి
రివిజనిస్టు గత్తర్లు
వొళ్ళంత కమ్మేస్తే
కలమై కుమ్మేస్తడు

రైతన్న ఊపిరి
పొత్తమైన కల్లాన్ని
దిగమింగు తోడేళ్ళ
గుండెల్ల బాకైతడు...

పొడిసే పొద్దుకు కాపలా
కాస్కొని వుంటడు

కవి బాధ్యతల్ని గుర్తుచేస్తూ కవి సందేశం ఏయే వర్గాలకు అందాలో, ఉద్యమాల్ని నీరుగార్చే శక్తులను ఏంచేస్తాడో కవి

వివరిస్తాడు. అతి సాధారణమైన భాషలో రాసిన ఈ కవితను ప్రజా పంథాను ఆమోదించిన వాళ్ళు తప్ప మరొకరు రాయలేరు. ఈ కవితలో మరో పాదంలో "దుడకల్ని దుడ్డెల్ని సోయిచ్చి కత్తుల యిత్తుల సాలేస్తడు" కవి అని అంటారు. కవి ఎవరిలో కదలికలు రావాలో సూచిస్తాడు. ఈ ఒక్క కవితను దృష్టిలో వుంచుకుని ఈ మొత్తం కవితల్లో ఇందులో సూచించిన కవి కర్తవ్యాన్ని విస్తరించి చూపిస్తాడు. సమాజంలో అణచివేతవున్న ప్రతి చోటుకు కవిత వెళుతుంది.

కళ చెదరని స్వప్నం అనే కవితలో

కనుమూసినా...
ముఖమంతా పురివిప్పిన
కళచెదరని స్వప్నం

జడుసుకోడా మరివాడు...
పేజి పేజికి
త్యాగపు వన్నెలద్దిన
నా సాయుధ వెన్నెల నవ్వుల
కన్నుల జూసి
గుండెలాగి నీలిగి సస్తడు" ఈ కవితను చదువుతున్నపుడు కౌముది చనుబాల ధార కవిత్వం గుర్తుకొస్తుంది. కౌముది కఠోరమైన, అతితేలికగా కొరుకుడు పడని అంశాన్ని సునాయాసంగా పాఠకుడికి అందిస్తారు. "చావుదేముంది, బ్రతకటం శాశ్వతమైతే కదా" అంటారు కౌముది. ఇక్బాల్ ఏ కవి నుంచి స్ఫూర్తి పొందుతున్నారో అనుమానించనవసరం లేదు. సాయుధమైన వెన్నెల నవ్వులు చూసి శత్రువు గుండెలాగి చనిపోవడమేమిటి? వెన్నెల నవ్వులు కూడా సాయుధమైనాయి. రెవెల్యూషనరీ రొమాంటిసిజమ్ అంటే ఇదేనేమో!

అణచివేత, మలిదశ తెలంగాణ ఉద్యమం వల్ల చాలా మంది ప్రభుత్వ పదవులాశించి ఉద్యమంలో పనిచేసినవారు ఉద్యమాలకు దూరమవడమే కాదు విద్రోహులుగా మారటం చూస్తున్నాం. ఈ స్థితి కవికి అసహ్యం కలిగించింది. అలాంటి వారిని గద్దించి అడుగుతాడు "బావుకోవడమో/ దండు కోవడమో కొరడాలు ఝుళిపించే పీఠాలనెక్కడమో/ ఇదేనా మన లక్ష్యం/ మనకిదేనా గమ్యం/ నియంతల కూల్చడం కదా మన ధ్యేయం" అని "మెడమీది కాడిని ఇసిరిపారేసి/ హిందుత్వ బ్రాహ్మణీయ/ అహంభావమావరించి... అస్తిత్వ అవతారాలయిరి" అని నిరసిస్తాడు. అక్కడితో ఆగకుండా అదే కవితో 'ఆలోచించుకుందాం/ ఆచరణల్ని రాటుదేల్చుకుందాం/... కన్నీళ్ళ నుండి/ నెత్తుటిత్యాగాలనుండి గుణపాఠాలు నేర్చుకుందాం/ గురి తప్పని ఆచరణతో పురివిప్పుదాం" అంటూ ఆత్మవిమర్శ దిశగా కవితను నడిపిస్తాడు.

ఉద్యమం గెలుపు ఓటములతో ముందుకు సాగుతూ అంతిమంగా విజయం సాధిస్తుందని ఉద్యమాల్ని చూసే వాళ్ళకు కొత్త విషయం కాదు. ఓటమి వేళలో నిలదొక్కుకుని శాస్త్రీయమైన భవిష్యత్తుపై ఆశతో ఎదురుచూడాల్సిన సందర్భం ఒకటొస్తుంది. అటువంటి సందర్భంలో ఉద్యమాల్ని అభిమానించేవారి గురించి

ఎవరైనా సరే
తిరిగి వస్తానంటే, తిరిగి లేస్తానంటే
శోకాలై దిగాలుపడి
దిక్కులు సూటేడమా....

కూలిన స్వప్నాల్లోంచి
కనుమూయని శ్వాసకు
రాలిన పువ్వుల్లోంచి
రాజీపడని నవ్వుల్నీ ఎత్తిపట్టాలి, ఎలుగెత్తి చాటాల"ని కవి స్వప్నిస్తాడు. మార్దవమైన భాషలో శాస్త్రీయ అవగాహనతో భవిష్యత్తును కలగంటాడు. ఇంకా ఇదే కవితలో కొనసాగుతున్న ఉద్యమాన్ని గురించి "ఆ పతాకాన్ని అందిపుచ్చుకోవడం కదా
నేలేసొస్తున్నానంటే
ఆ తెగువను ఆలింగనం చేసుకోవడం కదా
నే తప్పక వొస్తున్నానంటే...!! ఉద్యమంలో అమరులైన వారి స్మృతిలో రాసుకున్న ఉద్యమం కొనసాగుతుందని ధృతితో ఇక్బాల్ కలగంటారు. నీ కార్యాచరణ ఎలావుందో నీ శత్రువే చెబుతాడన్నట్లు ఉద్యమాన్ని ఎంతటి తీవ్రతతో అణచివేస్తున్నాడో శత్రువు చర్యల్ని గమనించవచ్చు. వచ్చే ఎన్నికల నాటికి రూపుమాపుతానని ప్రభుత్వం ప్రకటించింది. ఉద్యమానికి సమాధానం చెబుతానంది. కాని ఇక్బాల్ ప్రతి సమాధానం "మోదుగు వనం నుంచి తంగేడు పూల తోపుదాకా" అన్న కవితలో "చలనం/ ఎప్పుడు మొదలయ్యిందో/ ఈ భూమ్మీద ప్రాణిది/ అది నడకై/ ఎలా వికసించిందో/ ఈ నేలమీద జీవిది" అని ప్రారంభించి "తడియారని సంతకమైన/ చరిత భవితగా కదా/ విప్పారింది త్యాగాల వనమై" అని కొనసాగిస్తారు. ఎంతటి అణచివేతనైనా, నిర్బంధాన్నైనా ఉద్యమం ఎదిరించి గెలుస్తుందన్న విశ్వాసం నింపుకున్న కవి. "రాబందు రాజ్యపు/ సమాధాన నవాల్ను/ ముచ్చెమట పట్టించె/ విల్లంబులు బుడతదా"నని ఉద్యమం దృఢ సంకల్పాన్ని తెలియజేస్తుందీ కవిత.

ఇక్బాల్ ఎక్కడ మాట్లాడినా ఏది రాసినా సాధికారికంగా వుంటుంది. భావావేశ వ్యక్తీకరణ వుండదు. దృఢ దీక్షా సంకల్పమే అందులో కనిపిస్తుంది. ఇందులోంచే అణచివేతపై ధిక్కారం పుడుతుంది. విప్లవకారుడెటువంటివాడో వివరిస్తూ ధిక్కారాన్ని ప్రకటించే 'అలల హోరుకు సంకెళ్ళేస్తావా' అన్న కవిత చక్కని ఉదాహరణ. ఉద్యమకారులు "చిమ్మచీకట్లను ఆలింగనం చేసుకున్నోళ్ళు .....దుఃఖసాగరాల కనుకొలుకుల్లో కాంతిరేఖలై పునర్జీవించినోళ్ళు" ఇంతేనా? ఇంకా "ఆకలిపేగుల మన్యానికి సైనిక కవాతునేర్పినోళ్ళు'' ఇటువంటి వారు నిర్బంధానికి జడుసుకుంటారా? అందుకే "పోటెత్తే సముద్రాన్ని/ అన్లాఫుల్ ఆక్టివిటీ కింద/ అదుపుకు చట్టం తెస్తావా? అలల హోరుకు సంకెళ్ళేస్తావా?" అనే ప్రశ్న విశ్వాసంతోడి ధిక్కారమే!

కవితా శీర్షిక కవితాత్మకమే అయినా వాచ్యంగా కనిపిస్తుంది. కవి చెప్పదలచుకున్న విషయం అట్టే తేలిపోతుంది. అభివ్యక్తి పలచబడి పోయిందనుకోవచ్చును. ముద్రణా సౌకర్యం వల్ల శీర్షిక చివర ఆశ్చర్యార్థకం, ప్రశ్నార్థకం రెండు గుర్తులున్నాయి. పాఠకుడు సంకెళ్ళు పడతాయా? పడవా! అన్న సందిగ్ధంతో కవితలోకి వెళితే ఉద్యమకారుడు సంకెళ్లను ఛేదిస్తాడనే విశ్వాసం పాఠకునిలో కలుగుతుంది. వచనమై తేలిపోగల కవితలు ఇందులో లేవు. దాదాపు నలభై సంవత్సరాల అభ్యాసం కదా!

ఇంకొక్క కవితను చూద్దాం. "ఎదనిండ పోరుగాథలు పొదిగిన త్యాగాల ఖిల్లా" ఈ సంకలనంలో గుర్తించదగిన కవిత. వ్యక్తిపూజ, ఆరాధన పెరిగిపోతున్న నేటి కాలంలో జనబాహుళ్యంలో వుండేవారికి ఈ కవిత ఓ కనువిప్పు.

ఒక విప్లవ నాయకుడనేవాడట, విప్లవకారుడు రాసుకునే సందర్భంలో పెన్నులో ఇంక్ అయిపోతే ఇంక్ పోసిచ్చిన వారు కూడా విప్లవోద్యమంలో భాగస్వాములుగా గుర్తించాలని. ఒక వ్యక్తి ఒక ఉన్నత స్థానంలో, నాయకత్వ స్థానంలోకి చేరుకోవడానికి ఎంతమంది భాగస్వాములవుతారో, ఎంతమంది ప్రమేయం వుంటుందో గమనించాలి. ఈ కవితలో ఒక వ్యక్తి ఎదగడానికి ఎంతమంది తోడ్పాటువుంటుందో ఇక్బాల్ వివరించారు. కులం, మతం, జెండర్, వర్గం గ్రామీణ జీవితంలో ఎలా కలగలిసి వుంటాయో పాఠకునికి తెలుస్తుంది ఈ కవిత ద్వారా!

విప్లవోద్యమం అతివాద బాలారిష్టానికి గురిఅయిందని అనేవారు ఇప్పటికీ ఉన్నారు. ఆ సందర్భమేమిటో గాని, ఇక్బాల్ వాస్తవ జీవితం నుంచే వర్తమాన విప్లవోద్యమ ప్రజాపంథాను తన కవిత్వంలో చిత్రించారు. ఇదీ ఇక్బాల్ ప్రత్యేకత. పాలమూరు నుండి జాతీయ స్థాయివరకు జరుగుతున్న పరిణామాలపై ప్రజల పక్షాన కవితా స్పందన ఈ సంపుటి.

ఈ కవితలు తెలంగాణ మాండలిక పదాలు ఉర్దూ పదాలతో జమిలిగా నడుస్తాయి. అప్రయత్నంగా ఆ పదాలు కవితల్లోకి చొరబడతాయి. విప్లవోద్యమ మహోద్ధృత వ్యక్తీకరణలు ఈ కవితలు. ఇక్బాల్ కవితా ప్రపంచంలో ఎవరికి నచ్చినవి వారెన్నుకోవచ్చు.



---

**(34వ పేజీ తరువాయి)**

కారణంగా, రాజ్యాంగంలో అంబేడ్కర్ రూపొందించిన రిజర్వేషన్ల వల్ల ఎంతో మంది దళితులు విద్యను, ఉద్యోగాలను పొందారు. ఆత్మ గౌరవంతో తలెత్తుకుని నిలబడ్డారు. వేలాది సంవత్సరాలుగా దేనికైతే దూరమయ్యారో ఆ విద్యను, ఇతర హక్కులను పొందగలిగారు. సామాజికంగా స్థితి ఎంతో మెరుగుపడింది. రాజ్యాంగంలోనే కొన్ని హక్కులను రూపొందించడం దీనికి దోహదపడింది. ఈ హక్కుల ద్వారా పొందిన చైతన్యంతో, ఇతర ప్రజాస్వామిక ఉద్యమాలు, విప్లవోద్యమాల వల్ల కలిగిన చైతన్యంతో చేసిన పోరాటాల వల్ల మరిన్ని హక్కులను వివిధ చట్టాల ద్వారా దళిత బహుజనులు పొందారు.

రాజ్యాంగం ద్వారా వచ్చిన ఓటు హక్కు, తద్వారా వచ్చిన రాజకీయ హక్కుతో పార్లమెంటరీ అధికారంలో పాలుపంచుకోవచ్చు అనే ఒక ఎరుక కూడా పెరిగింది. ఎనభైలు, తొంభైల నాటికి వచ్చేసరికి గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో, భూ సంబంధాలలో వచ్చిన మార్పుల వల్ల శూద్ర కులాలలోని రైతాంగ కులాలు భూమిని పొందగలిగారు. చాలా చోట్ల వారు మధ్య తరగతి రైతులుగా, ధనిక రైతులుగా, కొన్ని చోట్ల భూస్వాములుగా కూడా ఎదగగలిగారు. అదే సమయంలో దళిత కులాల నుండి కూడా పట్టణ మధ్య తరగతి, విద్యావంతులైన బుద్ధి జీవి వర్గం, బ్యూరాక్రటిక్ వర్గం పెరిగాయి. ఎన్నో చోట్ల రాష్ట్రాలలో రాజకీయ అధికారం కూడా క్రమంగా అంతకు ముందు అగ్రకులాల చేతిలో మాత్రమే ఉన్నది వెనకబడిన కులాల చేతిలోకి కూడా మారసాగింది. దళిత పార్లమెంటరీ నాయకుల సంఖ్య కూడా పెరిగింది. 'ఓట్లు మావి, సీట్లు మీవా' అనే నినాదంతో దళితులు ముఖ్యంగా కాన్షీరాం నాయకత్వంలోని బిఎస్‌పి ముందుకు వచ్చాక అంబేడ్కర్, పూలేలు దేశవ్యాప్తంగా దళిత-బహుజనులకు ఆత్మ గౌరవ ప్రతీకలుగా మారిపోయారు. దీనితో పాటే దళిత-బహుజన రాజ్యాంగవాదం, అస్తిత్వవాదాలు కూడా బలపడుతూ వచ్చాయి. దళిత బహుజనులు ఎన్నో పోరాటాలు చేస్తున్నా ఆ పోరాటాలను పైన పేర్కొన్న ఎదుగుతున్న మధ్యతరగతి వర్గాలకు, ధనిక వర్గాలకు చెందిన నాయకత్వం పార్లమెంటరీ అధికారం ద్వారా నిజమైన రాజ్యాధికారం దళిత-బహుజనులకు వస్తుందనే భ్రమను వ్యాపింప జేస్తున్నారు. రాజ్యాంగం మీద విశ్వాసం ప్రకటించడం, రాజ్యాంగ బద్ధంగా పోరాడటం అనే పరిమితులకు లోబడి చైతన్యాన్ని పెంచే ప్రయత్నం చేస్తున్నారు. రాజ్య స్వభావాన్ని అంచనా వేయడంలో విఫలమౌతున్నారు. ఈ భ్రమలు పాలకవర్గంలో చేరడానికి ధనిక వర్గంగా ఎదిగిన బహుజన-దళితులలోని ఒక సెక్షన్‌కు ఉపయోగపడుతాయి కానీ దళిత-బహుజనులలోని మెజారిటీ శ్రామికులకు మాత్రం కాదు. కాబట్టి ఈ తరహా రాజ్యాంగవాదాన్ని కూడా నిర్ద్వంద్వంగా తిరస్కరిస్తేనే దళిత-బహుజన శ్రామికులు తమ నిజమైన విముక్తికై పోరాడగలరు.

'రాజ్యాంగం మంచిదే కానీ, రాజ్యాంగాన్ని అమలు పరిచే వాళ్ళే బాగా లేరు' అనే వాదనను అంగీకరిస్తే అప్పుడు రాజ్యాంగ అమలు కోసం పోరాడాలి. కానీ రాజ్యాంగానికీ, ఉత్పత్తి వ్యవస్థకూ సంబంధం ఉందని అర్థం చేసుకోవాలి. ఉత్పత్తి వ్యవస్థకు అనుగుణంగా ఉత్పత్తి సాధనాల యాజమానుల ప్రయోజనాలను కాపాడటానికే ప్రాథమికంగా రాజ్యం, రాజ్యాంగం ఉన్నాయని గుర్తించాలి. అప్పుడు ఉత్పత్తి వ్యవస్థను మార్చడానికి ప్రయత్నిస్తాం. చట్టం, రాజ్యాంగాన్ని బట్టి సమాజ నిర్మాణం కాలేదు. సమాజ నిర్మాణం, ఉత్పాదనా వ్యవస్థలను బట్టి వాటికి అనుగుణమైన చట్టాలు, రాజ్యాంగం వచ్చాయి. అందుకే రాజ్యాంగంలో ఏవైనా చెడు విషయాలు ఉంటే వాటిని మార్చుకుందాం అనుకుంటే అది సాధ్యం కాదు. మార్చిన వాటిని అమలు చేయడం అసలే సాధ్యం కాదు. ఉత్పత్తి వ్యవస్థలో చేసే మార్పులతోనే మౌలిక మార్పులు సాధ్యం. రాజ్యానికీ, రాజ్యాంగానికీ, ఉత్పత్తి వ్యవస్థకు ఉన్న ఈ అవినాభావ సంబంధాన్ని గ్రహించి ఈ దోపిడీ ఉత్పత్తి వ్యవస్థను, దోపిడీ రాజ్యాన్ని, రాజ్యాంగాన్ని కూలదోసి దాని స్థానంలో నూతన ప్రజాస్వామిక రాజ్యాన్ని స్థాపించేందుకు, శ్రామిక రాజ్యాన్ని, రాజ్యాంగాన్ని నెలకొల్పుకునేందుకు దళిత, ఆదివాసీ బహుజనులు, మైనారిటీలలోని శ్రామికులతో సహా శ్రామిక ప్రజలందరూ పూనుకోవాలి.

(4,5 జూన్ 2022లో మిర్యాలగూడలో జరిగిన విరసం వర్క్‌షాప్ ప్రసంగ పాఠం)






# అనువాద కవితలు

అనువాదం: ఉదయమిత్ర

**మహమూద్ దర్వీష్ కవితలు రెండు**

## పాస్‌పోర్ట్

మర్యాదస్తులారా.. ప్రవక్తలారా
నన్ను మాటిమాటికి
ఉదహరించొద్దు

ఆ చెట్ల పేర్లను అడగొద్దు
ఆ లోయల తల్లి ఏదని అడగొద్దు
నా నుదుటి నుండి
పచ్చిక బయళ్లు పుట్టుకొస్తాయి
నా చేతుల నుండి
నదులు ఉప్పొంగుతాయి

నా సమస్త ప్రజల
హృదయాంతరంగాల్లోనే
నా గుర్తింపు దాగి ఉంది

ఇంకెందుకు
ఈ పాస్ పోర్ట్
తీసుకుపోండి..

## నేను అక్కడి నుంచి వచ్చా

తిరిగొచ్చే మేఘానికి
నా అస్తిత్వాన్ని చెప్పడానికి
నేనెప్పుడూ దుఃఖిస్తా

రాజ్యాన్ని ఎదిరించడానికి
నా రక్తాన్ని ధారబోసైనా సరే
అనేక పదాల్ని పోగు చేసుకుంటా..

ఒక్కో పదాన్ని విరిచేసి
ఒకే ఒక్క పదం
భద్రపరుచుకుంటా..

ఆ పదమే

పాలస్తీనా..

**రానా అయూబ్ కవిత**

## అలా మొదలైంది

అదంతా
గ్యాస్ చాంబర్లతోనే
మొదలు కాలేదు

అది
ఒకే ఒక్క పార్టీ
మొత్తం మీడియా మీద
ఉక్కుపాదం మోపడంతో మొదలైంది

ప్రజాబహుళ్యపు ఘోషను
ప్రపంచానికి చేరనీయకుండా
నియంత్రించడంతో మొదలైంది

సత్యం మీద తీర్పులిచ్చి
స్వేచ్ఛకు
సంకెళ్లు వేయడంతో మొదలైంది

అది
ఒక తల్లి బిడ్డల్ని
'మీరు', 'మేము'గ విభజించి
ఎదురెదురుగా నిలిపి
ఖండిత శిరస్సుల మీదుగా
సింహాసనాలు ఎక్కడంతో మొదలైంది

అదంతా
హిట్లర్ శాసనంతోనే
మొదలు కాలేదు

అది
భిన్నత్వంలో
ఏకత్వాన్ని ప్రవచించి
ఏకత్వాన్ని
గుప్పిట్లో పెట్టుకోవడంతో మొదలైంది..

అదంతా
ప్రజాస్వామ్యవాదులు
నెత్తురోడుతున్న కాలాన్ని
మౌనంగా భరించడంతో మొదలైంది.



# బడ్జెట్‌లో సీమకెంత?

**అరుణ్**



గత రెండు సంవత్సరాల జమా ఖర్చులు విశ్లేషిస్తూ, రాబోయే సంవత్సరపు రాష్ట్ర అవసరాలే గాకుండా, భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని వివిధ రంగాలకు కావాల్సిన నిధుల సేకరణ, నిధులు కేటాయింపు చేయడమే బడ్జెట్ లక్ష్యం. ఇందులో, ప్రజల తక్షణ అవసరాలకై సంక్షేమ కార్యక్రమాలకు తగిన ప్రాధాన్యతనిస్తూనే, రాష్ట్ర సమగ్రాభివృద్ధికి దోహదపడేలా నిధుల (మూలధన పెట్టుబడి) కేటాయింపులుండాలి. అప్పుడే క్రమక్రమంగా ప్రజలకు ఉపాధి అవకాశాలు పెరిగి, తమకాళ్ళపై తాము నిలబడగలుతారు. భవిష్యత్తరాలు, ఆత్మవిశ్వాసంతో జీవనాన్ని కొనసాగించగలిగే అవకాశం వుంటుంది కూడా. అయితే ఇక్కడ కేవలం రాష్ట్రం ఆర్థికాభివృద్ధి చెందడమే సరిపోదు, అందులో, ప్రజలకు వారి వాటకూడా దక్కాల్సి వుంటుంది. అలా ఆశించడం ఈ వ్యవస్థలో పేరాశనే అవుతుందనేది మరో అంశం.

పోతే, కేవలం ఓట్ల రాజకీయాలపై, మంద బలంపై నడిచే నేటి రాజకీయాలలో రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధి అనేది ఒక నెరవేరని కల. అన్ని రాజకీయపార్టీలు, నేడు, ఓట్లవేటలో ప్రజల దీర్ఘకాలిక ప్రయోజనాలను విస్మరించి, వారి మెప్పు పొందడం కోసం, వారి తక్షణావసరాలను తీరుస్తూ, వారిని ఎల్లప్పుడూ తమ కాళ్ళ దగ్గరే పడివుండేలా చూస్తున్నాయి. ఇందులో అన్ని రాజకీయపార్టీలు పోటీ పడుతున్నాయి. సంక్షేమ పథకాల పేరిట, ప్రజల సొమ్మునే ప్రజలకు కొంత పంచుతూ, వారిని మరోవైపు సారా మత్తులో ముంచి, తమ పబ్బం గడుపుకోవడమే ప్రభుత్వాల ఏకైక విధానమైంది. ఆ మాత్రమైనా ప్రజలకు అందుతుందని తృప్తి పడేవాళ్ళూ వున్నారు. కానీ, ఆమాత్రం ప్రజలకందజేయడానికి కూడా రాష్ట్రాలు ఆర్థికాభివృద్ధి చెందక తప్పదు. సంక్షేమ పథకాలు చేపలను పట్టేందుకు వేసే 'ఎర' లాంటివి. ఒక చేత్తో ప్రజలకివ్వడం, మరోచేత్తో ప్రత్యక్ష, పరోక్ష పన్నుల (చెత్తపన్ను, విద్యుత్ చార్జీల పెంపు, పెట్రోల్, డీజీల్ ధరల పెంపు) ద్వారా గుంజుకోవడం -జగన్ ప్రభుత్వం నేడు చేస్తున్నదదే. అప్పు చేసి పప్పుబెల్లాలు ఎల్లకాలం పంచాలేరుగా. అయితే, దానికి మరో సులభమైన మార్గం, ప్రభుత్వ (ప్రజల వుమ్మడి) ఆస్తులు అమ్మడం నేటి పాలకులు కనుక్కున్నారనుకోండి. చేపలైనా, ప్రజలైనా వలలో పడాల్సిందే కదా! సంక్షేమ పథకాలు పాలకులకు ప్రజలపైన వున్న ప్రేమ మాత్రం కాదు అనేది చేదు నిజం. అవి ఉపశమనాలే తప్ప, శాశ్వత పరిష్కారాలు కాదని గ్రహించేంతవరకు ప్రజలు మోసపోతూనే వుంటారు.

2023 ఏపీ బడ్జెట్‌ను పరిశీలించినపుడు వివిధ శాఖలకు కేటాయింపుల విషయంలో కేవలం అంకెల సంఖ్య పెంపుదలను మాత్రమే పరిగణలోకి తీసుకోరాదు. మొత్తం బడ్జెట్లో ఆయా శాఖలకు కేటాయించిన శాతమెంత అనేది పరిశీలనలోకి తీసుకోవాలి. భిన్న ప్రాంతాల, భిన్న శాఖల అవసరాల దృష్ట్యా వాటికి తగిన ప్రాధాన్యత ఇచ్చారా లేదా పరిశీలించాల్సి వుంటుంది. ఇక ద్రవ్యోల్బణం గురించి చెప్పాలా? బడ్జెట్ కేటాయింపులలో మరో మతలబు ఉంది. కేటాయించిన నిధులు మంజూరయ్యాయా? ఖర్చుజేసారా? ఇవన్నీ తెలియడానికి మరో రెండు సంవత్సరాలు పడుతుంది. అంతేకాదు కేటాయించిన నిధులలో, సంబంధిత కార్యాలయ సిబ్బంది జీతభత్యాలు రవాణ ఖర్చులు, కార్యాలయ నిర్వహణ, బకాయీలు పోను, ఇక మిగిలినదెంత చూస్తే ఒక్కొక్కసారి, హళ్లికి హళ్లి, సున్నాకు సున్నాగా తేలడం మనల్ని ఆశ్చర్యపరచక మానదు. కేవలం దినపత్రికలలో కేటాయింపులు చూసి సంతోషపడితే మనం మోసపోతాం.

జగన్ ప్రభుత్వమూ, గత ప్రభుత్వాల బాటలో నడుస్తూనే మరింత ముందడుగు వేసింది. ఆంగ్లంలో ఒక నానుడి వుంది. One should know which side one's bread is buttered. (రొట్టెకు ఏవైపు వెన్న పూసి ఉందో తెలుసుకోవాలి) జగన్ ఈ నానుడి బాగా వంటపట్టించుకున్నాడు. అందుకే, ప్రభుత్వం ఓట్లను తెచ్చిపెట్టే సంక్షేమ పథకాలకు ప్రాధాన్యత నిచ్చింది. ప్రజలను తమ స్వంత కాళ్ళపై నిలబడి, స్వాభిమానంతో, స్వావలంబనతో బతికేలా చేసే పథకాలను నీరుగార్చింది.

అయితే, రాష్ట్ర సమగ్రాభివృద్ధికి దోహదపడే వ్యవసాయ,

పారిశ్రామిక, విద్యారంగాలను విస్మరించడంవల్ల రాష్ట్రాభివృద్ధి కుంటుపడుతుంది. దీర్ఘకాలంలో రాష్ట్రాన్ని దివాలా తీయిస్తుంది. దేశ ఆర్థికానికి కరోనా కాలంలో కూడా వ్యవసాయ రంగం దన్నుగా నిలిచిందని ఆర్థికవేత్తలు చెబుతున్నారు. కోట్లాది మందికి పరోక్షంగా, లక్షలాది రైతాంగానికి ప్రత్యక్షంగా లబ్ధి చేకూర్చే ఆ రంగానికి జవం, జీవం సాగునీరే అని చెప్పక్కర్లేదు. ఆ సాగునీటి పథకాలకు కేటాయింపులు 2019-20 బడ్జెట్‌లో రూ.13,139 కోట్లు వుండగా, ఖర్చు పెట్టింది మాత్రం కేవలం రూ.5,345 కోట్లు కావడం గమనార్హం. ఇక 2020-21 బడ్జెట్‌లో రూ.11,185 కోట్లు కేటాయించి, ఖర్చు కేవలం రూ.5,239 కోట్లుగా వుంది. 2021-22 బడ్జెట్‌లో కేటాయించింది రూ. 13,000 కోట్లు అయితే, ఖర్చు చేసింది రూ.5,203.10 కోట్లు. 22-23 బడ్జెట్‌లో రూ.11,255 కోట్లు కేటాయించగా, సవరించిన అంచనా జనవరి 2023కు రూ.3,514 కోట్లు మాత్రమే. పోతే, మిగిలిన రూ.8,795 కోట్లు అంటే ఫిబ్రవరి, మార్చి నెలలలో రూ.5,281 కోట్లు ఖర్చు పెడతారట. ప్రభుత్వ మాటలకు రాతలకు చేతలకు మధ్య ఎంత వ్యత్యాసముందో అర్థం చేసుకోవచ్చు. ఈసారి కేటాయింపులు రూ.11,908 కోట్లు. గత సంవత్సరాల అనుభవాల నుండి చూస్తే, అందులో నగం ఖర్చుజేసినా ప్రజలు సంతోషపడాల్సిందే. అంతేగాదు, మొత్తం వ్యవసాయ రంగానికి, పారిశ్రామిక రంగాలకు కేటాయింపులు తగ్గడంతో, ప్రజలకు ఉపాధి అవకాశాలు సన్నగిల్లుతాయి. కేవలం అప్పులపై, కేంద్రప్రభుత్వం నుండి ఆశిస్తున్న (ఊహాజనిత) గ్రాంట్లపై ఆధారపడ్డ ఈ బడ్జెట్‌కు నిధులను సమకూర్చుకోవడంలో, ప్రభుత్వం ఏ మేరకు సఫలమవుతుందో రాబోయే కాలానికి వదిలేద్దాం.

సాగునీటికి ఈ ప్రభుత్వం ఇస్తున్న ప్రాధాన్యతను పరిశీలిద్దాం. సాగునీటికి బడ్జెట్‌లో కనీసం 15 శాతం కేటాయించాలని ఆ రంగ నిపుణుల సలహా. అందులో మూడవ వంతు కూడా కేటాయించకపోవడం గమనార్హం. 2022-23- బడ్జెట్‌లో సాగునీటి రంగానికి 4.19 శాతం కాగా, 2023-24లో 4.26 శాతం కేటాయించారు. ఇక కేటాయించిన దానిలో ఎంత శాతం ఖర్చుచేస్తారన్నది ముందు కాలంలో తెలుస్తుంది. జగన్ సర్కార్ పాలన మొదలయ్యాక ఏనాడు 50 శాతం కన్నా ఎక్కువ ఖర్చుబెట్టడం లేదని ప్రభుత్వ గణాంకాలే తెలియజేస్తున్నాయి.

సీమవాసులుగా మా కేంద్రీకరణంతా సాగునీటిపథకాలపై వుండటంలో ఆశ్చర్యమేముంది. ప్రాంతాలవారిగా పెద్ద, మధ్యతరహా ప్రాజెక్టులకు కేటాయింపులను చూద్దాం.

1) కర్నూలు జిల్లా: రూ.594.5 కోట్లు 2) కడప జిల్లా: రూ.1,089.25 కోట్లు. 3) అనంతపురం జిల్లా: రూ.270.23 కోట్లు. మొత్తం రూ. 1,953.98 కోట్లు. అంటే మొత్తం సాగునీటి కేటాయింపు (రూ. 11,908.10 కోట్లలో) 16.4 శాతంగా వుంది. సీమవాసులు నెల్లూరు గంగగా పిలిచే తెలుగు గంగకు కేటాయించిన మొత్తం రూ. 798.11 (6.70 శాతం) కోట్లు. రాయలసీమ ప్రాజెక్టుల కేటాయింపులు నెల్లూరు జిల్లకే పరిమితం చేయడం ఒక విశేషం. (కేవలం సోమశిల-స్వర్ణముఖి అనుసంధానానికై రూ.41.92 కోట్లు). ఇక రాయలసీమకు సంబంధించి తుంగభద్ర బోర్డు రూ.193.77 కోట్లు (1.62 శాతం). దానిలో సాగునీటి పథకాలకు కేటాయింపులు భూతద్దం పెట్టి వెదికినా కనపడవు.

ఉత్తరాంధ్ర జిల్లాలకు రూ.394.23 కోట్లు (3.31 శాతం), గోదావరి డెల్టాకు రూ.23.27 కోట్లు (0.19 శాతం), కృష్ణ డెల్టాకు రూ.593.86 కోట్లు (4.98 శాతం), ప్రకాశం జిల్లాకు 301 కోట్లు (2.52 శాతం).

ఇక పోలవరం పూర్తయ్యాక, రాయలసీమ, ఉత్తరాంధ్ర ఎంత లబ్ధి పొందుతాయో గాని, ఇప్పుడు దాని నిర్మాణ బాధ్యతలు రాష్ట్రం తీసుకోవడంతో రాయలసీమ, ఉత్తరాంధ్ర ప్రాజెక్టులకు అది గుదిబండగా మారింది. ఈ బడ్జెట్‌లో పోలవరానికి రూ.5,414.61 కోట్లు (45.46 శాతం) కేటాయింపులతో రాష్ట్రంలోని వెనుకబడిన ప్రాంతాల ప్రాజెక్టుల కేటాయింపులు తగ్గక తప్పలేదు.

పోలవరం, మొత్తం రాష్ట్రానికి లబ్ధి కలిగించే ప్రాజెక్ట్ కాబట్టే దాన్ని దక్షిణాంధ్ర కోటాలో చేర్చడం అన్యాయమని కొందరు భావించవచ్చు. దశాబ్దాలుగా రాయలసీమ పట్ల ప్రభుత్వాలు అనుసరించిన వివక్షతను గమనంలోకి తీసుకుంటే, ఆ నీళ్ళు సీమకు అందవని స్పష్టమవుతుంది. అంతేగాక, పోలవరంకు తాత్కాలిక ప్రత్యామ్నాయమంటూ నిర్మించిన పట్టిసీమ నుండి లబ్ధి పొందుతున్నది కృష్ణా డెల్టాయే. అయితే, అప్పుడు చంద్రన్న గాని, ఇప్పుడు జగనన్నగాని పట్టిసీమ ద్వారా అదనంగా పొందుతున్న 80 టి.యం.సి.లను సీమకు కేటాయిస్తూ జీ.ఓ. ఇవ్వకపోవడం, అంతేగాక, పోలవరం ద్వారా పొందే జలాలను తమకే ఇవ్వాలని డెల్టా రైతుసంఘాలు తీర్మానాలు చేయడం సీమ ప్రజల అనుమానాలను నిజం చేస్తున్నాయి. నిజంగా ప్రభుత్వానికి చిత్తశుద్ధి వుంటే, పోలవరం పూర్తయ్యాక ఆ నీరు సీమకే కేటాయించాలనే ఉద్దేశం ఉంటే ఇప్పటికే, పట్టిసీమ ద్వారా విడుదలయ్యే నీటికి సమానంగా సీమకు నీళ్లు కేటాయించాలి. అంతేగాదు, పోలవరాన్ని రాష్ట్ర విభజన చట్టం ప్రకారం కేంద్ర నిధులతోనే నిర్మించాలి. అనవసరంగా ఆ బాధ్యత రాష్ట్రం తన నెత్తిన వేసుకోడంతో, అసలే నిధుల లేమితో కునారిల్లుతున్న రాష్ట్రం సాగునీటి కేటాయింపులలో దాదాపు నగం పోలవరంకు కేటాయించడం, తత్ఫలితంగా వేనుకబడిన రాయలసీమ, శ్రీకాకుళాంధ్ర ప్రాంత ప్రాజెక్టులకు నిధుల కేటాయింపు తగ్గుతూ వస్తున్నాయి.

రాయలసీమలో జిల్లాలవారిగా కేటాయింపులని విశ్లేషించేముందు, దశాబ్దాలుగా సీమ ప్రజల డిమాండ్లను చెప్పాల్సి వుంది. సీమప్రజలకు ప్రధానంగా నీరందిస్తున్నది తుంగభద్రానది అనే విషయం మరువరాదు. ఎప్పుడో బ్రిటీష్ ప్రభుత్వంలో ప్రారంభమయిన కె.సి.కాలువ ద్వారా కర్నూలు, కడప జిల్లాలకు 39.9 టి.యం.సి.ల నీటిని, ఆ తర్వాత 1956 నుండి తుంగభద్ర జలాలను అందిస్తున్న తుంగభద్ర ఎగువ కాలువ 32.5 టి.యం.సి.లు, తుంగభద్ర దిగువ కాలువ 29.5 టి.యం.సి.ల ఆయకట్టుకు, కేటాయించిన వాటిలో సగం నీళ్ళయినా అందించే ప్రయత్నం జరగలేదు. కె.సి.కాలువకు కేటాయించిన నీటిని నిల్వజేసుకునేందుకు గుండ్రేవుల రిజర్వాయర్, తుంగభద్ర ఎగువ

కాలువకు ప్రత్యామ్నాయంగా తుంగభద్ర ఎగువ సమాంతర కాలువ నిర్మాణం, కేటాయించిన కృష్ణా జలాలను వినియోగించుకొనేందుకు సిద్ధేశ్వరం అలుగు నిర్మాణం లాంటి పథకాల ఊసేలేదు. జగన్ ఎన్నికలముందు హామీ ఇచ్చిన గుండ్రేవుల రిజర్వాయర్ గురించి ఈ బడ్జెట్‌లో కూడా ప్రస్తావన లేకపోవడం గమనార్హం. సీమ విషయంలో జగన్ గర్వంగా చెప్పుకునే 'మడమ తిప్పడు, మాట తప్పడు' వర్తించదేమో?

ముఖ్యమంత్రిగారి కడప జిల్లాకే పోదాం.

మనకు కొట్టొచ్చినట్టు కనపడే కేటాయింపులు రూ.1,081.25 కోట్లు కడప జిల్లాకే. అయితే, జిల్లా నుండి రూ.5,220 కోట్లు అవసరమని ప్రతిపాదనలు వెళ్ళాయి. అంతేగాక, గత బడ్జెట్ కేటాయింపులను పూర్తిగా ఖర్చుచేసింది కడప జిల్లాలోనే. 3 జిల్లాలకు సాగునీరందించే గాలేరు-నగరి నత్తకూడా వెక్కిరించేలా అతినెమ్మదిగా నడుస్తున్నది. దాదాపు రూ.4వేల కోట్లకు పైగా అవసరమయ్యే గాలేరు-నగరికి 2022-23 బడ్జెట్‌లో కేటాయించింది రూ.438.05 కోట్లు. 2025 నాటికి పూర్తిజేస్తామన్న ఈ ప్రాజెక్టుకు 2023-24 బడ్జెట్‌లో కేటాయింపులు రూ.855.35 కోట్లు మాత్రమే. అందులోనూ, ఉద్యోగుల జీతభత్యాలు, కార్యాలయ ఖర్చులు పోను కాలువ పనులకు మిగిలేది రూ.560 కోట్లు మాత్రమే. గండికోట రిజర్వాయర్ నిర్వాసితులకు ఇవ్వాల్సిన నష్టపరిహారం పోగా ఇక గాలేరు-నగరి కడప జిల్లా గడప దాటడం అసంభవమే.

పులివెందుల బ్రాంచ్ కాలువకై జిల్లా సాగునీటి కార్యాలయ అధికారులు రూ.900 కోట్లు కావాలని ప్రతిపాదనలు పంపగా, కేటాయించింది రూ.106.59 కోట్లు. అందులో పెద్ద, చిన్న తరహా పనులకై కేటాయించింది రూ.91.90 కోట్లు మాత్రమే. ఎక్కడి రూ.900 కోట్ల అంచనా, ఎక్కడి రూ.106.90 కోట్ల కేటాయింపులు? మైలవరానికి గత బడ్జెట్‌లో రూ.6.10 కోట్లు, ఈ బడ్జెట్‌లో రూ.45 కోట్లకు ప్రతిపాదనలు పంపగా, రూ.5.67 కోట్లు కేటాయించారు. అందులో అసలు పనులకు ఖర్చుజేసేది రూ.1.17 కోట్లు మాత్రమే.

ఇంకా విషాదమేమంటే, మానవతప్పిదం, అధికారుల నిర్లక్ష్యం వల్ల పూర్తిగా దెబ్బతిన్న అన్నమయ్య ప్రాజెక్టుకు దాదాపు రూ.787 కోట్లు అనుమతి ఇచ్చినా, 2023-24 బడ్జెట్‌లో రూ.203.70 కోట్లు ప్రతిపాదనలు పంపినా, కేటాయించింది మాత్రం కేవలం రూ.20.29 లక్షలు మాత్రమే. అలాగే వరదల్లో కొట్టుకపోయిన ఫించా ప్రాజెక్టుకు రూ.68 కోట్లు అవసరం కాగా, కేటాయించింది కేవలం రూ.8 కోట్లు మాత్రమే. వెలిగల్లుకు రూ.1.57 కోట్లు కాగా, చెయ్యేరుకు రూ.20.29 లక్షలు. సాగునీటి కేటాయింపులలో కడపకు రూ.1081 కోట్లు కేటాయించినా, భూసేకరణ, బకాయిలు, వేతనాలు తదితర ఖర్చులు పోను ప్రాజెక్టుల పురోగతికి వినియోగించేది రూ.531.02 కోట్లు మాత్రమేనని ప్రభుత్వ గణాంకాలు చెబుతున్నాయి.

పై కేటాయింపులను జగన్ డిసెంబర్ 2019 కడప పర్యటన సందర్భంలో చేసిన హామీల నేపథ్యంలో చూస్తే, మాటలకు చేతలకు మధ్య అంతులేని తేడా కనపడుతుంది. కడప జిల్లాలో అత్యంత వెనుకబడిన ప్రాంతాలకు నీరందించే బ్రహ్మసాగర్ జలాశయం పూర్తిగా మరిచారు. దాదాపు రూ.3,733 కోట్లతో 7 నూతన ప్రాజెక్టులకు జగన్ 19 డిసెంబర్ 2019న శంకుస్థాపన చేసాడు. ఇక, నీటి సరఫరాను వేగవంతం చేయడానికి వివిధ కాలువల పొరుదల సామర్థ్యం పెంపుకై రూ.2 కోట్లు హామీ కూడా వుంది. అవేమీ ఈ బడ్జెట్‌లో మచ్చుకైనా కనిపించవు.

అత్యంత కరువు పీడిత జిల్లా అనంతపురం విషయానికొస్తే, పరిస్థితి ఆశాజనకంగా లేదు. జిల్లా నుండి 2022-23 బడ్జెట్‌కై రూ.4000 కోట్ల ప్రతిపాదనలు పంపగా, వాటిని పునఃప్రతిపాదనగా రూ.1700 కోట్లకై తిప్పి పంపారు. చివరకు కేటాయించింది రూ.337.99 కోట్లు. అనంతపురం జిల్లా ప్రజలు సాగు, తాగునీటికి మొదటి నుండి ఆధారపడివున్నది తుంగభద్ర ఎగువ కాలువపైనే. ఆ తర్వాతి కాలంలో అనంతపురం జిల్లావాసులకు వరప్రదాయినిగా కనపడుతున్నది హంద్రీ-నీవా. దీనికి కేటాయింపులు చూస్తే ఎప్పుడు పూర్తవుతుందో ముఖ్యమంత్రిగారు తరచూ పలవరించే దేవునికే ఎరుక.

హంద్రీ-నీవా పథకం పూర్తికావడానికి సుమారు రూ.2,570 కోట్లు అవసరమని సంబంధిత శాఖాధికారులు తెలుపుతుండగా, ఈ బడ్జెట్‌లో ఈ పథకానికి కేటాయించింది రూ.270.14 కోట్లు. ఈ సందర్భంలో హంద్రీ-నీవా కాలువ సామర్థ్యం రూ.6 వేల కోట్లతో 6 వేల క్యూసెక్కులకు పెంచుతామని, దానికి ఒక సమాంతర కాలువ నిర్మిస్తామన్న జగనన్న హామీ గాలిలో దీపంగా ఆరిపోయిందనవచ్చు. కొన్ని దశాబ్దాలుగా ఆ కాలువ మొదటిదశ కూడా పూర్తికాలేదు.

పోతే, తుంగభద్ర ఎగువ కాలువ నుండి అందవలసిన 32.5 టి.యం.సి.లకు గాను, తుంగభద్ర డ్యాం పూడిక వల్ల, పైభాగాన అనధికారిక నీటి వినియోగం వల్ల కొన్ని దశాబ్దాలుగా 15 టి.యం.సి.ల కన్నా మించి నీరందలేదు. దానికి ప్రత్యామ్నాయంగా జలవనరుల నిపుణులు తుంగభద్ర ఎగువ సమాంతర కాలువ నిర్మాణాన్ని ప్రతిపాదించారు. కానీ ఏ ప్రభుత్వమూ దాన్ని పట్టించుకోలేదు. ఆ నీళ్లన్నీ నదిలో పారి, కృష్ణలో చేరి సాగర్, డెల్టా ఆయకట్టులను సస్యశ్యామలం చేస్తూ, చివరకు సముద్రాన్ని చేరుతున్నాయి. అదలా వుంచితే, తుంగభద్ర ఎగువ కాలువ ఆధునీకరణైనా చేపట్టి, నీటి వృధాను అరికడతారా అంటే అదీలేదు. ఆధునీకరణ, మరి ఇతర పనులకై రూ.1069 కోట్లు అవసరమని అంచనాలుంటే ఈబడ్జెట్‌లో కేటాయించింది రూ. 21.86 కోట్లు.

ఇక, రూ.800 కోట్ల అంచనాతో జగన్ రెడ్డి రెండేళ్ళ కిందట శంకుస్థాపన చేసిన జీడిపల్లి-ఎగువ పెన్నార్ ఎత్తిపోతల కింద 3 ప్రాజెక్టులు శంకుస్థాపనతోనే ముగిసాయి. అలాగే, పుట్టపర్తి నియోజకవర్గంలోని 193 చెరువులకు హంద్రీ-నీవా నుండి రూ.737 కోట్లతో నీరందించే పథకానికి నిధుల కేటాయింపు లేదు. 2020లోనే మంజూరైన ఈ పథకాన్ని 3 సంవత్సరాల్లో పూర్తిచేస్తామని ప్రభుత్వం ప్రకటించింది. ఇక జిల్లాలో నీటికి కటకటలాడే చిలమత్తూరు ప్రాంత చెరువులకు నీరు నింపే పథకానికి 2018లోనే డిపిఆర్ తయారైనా అది ఇంకా కార్యరూపం దాల్చలేదు.

జలవనరుల శాఖ పూర్తి మర్చిపోయిన ఒక ప్రాజెక్ట్ భైరవానితిప్ప ప్రాజెక్ట్. వేదవతి నది జలాలపై ఆధారపడిన 4.9 టి.యం.సి.ల సామర్థ్యంగల ఈ రిజర్వాయర్లో దశాబ్దాలుగా ఏనాడు 1 టి.యం.సి. నీరు నిల్వకాలేదు. అందుకై హంద్రీ-నీవా నుండి నీటిని ఎత్తిపోయాలని జీడిపల్లి- భైరవానితిప్ప ఎత్తిపోతల పథకానికి రూ.510 కోట్లు తో శంకుస్థాపన జరిగింది. నేటి బడ్జెట్‌లో దానికి ఒక్క రూపాయి కేటాయించకపోవడం గమనార్హం. పార్టీలు మారినా, సీమ ప్రజల పట్ల పాలకుల వివక్షతలో ఏ మాత్రం మార్పులేదు.

చిత్తూరు జిల్లా మొదటినుండి భూగర్భ జలాలపైనే ఆధారపడివుంది. కాలువల సాగు ఆ రైతాంగానికి ఏనాడు అందుబాటులో లేదు. వర్షాధారిత చిత్తూరు జిల్లావాసులకు హంద్రీనీవా, గాలేరు-నగరి అనే రెండు పథకాలు చిమ్మ చీకట్లో కాంతి రేఖలనిపించాయి. కేవలం 40 టి.యం.సి.ల నీటిని ఎత్తిపోసే హంద్రీనీవా 600 కిలోమీటర్లు దాటి, మూడు జిల్లాల రైతాంగపు దాహం తీర్చి చిత్తూరు జిల్లా చేరుతుందనే ఆశ అక్కడి ప్రజలకుండొచ్చునేమో గాని, చాలామంది జలనిపుణులకు లేదు. అదేగాక సోమశిల-స్వర్ణముఖి లింక్ కాలువకు గత బడ్జెట్‌లో రూ.62.55 కోట్లు కేటాయించారు. ఇక తెలుగుగంగ ప్రాజెక్ట్‌కు కేటాయింపుల్లో భాగంగా రూ.41.92 కోట్లు కేటాయించారు. దాని పూర్తికి మరెన్ని తరాలు వేచి చూడాలో. జిల్లాలో తిరుపతి, చంద్రగిరి, శ్రీకాళహస్తి, నగరి నియోజకవర్గాలకు నీరందించే గాలేరు-నగరి పథకానికి ఈ బడ్జెట్‌లో కేటాయించింది రూ.855.33 కోట్లు. అయితే ఈ నిధులన్నీ కడప జిల్లా పరిధిలోనే. ఇక గాలేరు-నగరి కాలువ శేషాచలం అడవులు దాటి చిత్తూరు జిల్లాలో ఎప్పుడు అడుగిడాలో? చిత్తూరు జిల్లావాసుల విషాదమేమంటే, కిరణ్‌కుమార్ రెడ్డి ప్రతిపాదనలను చంద్రన్న రద్దుజేస్తే, చంద్రన్న ప్రతిపాదనలను జగనన్న రద్దుచేయడం. ఈ పరిస్థితులలో, చిత్తూరు జిల్లావాసులు తాగు, సాగు నీటి పథకాల పూర్తికి మరికొన్ని దశాబ్దాలు వేచివుండాల్సిందే.

కర్నూరు జిల్లా: రాయలసీమకు జలరాజధానిగా చెప్పుకొనే కర్నూలు జిల్లా నీటి పథకాల కేటాయింపులను పరిశీలిద్దాం. నాలుగు జిల్లాలకేగాక, అటు తెలంగాణ, ఇటు సాగర్, కృష్ణా డెల్టాలకు నీటి సరఫరా కేంద్రంగా కర్నూలు జిల్లాను చెప్పవచ్చు. తెలంగాణ, దక్షిణ కోస్తాలకు జలాలు, విద్యుత్తునందించేందుకు జలరిజర్వాయర్ (శ్రీశైలం) నిర్మాణానికి రెండు పంటలుపండే కె.సి.ఆయకట్టు 88వేల ఎకరాలను త్యాగం చేసిన చరిత్ర జిల్లా రైతాంగానిది. మరి, గత అర్ధశతాబ్దంలో వీరికి దక్కింది హల్లికి హల్లి, సున్నాకు సున్నా. చంద్రబాబు జీ.ఓ. 69తో అందే నీళ్ళకు ఉరితాడు బిగిస్తే, ఏ రాజకీయపార్టీ నోరువిప్పని చరిత్ర. ఇక, వాళ్లెవ్వరూ దక్షిణ కోస్తా ఆధిపత్యవర్గాలను ఎదురించలేరని తెల్సిన జిల్లా రైతాంగం, తమకు కేటాయించిన నీటిని సకాలంలో అందుకునేందుకు సిద్ధేశ్వరం అలుగు నిర్మించాలని ఉద్యమాలు చేస్తే, అటు చంద్రన్న, ఇటు జగనన్న కూడా నోరు విప్పలేదు. జగనన్న ఒకడుగు ముందుకు, వెనుకకు వేసి సంగమేశ్వరం ఎత్తిపోతల పథకం అంటూ తెలంగాణతో స్పర్థలు పెంచి, సిద్ధేశ్వరం అలుగు నిర్మాణ ప్రతిపాదనకు మరిన్ని అడ్డంకులు కొనితెచ్చాడు. వివాదాలపై బతకాలనుకున్న నాయకులు అంతకంటే వేరే ఏం చేయగలరు?

**ప్రాజెక్టులవారిగా కేటాయింపులను (కోట్ల రూపాయల్లో) చూద్దాం:**

| ప్రాజెక్టు | ప్రతిపాదనలు | కేటాయింపు |
|---|---|---|
| ఆర్‌డిఎస్, వేదవతి | 365 | 80.94 |
| కుందు, నిప్పులవాగు | 207 | 225.22 |
| ఎస్ఆర్‌బిసి | 46 | 42.5 |
| గురురాఘవేంద్ర | 8 | 24.65 |
| 68 చెరువులకు | 56 | 56.50 |
| గాజులదిన్నె | 40 | 19 |
| శ్రీశైలం విద్యుత్ ప్రాజెక్ట్ | 2 | 5.34 |
| ఔకు సొరంగం | 32 | 60 |
| రాజోలి, జొలదరాసి | 59.67 | 0.77 |
| సిద్దాపురం ఎత్తిపోతల | | 8 |

మొత్తం ప్రతిపాదనలు రూ.980 కాగా, దానిలో జీతభత్యాలు తీసివేస్తే వివిధ ప్రాజెక్టులకు నికరంగా పనులకు ప్రతిపాదనలుగా మిగిలేది రూ.805.67 కోట్లు. ఈ బడ్జెట్‌లో కేటాయింపులు రూ.593.86 కోట్లు కాగా నికరంగా సాగునీటి పథకాల అవసరానికి రూ.378 కోట్లుగా కనపడుతున్నది.

అవసరాలను చూద్దాం. గాజులదిన్నెను ఆధునీకరణ చేసి, దాని సామర్థ్యాన్ని 4.5 టిఎంసిల నుండి 5.5 టిఎంసిలకు పెంచి ఆయకట్టును 23వేల ఎకరాలకు పెంచుతామని సాక్షాత్తు ఆర్థిక శాఖ మంత్రి బుగ్గన గారు హామీ ఇచ్చారు. పోతే దానికి రూ.38 కోట్లు అవసరమైతే కేటాయించింది రూ.19 కోట్లు మాత్రమే. బడ్జెట్‌లో సిద్దేశ్వరం అలుగు, గుండ్రేవుల రిజర్వార్ (నంద్యాల సభలో ఎన్నికల ముందు వాగ్దానం -మాటతప్పని, మడమతిప్పని నాయకుడని ఎవరైనా జ్ఞాపకం జేసేరు)ల ఊసేలేదు. అంతకు ముందు హంద్రీ-నీవా కాలువ నుండి మరిన్ని నీళ్ళను సరఫరా చేసేందుకై, ప్రభుత్వమూ, దాని తైనాతీలు ప్రచారం చేసుకున్న హంద్రీ-నీవా సమాంతర కాలువ మాట అసలేలేదు. దానికై రూ.630 కోట్లు ప్రతిపాదనలు పంపారు కూడా. అంతేకాదు కర్నూలు జిల్లాలో 88 వేల ఎకరాలకు నీరు అందించాల్సి వుండగా, 20 వేల ఎకరాలకు నీరందడం లేదు. దానికి ఉప, పిల్లకాలువల నిర్మాణంతోపాటు, పత్తికొండ ప్రాంతంలో 68 చెరువులను నింపాలనే ప్రతిపాదన ఒక్క అడుగూ ముందుకు కదలలేదు. ఈ బడ్జెట్‌లో వాటికి రూ.56.50 కోట్లు కేటాయించడం చూస్తే హంద్రీ-నీవా జలాలు వెనుకబడిన పత్తికొండ ప్రాంతానికి అందే అవకాశం ఇప్పట్లో కనపడదు.. ఇక ఎప్పటినుండో సరైన నిర్వహణ లేక, వచ్చిన నీళ్ళను సరిగా అందించలేని కె.సి కాలవకు జీతభత్యాలు, ఇతర ఖర్చులతోపాటు, కుందూ ఆధునీకరణ, నిప్పులవాగు వెడల్పు కోసం కలిపి కేటాయింపులు రూ.204 కోట్లు కేటాయించారు. అయితే వాటివల్ల ఎక్కువగా లబ్ధిపొందేది నెల్లూరు జిల్లానే అని వేరే చెప్పాలా? తరచూ ప్రధాన కాలువకు గండ్లుపడే ఎస్ఆర్‌బిసి ప్రాజెక్ట్ నుండి సక్రమంగా నీరు సరఫరా కావాలంటే గోరుకల్లు రిజర్వాయర్, ఔక్ టన్నెల్ పూర్తికావల్సి ఉంది. 2002 నాటికే పూర్తయినట్టు చెప్పబడుతున్న ఈ ప్రాజెక్ట్ గోరుకల్లు రిజర్వాయర్

నిర్మాణ లోపాలవల్ల, ఔక్ టన్నెల్ పూర్తికాకపోవడం, దాని ఆయకట్టుదారులు ఏనాడూ పూర్తిగా లబ్ధిపొందలేదు. ఈ బడ్జెట్‌లో ఔక్ టన్నెల్‌కై రూ.60 కోట్లు కేటాయించారు.

తుంగభద్ర దిగువకాలువ ఆయకట్టు స్థిరీకరణ, 66వేల ఎకరాలకు సాగునీరందించేందుకై చేపట్టిన, 1999 జూన్‌లోనే పరిపాలన అనుమతి పొందిన గురురాఘవేంద్ర ఎత్తిపోతల పథకాల (12) రెండు దశాబ్దాల తర్వాతనైనా వాటి ప్రకటిత లక్ష్యం నెరవేరుతుందా? దీనికి కేటాయింపులు రూ. 24.65 కోట్లు. ఇక, కర్నూలు జిల్లాలో కరువుపీడిత పశ్చిమ మండలాలకు తాగు, సాగుకై, 24 టి.యం.సి.ల నీరందించే తుంగభద్ర దిగువ కాలువ దశాబ్దాలుగా 10 టి.యం.సి.ల నీరు కూడా అందించలేకపోతుంది. పైభాగాన జలచౌర్యమే గాక, తుంగభద్ర డ్యాంలో పూడిక చేరడం దానికి కారణం. పై ఆయకట్టు స్థిరీకరణ, జిల్లాలోని పశ్చిమ కరువు ప్రాంతానికి నీరందించే ఆర్‌డిఎస్, వేదవతి ఎత్తిపోతల పథకాలకు రూ.365 కోట్లకు ప్రతిపాదనలు పంపగా కేటాయించింది కేవలం రూ.80.94 కోట్లు. ఇక అవి పూర్తయేందుకు ఎన్ని దశాబ్దాలు పట్టాలో? జోలదరాసి, రాజోలి ఎత్తిపోతల పథకాలకు ఈ బడ్జెట్‌లో కేటాయించింది కేవలం రూ.0.77 కోట్లు మాత్రమే. ఇక చిన్న, చితక పథకాలైన గాజులదిన్నెకు రూ.40 కోట్లకు ప్రతిపాదనలు పంపంపగా, కేటాయించింది రూ.19 కోట్లు. వరదరాజుల స్వామి ప్రాజెక్ట్‌కు రూ.10.35 కోట్లు కేటాయించారు. కడప జిల్లాకు కేసి కాలువ జలాలనందించే అలగనూరు రిజర్వాయర్ ప్రభుత్వ నిర్లక్ష్యం వల్ల పూర్తిగా దెబ్బతిని చుక్కనీరు కూడా నిల్వజేసుకోలేని దుస్థితిలో వుంది. దాని పునర్నిర్మాణానికై రూ.25 కోట్లు ప్రతిపాదనలు పంపగా, ఈ బడ్జెట్‌లో దాని గురించి ఊసేలేదు.

రాయలసీమ తాగు, సాగునీటి అవసరాల పట్ల ఏ రాజకీయపార్టీకి చిత్తశుద్ధి లేదనే విషయం, అవి సీమ డిమాండ్ల పట్ల స్పందించిన తీరు తెలియజేస్తుంది.

ఏ ప్రభుత్వమైనా అన్ని జిల్లాల అవసరాలను ఒకే బడ్జెట్ కేటాయింపులతో తీర్చలేదు. కాని, నిధుల కేటాయింపులలో ఆయా ప్రాంత ప్రత్యేక పరిస్థితులను దృష్టిలో పెట్టుకోవాలి. వెనుకబడిన ప్రాంతాలకు ఎక్కువ ప్రాధాన్యతనివ్వాలి. ఇది సహజ న్యాయసూత్రం. కానీ మొదటినుండి అన్ని పార్టీలు అభివృద్ధి పొందిన ప్రాంతాలకే ప్రాధాన్యతనిస్తూ వస్తున్నారు. అందుకు జగన్ మినహాయింపు కాదని గత మూడేళ్ళలోనే రుజువు చేసుకున్నారు. చంద్రన్న మాదిరే జగనన్న, మిగతా రాజకీయ పార్టీలన్నీ. పోలవరం, అదేదో సర్వరోగ నివారిణి అయినట్టు, జపంచేస్తూ, అది పూర్తయితే, కృష్ణా-గోదావరి అనుసంధానంతో సీమ సస్యశ్యామలం అవుతుందని ఎండమావుల్లో దాహం తీర్చుకోమంటున్నారు. ఇక సంక్షేమ పథకాలు ఓట్లను రాలుస్తాయి. ప్రచారానికి స్వంత మీడియా, పెంచిపోషిస్తున్న స్వగణం ఉండనే వుంది. కులాలవారీగా విడిపోయిన ప్రజలున్నారు. అంతేకాదు, మూడు రాజధానులంటూ మూడు ప్రాంతాల మధ్య చిచ్చుపెట్టి, ప్రజల్ని మౌలిక సమస్యల నుండి దృష్టి మరల్చడంలో సఫలమయ్యాడు. సీమ ప్రజలు గతంలాగానే, తమను కరువునుండి కాపాడే దైవం కోసం ఎదురు చూస్తూనే ఉంటారు. వ్యక్తిపూజకు దాసోహం అన్నంత కాలం పరిస్థితిలో మార్పునాశించలేము.

చివరి వ్యాఖ్యానం: సాగునీటి పథకాలను పూర్తిజేయడం, కొత్త పథకాలను చేపట్టడం అటుంచితే, అధిక వర్షాలవల్ల లభ్యమయిన నీటిని ఒడిసి పట్టడంలో ప్రభుత్వ వైఫల్యాన్ని ఏమనాలి? కొత్త రిజర్వాయర్ల నిర్మాణాలు లేకపోవడమటుంచితే, చెరువులలో పూడికలు, ఉన్న రిజర్వాయర్ల లీకేజీలు, వీటిపట్ల పాలకుల నిర్లక్ష్యం ఈ కింది వివరాలను పరిశీలిస్తే స్పష్టమవుతుంది.

2019-20లో రాష్ట్రంలో లభ్యమయిన నీరు 8,637.14 టి.ఎం.సి.లు కాగా, ఆడిట్ నివేదిక ప్రకారం రాష్ట్రం వినియోగించుకున్నది (భూగర్భంలో ఇంకినది, మట్టిలో కలిసినది, రిజర్వాయర్లలో నిల్వ) కేవలం 978.16 టి.ఎం.సి.లు. అంటే 11.32 శాతం మాత్రమే. (ది హిందూ, 5 అక్టోబర్ 2019). రాష్ట్రంలో చిన్న, మధ్యతరహా, పెద్ద రిజర్వాయర్ల నిలువ సామర్థ్యం 982.35 టి.ఎం.సి.లు కాగా నిల్వజేసుకున్నది కేవలం 311.10 టి.ఎం.సి.లు మాత్రమే. సముద్రం పాలయినవి 2019-20లో కృష్ణా జలాలు 1268.62 టి.ఎం.సి.లు, గోదావరి జలాలు 1991 టి.ఎం.సి.లు. ఇక 2020-21లో సముద్రం పాలయిన కృష్ణా జలాలు 903 టి.ఎం.సి.లు, 2021-22 నీటి సంవత్సరంలో శ్రీశైలం చేరిన కృష్ణా జలాలు 1080 టి.ఎం.సి.లు. 2022-23 లో 1800 టి.ఎం.సి.లకు పైగా శ్రీశైలంలో చేరిన నీళ్ళు అంటే, నాగార్జున సాగర్‌కు కేటాయించిన 360 టి.ఎం.సి.లు పోగా మిగిలిన జలాలను పై భాగాన వుండే రాయలసీమ, దక్షిణ తెలంగాణా ప్రాంతాలకు వినియోగించి వుండవచ్చు. అంతేకాదు ఈ సంవత్సరం తుంగభద్రా జలాలు దాదాపు 600 టి.ఎం.సి.లు కృష్ణలో కలిసి సముద్రం పాలయ్యాయి. వీటన్నింటినీ ఒడిసి పట్టుకొనేందుకు తగినన్ని జలాశయాలు, చెరువులు నిర్మిస్తే రాయలసీమ ప్రజలు కరువు కోరలకు బలి కావాల్సిన అవసరం వుండదు. పోతే ఈ ప్రాంతాలపట్ల ప్రభుత్వాలకున్న వివక్షత వల్ల అధిక వర్షాలవల్ల ఊర్లు, పొలాలు మునిగాయి, చిన్న ప్రాజెక్టులు అన్నమయ్య లాంటివి కొట్టుకపోయాయి తప్ప, ప్రజలకేమీ ఒరగలేదు. ఇప్పుడు, మార్చి నెలలోనే శ్రీశైలంలో చుక్క నీరు లేకపోవడం గమనార్హం. రెండు రాష్ట్రాలు ఒకదానితో ఒకటి పోటీపడి విద్యుత్ ఉత్పత్తి పేరుతో శ్రీశైలం రిజర్వాయర్‌ను ఖాళీ చేశారు. మరోవైపు దాదాపు 700 టి.ఎం.సి.లు సముద్రం పాలయ్యాయి కూడా. ఇక, సాగు, తాగునీరు లేక నవంబర్ నెలకు ముందునుండే సీమ ప్రాంతంలో గ్రామాలకు గ్రామాలు ఖాళీ కావడానికి ఎవరిని నిందించాలి? ప్రకృతినా? ప్రభుత్వాలనా? లేక రాజకీయనాయకులను నిలదీయలేని మనల్నా?

ప్రముఖ పాత్రికేయుడు పాలగుమ్మి సాయినాథ్ అన్నట్టు Everybody Loves A Good Drought (కరువంటే ప్రతి ఒక్కరికీ ఇష్టం) అయితే ఇక్కడ 'ప్రతిఒక్కరు', అంటే రాజకీయనాయకులు, ఉన్నతాధికారులు అని చదువుకోవాలి. ప్రజల అవసరాలే వారి పదవికి సోపానాలు కదా!

(గమనిక: బడ్జెట్ సంఖ్యలు వివిధ దినపత్రికలలో భిన్నంగా వుండటం గమనించి, రాష్ట్ర శాసనమండలికి మార్చ్ 2023 ఆర్థికమంత్రి సమర్పించిన, జలవనరుల శాఖ విడుదలజేసిన పత్రంలోనివి తీసుకున్నాను)





# జనవనం నుండి ఉత్తరం

ప్రియమైన అమ్మ, నాన్నలకు పిడికిలి బిగించిన చేతినెత్తి లాల్‌సలామ్ చెబుతున్నాను.

ఎట్లా ఉన్నరమ్మా నీవు, నాన్న! వృద్ధాప్యంలో వచ్చే అనారోగ్య సమస్యలు మిమ్ములను కూడా చుట్టుముట్టాయనుకుంటాను. మా ఐదుగురిని కని, పెంచి, చదివించి అన్ననూ, నన్ను ప్రజల కోసం పోరాడమని యుద్ధరంగానికి పంపించిన మీకు ఈ దోపిడీ ప్రభుత్వాలు, తిట్టడం, కొట్టడం, పోలీస్‌స్టేషన్ల చుట్టూ తిప్పడం, అక్రమ కేసులు పెట్టి జైలుపాలు చేయడం, మమ్ములను సరెండర్ కమ్మని మీనోట స్టేట్మెంట్ ఇయ్యండని ఒత్తిడి తేవడం, దానికి మీరు ససేమిరా అంటే నీ జుట్టుపట్టి గుంజుకుపోయి నడిరోడ్డుమీద మండుటెండలో నిలబెట్టి కొట్టడం, నాన్నను జైలులో పెట్టడం, అంతటితో ఆగక, 1997లో మిమ్ములను కట్టుబట్టలతో జిల్లానుండి బహిష్కరించడం లాంటివన్నీ శత్రువు మీ మీద ప్రయోగించినా భయపడకుండా మీరిద్దరు ఒకరి అభిప్రాయాలను ఇంకొకరు గౌరవించుకుంటూ, ఒకరికొకరు అండగా ఉంటూ వస్తున్నారు. మీ పట్టుదల ముందు ఎన్ని నిర్బంధ క్యాంపెయిన్లు తలవంచి వీగిపోయాయో.

మీ చేత అన్నం పెట్టి కడుపునింపి, సాగనంపిన ప్రజల ముద్దుబిడ్డలైన కడవెండి వెంకటరమణ, శాంతక్క, సత్యన్న, శ్రీమన్నారాయణ, వెంకన్న, సోమన్న, మాటూరి యాదగిరి, యాప నార్రాయణ లాంటి ప్రజావీరుల అమరత్వాలు మిమ్ములను దుఃఖసాగరంలో ముంచినా, ప్రజాయుద్ధానిదే జయం అనే నమ్మకంతో బతుకుతున్న మీకు బాబాయి, వదిన, అన్నా అమరత్వాలు కూడా కడుపుకోతను మిగిల్చాయి. అంతేకాదమ్మా! మీరు చూస్తూ వస్తున్న 1980ల నుండి కొనసాగుతున్న నిర్బంధకాండ ఇంకా రోజురోజుకు సామ్రాజ్యవాదుల మద్దతుతో భారత పాలకవర్గాలు డేట్లు ప్రకటిస్తూ ఉద్యమాన్ని ఊడ్చిపెడతామంటున్నాయి. ఒక్కసారి వెనకకి తిరిగి చూస్తే నగ్జల్బరీ, శ్రీకాకుళం, అదిలాబాద్, కరీంనగర్(జగిత్యాల జైత్రయాత్ర) పోరాటాలు ఈ రోజు దండకారణ్యం దేశమంతా విప్లవోద్యమం విస్తరించి, ముఖ్యంగా దండకారణ్యంలో ప్రజల ప్రభుత్వం, జనతన సర్కార్ నడుస్తున్నది.

నాన్నా..నేను చిన్నగున్నప్పుడు ఎండాకాలంలో పండువెన్నెలలో ఇంటిముందు మంచాలేసి, వాటిమీద నీళ్ళు చల్లి, అమ్మ పక్కలేస్తే, నీ చాతిమీద తలపెట్టి పడుకొని చందమామను చూస్తూ 'నాన్న కథ చెప్పు' అంటే అప్పటి తెలంగాణ సాయుధ పోరాటం గురించి చెబుతూ, అప్పుడూ నీకు 16 సంవత్సరాలనీ, సూర్యాపేట తాలుకాలో మనపాత ఊరిలో నీ కంటే పెద్ద వయస్సువాళ్ళు మన తాత రజాకార్లకు వ్యతిరేకంగా కొట్లాడినారనీ, ప్రజలు భూస్వాముల భూముల్లో జెండాలు పాతి, ఆ భూములను ఆక్రమించుకొని, దొరలకు నీళ్ళు, నిప్పు బంద్ పెట్టి, దొరల గడీల పాలనకు తాళం పెట్టి, ఎన్నో గ్రామాలను ప్రజలు విముక్తి చేసుకున్న తీరును చెబుతూ, ఆ పోరాటంలో మహిళల ధీరత్వాన్ని సోదాహరంగా చెబుతూ, ముఖ్యంగా మల్లు స్వరాజ్యం తెగువను ఎత్తిపడుతూ, అప్పటి సీపీఐ నాయకత్వ ద్రోహంవల్ల పోరాటం అగిపోయిందనీ, మళ్ళీ నిజమైన పోరాటం విప్లవశక్తుల నాయకత్వంలోనే జరుగుతుందనీ, వారి నాయకత్వంలోనే ప్రజల రాజ్యం వస్తదనీ, నేను పెరిగి పెద్దదానినై డాక్టర్ చదివి, విప్లవంలోకి పోవాలని నీ కలను చెప్పేవాడివి కదా నాన్న. ఆ ప్రజల రాజ్యానికి బీజరూపమైన జనతనసర్కార్ ఇవాళ దండకారణ్యంలో ఎన్నో సవాళ్ళను ఎదుర్కొంటూ, 'ప్రత్యామ్నాయ ప్రభుత్వం'గా నడుస్తున్నది.

ఇక్కడి దోపిడీ ప్రభుత్వాలు ఆదివాసీ భూస్వామి అయిన మహేంద్రకర్మ నాయకత్వంలో 1990లో 'జనజాగరణ్' క్యాంపెయిన్, 2006లో 'సల్వాజుడూం' పేరుతో ఇక్కడి గ్రామాలన్నీ తగులబెట్టి, వీరి సంపదను దోచుకొని చేతికి దొరికిన వాళ్ళను ముక్కలుగా నరికి, మహిళల్ని అత్యాచారాలు, హత్యలు చేసి, పారే వాగులల్లో పడేసారు. ఇంత హత్యాకాండను సైతం విప్లవోద్యమ నాయకత్వంలో ప్రజలు కొట్లాడుతూ, సల్వాజుడుం నాయకుడు మహేంద్రకర్మను మట్టిగరిపించి సల్వాజుడుంకు సమాధి కట్టారు. వీటి తర్వాత 2009లో 'ఆపరేషన్ గ్రీన్‌హంట్' పేరుతో రకరకాల పోలీస్ ఫోర్స్‌ను దింపారు. వాటిని సైతం విప్లవోద్యమం, ప్రజలు ప్రతిఘటిస్తూ ఓడించారు. ఆ తర్వాత

2014లో కేంద్రంలో అధికారంలోకి వచ్చిన బీజేపి విప్లవోద్యమాన్ని నిర్మూలించాలనే లక్ష్యంతో 'సమాధాన్' అనే పేరుతో దానిలో ఒక్కొక్క అక్షరానికి ఒక్కో అర్థాన్ని చెబుతూ, 2025 వరకు పోరాటాన్ని కూకటివేళ్ళతో పీకేస్తామంటూ, దేశంలో మన ఉద్యమ ప్రాంతాలన్నింటా ఆరున్నర లక్షల వివిధ రకాల పోలీసు ఫోర్సును మోహరించింది.

'విప్లవోద్యమ కంచుకోట'లంటూ సుకుమా, దంతెవాడ, బీజాపూర్ జిల్లాలనూ 'పైలెట్ ప్రాజెక్టు' పేరుతో 2 కిలోమీటర్లకు ఒక క్యాంపును వేస్తూ కార్పెట్ సెక్యూరిటీని విస్తరిస్తున్నారు.

ఒక్కమాట చెప్పనా అమ్మా! 1962లో ఛత్తీస్‌గఢ్‌లో 'బైలడిల్లా' అనే స్థలంలో ఇనుము క్వారీ మొదలైంది. దాన్ని జపాన్ దేశం పెట్టుబడిదారులు దండకారణ్యంలోకి విప్లవోద్యమం రాకముందు ప్రారంభించారు. విప్లవోద్యమం ఆరంభమయ్యాక ఇప్పటివరకు దండకారణ్యంలోకి పెట్టుబడిని కాకుండా ప్రజలు తమ 'ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని' నిలబెడుతూ, దాన్ని బలోపేతం చేస్తూ, విస్తరించడానికి ప్రయత్నిస్తున్నారు. అమ్మా! దండకారణ్యం తర్వాత జాతి ఉద్యమకారులను అణచివేయడానికి ఎక్కువ పోలీసు ఫోర్సును కేటాయించిన రాష్ట్రం జమ్ము కశ్మీరే.

అక్కడి జాతి ఉద్యమాన్ని రక్తపుటేరుల్లో ముంచుతున్నారు ఈ దోపిడీ పాలకులు. ఆ తర్వాత రెండో స్థానంలో ఛత్తీస్‌ఘడ్‌లోనే ఎక్కువ పోలీసు బలగాలు ఉన్నప్పటికి ఇక్కడి ప్రజలు పోరాటమే జీవితంగా, త్యాగాలే చిరునామాగా వెనకడుగు వేయకుండా పోరాడుతున్నారమ్మా. దండకారణ్యంలో 'జనతనసర్కార్'ను నాశనం చేయడం, ఇక్కడి ఖనిజసంపదను దోచుకోవడం కోసం ఈ పాలకులు చెయ్యని ఘోరమంటూ లేదమ్మా! కార్పెట్ సెక్యూరిటీ పేరుతో దగ్గర దగ్గర క్యాంపులు వేస్తూ, ఈ ప్రజలల్లో నుండి ఒక సెక్షన్ను వాడికి పునాదిగా మార్చుకోవడం కోసం రకరకాల పేర్లతో సంస్కరణలు తెస్తూ ప్రజలను చీలదీస్తున్నారు. శతృవు లంపెన్ యువతను చేరదీసి, స్వయం ఉపాధి పథకాల పేర్లతో ఇన్ఫార్మర్లుగా మార్చుకుంటున్నారు. రెండవసారి కూడా కేంద్రంలో అధికారంలోకి వచ్చిన బీజేపీ హిందూ, హిందీ, హిందూస్తాన్ అంటూ ఒకే దేశం-ఒకే భాష, ఒకే దేశం-ఒకే మతం, ఒకే దేశం-ఒకే పన్ను, ఒకే దేశం-ఒకే ఎన్నికలంటూ మోడీ హిందూమతాన్ని పూజించేవారే, హిందీ భాషను మాట్లాడేవారే భారతదేశంలో ఉండాలి అంటూ అటువైపుగా రాజ్యాంగాన్నీ, చట్టాలను సవరిస్తూ వాడి చుట్టంగా మల్చుకుంటున్నాడు.

నాన్నా! ఇక్కడి ఆదివాసీ ప్రజలు ప్రకృతినే ఆరాధిస్తారు. మూడు కాలాలలో సైతం వాళ్ళ పనులకు అనుగుణంగానే పండుగలను చేస్తుంటారు. వాళ్ళ పేర్లు కూడా దైనందిన జీవితంలో భాగంగానే ఉంటాయి. అడవిలో ఆహార సేకరణే వీళ్ళ జీవితంలో ఎక్కువగా ఉంటుంది. తోటి మనిషి కష్టాలలో ఉంటే ఆత్మీయంగా అక్కున చేర్చుకొని, సామూహికంగా సహాయం చేస్తుంటారు. కులవ్యవస్థలో ఒదిగిపోని వీళ్ళను ఇప్పుడు ఈ పాలకులు 'ఘర్ వాపసీ' పేరుతో బలవంతపు మతమార్పిడి చేస్తున్నారు. ఒకవైపు హిందూమతం, ఇంకోవైపు క్రిస్టియన్ మతం ఈ ప్రజల విశ్వాసాల మీద, వారి ఆచార కట్టుబాట్లమీద, అభిరుచుల మీద, భాష మీద, ఆహార అలవాట్ల మీద, విద్య మీద, సంస్కృతి సాంప్రదాయాల మీద దాడి చేస్తూ, వీరి సామూహిక జీవితాన్ని విచ్ఛిన్నం చేస్తున్నారు.

అమ్మా! ఇంకొక్క విషయం నీతో తప్పక చెప్పాలి. నీవు నన్ను దళం దగ్గరకు తీసుకుపోయి దళంలో మహిళలు, పురుషులు ఒకరినొకరు ఎలా గౌరవించుకుంటారో చూపెట్టేదానివి కదమ్మా! కామ్రేడ్స్ శాంతక్క, సత్యన్నలు భార్యాభర్తలుగా దళజీవితంలో ఎంత ఆదర్శంగా ఉంటారో చెబుతూ, 'ఈ లోకంలో మహిళలు, పురుషులు సమానంగా గౌరవించుకునే రోజులు వస్తే బాగుండు. అట్లాంటి రోజుల కోసం కొట్లాడాలి' అని చెప్పేదానివి కదమ్మా. 80వ దశకంలో విప్లవోద్యమం దండకారణ్యంలోకి వచ్చి పితృస్వామ్య బంధనాలను తెంచుకోవడానికి ఆదివాసీ మహిళలకు అడుగడుగున అండగా నిలిచింది. దుష్ట తెగ పెద్దలతో వారి కురీతులతో పోరాడుతూ, యువతులకు బతుకుపై ఆశలు నింపింది. వారికి ఊరటనిచ్చింది. వివాహిత మహిళల అర్ధనగ్న జీవితాలలో మార్పు తెచ్చేందుకు సాహసించింది. వారు పనికిరారంటూ పితృస్వామ్యం విధించిన నిషేధాలను సవాల్ చేసింది. ఉత్పత్తి కార్యక్రమాలలోనూ వారిని భాగం చేసింది. రాక్షస వివాహాలకు కాలం చెల్లిపోయిందని చెప్పి, పీడిత మహిళల పక్షాన నిలిచింది. వారిని పోరాటయోధులను చేసింది. మేనరికాల సాంప్రదాయాలలో బందీ అయిన మహిళల పక్షాన నిలిచి, మనసుకాని వారితో వివాహబంధం అవసరంలేదనీ, ప్రేమ వివాహాలను ప్రోత్సహించింది. మహిళలపై కుటుంబ హింసను ఖండించింది. స్త్రీ, పురుషుల సమానత్వాన్ని బలంగా ఎత్తిపట్టింది. మహిళా విముక్తి పోరాట బాటలు పరిచింది. స్త్రీ, పురుషుల మధ్య ప్రజాస్వామిక సంస్కృతి వర్ధిల్లడానికి నాంది పలికిందమ్మా!

అట్లా విప్లవోద్యమం చేసిన కృషి వల్ల గ్రామాలలో మహిళలు సంఘాలలో సంఘటితమయి, ఈ రోజు మహిళ తెగింపు, వారి పోరాట పటిమ చూస్తే ఒక్కొక్కసారి మమ్మల్నే ఆశ్చర్యచకితుల్ని చేస్తుందమ్మా! ఉత్పత్తిలో పశుపోషణలు, కుటుంబ బాధ్యతను మోయడంలో, క్రాంతికారి జనతనసర్కార్లను నడపడంలో, న్యాయ, విద్య, వైద్య, సాంస్కృతిక శాఖలను నడపడంలో ప్రతి పనిలో వారికివారే సాటి.

శతృవు తలపెట్టిన యుద్ధంలో భాగంగా ఇక్కడ గగనతలంలో మిలటరీ హెలికాప్టర్లు, ఉద్యమకారుల కదలికలను పసిగట్టడానికి సర్వేలు చేసి, మానవరహిత విమానాల మోతలతో ఇక్కడ ప్రజల బతుకులు తెల్లారుతున్నాయమ్మా. ఈ మధ్య కాలంలో మాపై డ్రోన్ దాడులు రెండుసార్లు జరిగాయమ్మా! అయినా ఇక్కడి ప్రజల మద్దతుతో ప్రజాకంచుకోటలోనే పదిలంగా ఉన్నామమ్మా. వీటితోపాటు, కార్పెట్ సెక్యూరిటీ క్యాంపుల నడుమా, తుపాకీ మోతలనడుమనే ఇక్కడి గ్రామాలు తెల్లారుతున్నాయి. గ్రామాలపై దాడులకు వచ్చిన శతృవుతో పోరాడుతూ, అరెస్టయిన వాళ్ళను విడిపించుకోవడం, బూటకపు ఎన్‌కౌంటర్లు, ఎన్‌కౌంటర్లలో అమరులైన వారి శవాల కోసం పదుల కిలోమీటర్లు నడిచివెళ్ళి స్టేషన్లు, పోలీసు క్యాంపుల దగ్గర రోజుల తరబడి నిలబడి చంటిపిల్లలను చంకనెత్తుకొని ఆకలి, దప్పికలు, నిద్రాహారాలు లేకుండా పోలీసులతో పోరాడి శవాలను స్వాధీనం చేసుకొని అంతదూరం నుండి మోసుకురావడం, విప్లవ సాంప్రదాయాలతో దహనం చేయడం లాంటి కార్యక్రమాలు ఇక్కడి మహిళలకు దైనందిన జీవితంలో భాగమయ్యాయి. వారి పోరాట పట్టుదలకు నిదర్శనంగా నిలిచాయి. ఇంతటితో వారి తెగువ ఆగలేదమ్మా!

ఈ రోజు దండకారణ్య విప్లవోద్యమంలో మహిళలు వివిధ

# అడవి తల్లి ఆవేదన

**కోటి**

అడవి తల్లి ఆగమౌతుందో
కదుపు కోతతో కుమిలి పోతుందో ॥అడవి॥

పాట పాడే కోయిలమ్మను
వేటగాడు కాటు వేస్తే
నాట్యమాడే నెమలి తల్లిని
నెత్తుటేరులో ముంచుతుంటే
ఆ నెత్తురును దోసిలొగ్గిందో
మొత్తుకోని మూగబోయిందో ॥అడవి॥

ఖనిజ సంపద కొల్లగొట్ట
కంపెనీలు కాలు బెడితె
కంటిరెప్పై కాచే బిడ్డలు
నెత్తుటి ముద్దయ్యిపోతే
ఆ ముద్దలాకు ముద్దుపెట్టిందో
యుద్ధభేరికి సిద్ధమయ్యిందో ॥అడవి॥

పోరుమల్లెలు రాలినాయని
గోరువంకలు గొల్లునేడ్చే
కొండకోనలు తండాలన్నీ
అండ ఏదని అలమటించే
ఆ కొండలాకు జెండ నిచ్చిందో
బండలతో దండుకట్టిందో ॥అడవి॥

చీమలను ఏకంగ నిలిపి
పాముపైకి పంపినట్టు
ఆకులను బాకులుగ జేసి
దోపిడిని యడబాప జూపే
ఆకురాలితే శోకమయ్యిందో
కొత్తచిగురుకు సత్తువయ్యిందో ॥అడవి॥

స్థాయిల్లో నాయకత్వం వహిస్తున్నారు. సాంస్కృతిక సారధులుగా, కంప్యూటర్లును నడిపే ఆపరేటర్లుగా, కమ్యూనికేషన్ సిబ్బందిగా, డాక్టర్లుగా, టీచర్లుగా, ఇన్‌స్ట్రక్టర్లుగా, ఇంటలిజెన్సీ బాధ్యులుగా, విప్లవ ప్రజా ప్రభుత్వాన్ని నడిపే నాయకురాళ్ళుగా అన్నీ రంగాలలో రాణిస్తూ, 'ఆకాశంలో సగం-పోరాటంలో సగం' అంటున్నారు. దండకారణ్య విప్లవోద్యమంలో సగభాగం మహిళలే ఉన్నారమ్మా. కొన్ని రంగాలలో అయితే పురుషులకంటే మహిళల సంఖ్యే ఎక్కువమ్మా. అప్పుడు దళాలలో ఒక్కరిద్దరు మహిళల్ని చూసి మురిసిపోయిన నీవు, ఇక్కడ ఇంతమంది మహిళల్ని చూస్తే ఇంకెంత మురిసిపోతావో!

నాన్నా! ఈ మధ్య తెలంగాణ డీజీపీ "విప్లవోద్యమంలో నాయకత్వం వయస్సు పైబడి నడవలేని స్థితిలో, మాట్లాడలేని స్థితిలో ఉన్నారనీ, వీళ్ళను మంచాలలో మోసుకుపోతున్నారనీ, వీళ్ళందరికీ వైద్యం అందక చనిపోతున్నారని, వాళ్ళు ఇప్పటికైనా ఆలోచించి లొంగిపోతే మానవతా దృక్పథంతో ట్రీట్మెంట్ చేయిస్తామని, వారికి మంచి జీవితాన్నిస్తామ"ంటూ తేనెపూసినకత్తిలాంటి మాటలు వల్లిస్తున్నాడు. ఇదే పోలీసులు 2021లో మన కామ్రేడ్స్ గద్దం మధుకర్, కమాండర్ గంగాల్ అనారోగ్యంతో ట్రీట్మెంటు పోతే సమాచారంతో వాళ్ళను అరెస్టు చేసి, ట్రీట్మెంట్ పేరుతో చంపిన కుటిలనీతి ప్రజలందరూ చూసారు. నాన్నా! మోదీ, అమిత్‌షా, రాజ్‌నాథ్‌సింగ్, వాళ్లను నడుపుతున్న పెట్టుబడిదారులు, సామ్రాజ్యవాదులు కలిసి 2022-2025 వరకు విప్లవోద్యమాన్ని నిర్మూలిస్తామంటూ 'సమాధాన్' దాడిలో భాగంగా 'అగ్నిపథ్' లాంటి పోలీస్ రిక్రూట్మెంట్లు చేస్తున్నారు. లక్షల్లో కూడా ఈ పేదరైతుల బిడ్డలే చేరుతున్నారు. కానీ దేశంలో 140 కోట్ల జనాభాలో మెజారిటీ ప్రజలు పేదవాళ్ళేకదా! వాళ్ళే విప్లవంలోకి వస్తారు.

విప్లవ చరిత్రలో నగ్జల్బరీ, శ్రీకాకుళం, జగిత్యాల పోరాటాలను తుడిచిపెట్టామనుకున్నాయి ఈ ప్రభుత్వాలు. కానీ ఆ ఉద్యమాల నుండి అనుభవాలు, గుణపాఠాలు తీసుకున్న విప్లవోద్యమం, ఈ రోజు దేశవ్యాప్తంగా విస్తరించి దండకారణ్యంలో 40 ఏండ్లనుండి ప్రజలు జల్, జంగల్, జమీన్ మీద అధికారాన్ని సాధించుకొని ఇజ్జత్, అధికారం అనే దాన్ని నిలబెట్టుకొని, దాన్ని బలోపేతం చేసుకుంటూ విస్తరించడానికి పోరాడుతున్నారు. వాళ్ళు ఈ రోజు పోరాటంలో ముందు భాగాన నిలబడ్డారు. ఈ 40 ఏండ్ల పోరాట ఫలితాలను వదులుకోవడానికి వాళ్ళు సిద్ధంగా లేరు నాన్నా.

ప్రపంచ విప్లవాల చరిత్రలోని ఓటమి-గెలుపు-అంతిమంగా ప్రజలదే గెలుపు అనే సత్యాన్ని ముందుంచుకొని అనుభవాల నుండి గుణపాఠాలను తీసుకుంటూ, అమరుల ఆశయాలను ముందుకు తీసుకుపోతున్నారు.

అమ్మా, నాన్న! మీరు చిన్నప్పటినుండి మాకు అందించిన విప్లవస్ఫూర్తితో మేము పోరాటంలో ముందుకే పయనిస్తున్నాము. మీరు ఎన్నో చిత్రహింసలకు, కష్టనష్టాలకు గురయ్యినప్పటికీ విప్లవపక్షాన్నే నిలబడ్డారు. ఎప్పటికీ మీరు విప్లవకారులే. ఇప్పుడు మీ వయసు కూడా పెరిగి ఉంటుంది. అయినా మీరు దిగులు చెందకండి. మీ విప్లవ వారసత్వాన్ని మేము, ఇక్కడి ప్రజలు అందుకొని ముందుకు వెలుతున్నాము. మీ విప్లవ వారసత్వాన్ని మేము, ఇక్కడి ప్రజలు అందుకొని ముందుకు వెళుతున్నాము. మేము విప్లవంలో మునుముందుకే సాగాలనీ, మరిన్ని విజయాలు సాధించాలని మమ్మల్ని ఆశీర్వదించండి.

ఇక్కడ కామ్రేడ్స్ అందరూ బాగానే ఉన్నారు. ఇక ఉంటాను మరి

విప్లవాభివందనాలతో..

మీ బిడ్డ.

గత సంచిక తరువాయి...
14వ భాగం

# విప్లవోద్యమ విస్తృతినంతా నవల చిత్రించాలి

## అల్లం రాజయ్యతో ఇంటర్వ్యూ

**35. మిగతా ప్రక్రియలకంటే నవలా విమర్శ అభివృద్ధి చేసుకోవాల్సిన పరికరాలు ఏమిటి?**

సాహిత్యంలోని మిగతా ప్రక్రియలకన్నా నవలా విమర్శ భిన్నమైనదని నేననుకోవడం లేదు. మిగతా ప్రక్రియల విమర్శలాగే నవలా విమర్శ గతితార్కికంగా చారిత్రికంగా క్షేత్ర స్థాయి అధ్యయనంతో ఎప్పటికప్పుడు విప్లవోద్యమంలో మిగతా సాహితీ ప్రక్రియల విమర్శలాగే భాగం కావాలి. అప్పుడే అది అభివృద్ధి చెందుతుంది.

సాహిత్య రచనకు ఉండే చారిత్రిక పరిస్థితుల ప్రాతిపదిక మీద ఆ సాహిత్యాన్ని మార్క్సిస్టు విమర్శ విశ్లేషిస్తుంది. అదే సమయంలో మనం సాహిత్యాన్ని అధ్యయనం చేస్తున్న చారిత్రిక పరిస్థితులను కూడా పరిగణలోకి తీసుకుంటుంది. జార్జిలూకాస్ లాంటి వాళ్లు చెప్పినట్లు ఈ రెంటినీ పరిగణనలోకి తీసుకోకుంటే విమర్శ అసంపూర్తిగా ఉంటుంది. సాహిత్యకారులకు మావో ఏ ఉపకరణాలను చెప్పారో అవే సాహిత్య విమర్శకు వర్తిస్తాయి. అవి 1. వర్గ దృక్పథం 2. వైఖరి 3. పాఠకులు 4. కృషి 5. అధ్యయనం.

లెనిన్ టాల్‌స్టాయ్ గురించి రాసిన అయిదు వ్యాసాలు, గోర్కీ గురించిన వ్యాసం నేటికీ నవలా విమర్శకు ప్రామాణికాలు.

తెలుగు నవల విమర్శ అభివృద్ధి కావడానికి మద్దుకూరి చంద్రశేఖర్‌రావు, చంద్ర రాజేశ్వరరావు, కొండపల్లి సీతారామయ్య, నల్లా ఆదిరెడ్డి దాకా చాలా మంది విప్లవోద్యమంలో భాగంగా ఎప్పటికపుడు చేసిన సాహిత్య విమర్శ దోహదం చేసింది. కొడవటిగంటి కుటుంబరావు, త్రిపురనేని మధుసూదనరావు, కె.వి. రమణారెడ్డి, వరవరరావు, రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, చెంచయ్య, కాత్యాయని విద్మహే, వేణుగోపాల్, పాణి, గుర్రం సీతారాములు లాంటి వాళ్లు సాహిత్య విమర్శ అభివృద్ధిలో ఉన్నారు. యాభైయేండ్ల కథ, నవల మీద వర్గపోరాట నేపథ్యంలో వరవరరావుగారు మార్క్సిస్టు-లెనినిస్టు పద్ధతిలో విమర్శను అభివృద్ధి చేశారు. ఇదంతా కలుపుకున్నా విప్లవ నవల మీద వచ్చిన విశ్లేషణ, విమర్శ చాలా తక్కువ. అది క్షేత్రస్థాయి విప్లవోద్యమాల నుండే, విప్లవ విమర్శకుల నుంచే ఎక్కువ భాగం వచ్చింది. కాని బయటి పత్రికల్లో, యూనివర్సిటీల్లో విప్లవ నవల మీద శాస్త్రీయ విశ్లేషణ చాలా పరిమితం.

**36. మొత్తంగా చూస్తే ప్రగతిశీల సాహిత్యం వచన కవిత్వంలాగా నవలను ఇప్పటికీ ప్రధాన వాహిక చేసుకోలేదేమో అనిపిస్తుంది? ఎందుకంటారు?**

నిర్మాణం రీత్యా నవల విస్తృతమైంది. ప్రక్రియ రీత్యా మిగతా సాహిత్య ప్రక్రియకన్నా పెద్దది. బహుముఖమైనది. కవిత్వం ప్రధానంగా ఉద్వేగాలకు సంబంధించింది. ప్రక్రియ రూపం రీత్యా చిన్నది. సాధారణంగా ప్రగతిశీల రచయితలు, కవులు చదువుకున్న పెటీ బూర్జువా వర్గం నుంచి ఎక్కువగా వస్తారు. యువకులు చాలామంది సులభంగా చిన్నదిగా ఉన్న కవిత్వాన్నే మొదట ఆశ్రయిస్తారు. యువ కారల్ మార్క్స్ మొదట కవిత్వమే రాశారు. నవలా రచయితలు కూడా మొదట కవిత్వంతోనే ఆరంభమౌతారు. కనుక అతి తక్కువమంది తమ అనుభవం రాయడంలో మెలుకువలు సాధించి, రాయడానికి తగిన వస్తువు సమయం సమకూరినవాళ్లు, తమ స్థలకాలాల మార్పు వలన తీవ్రమైన ఒత్తిడికి లోనైనవాళ్లు, సాధారణంగా నవలలు రాయడానికి పూనుకుంటారు. ప్రజా పోరాటాల నుంచి నవలలు రాయాలనుకునేవారికి నవలా నిర్మాణం సాధించడం కష్టమైనవి. అందుకనే ఎక్కువగా కవిత్వం రాస్తారు. విప్లవోద్యమంలో అంత పెద్ద ప్రక్రియ రాయడం కష్టసాధ్యమైన పని. అందుకోసం సమయ సందర్భాలు అనుకూలించడం అరుదు.

నవల రాయడం, ప్రచురించడం, పంపిణీ చేయడం ఇప్పటికీ ప్రగతిశీల నవలాకారులకు చాలా శ్రమతో కూడుకున్న పని. ఎంతో శ్రమకోర్చి రాసిన నవలలను దాదాపుగా రచయితలే ప్రచురించుకోవాలి. ప్రచురించుకున్నా పంపిణీకి పుస్తక విక్రయ సంస్థలను ఆశ్రయించాలి. కవిత్వానికి ఇంత శ్రమ ఉండదు.

పాశ్చాత్య దేశాల్లో నవలలు రాసి బతికేవాళ్లున్నారు. ఇక్కడ ప్రగతిశీల నవలలు రాయడమంటే అన్నీ పోగొట్టుకోవడమే. కనుక

ఎంతో నిబద్ధత కలిగినవారు తప్ప ప్రగతిశీల నవలలు రాయడం అసాధ్యం.

పి. చంద్ రాసిన పది నవలలు ఇప్పటికీ ప్రచురణకు నోచుకోలేదు. అవి ప్రగతిశీల ఉద్యమాలను విస్తృతంగా చిత్రీకరించినవి నవలలే. విప్లవోద్యమాలు తమకు వీలైనమేరకు నవలలను ప్రచురించి పంపిణీ చేయడానికి ప్రయత్నిస్తూనే ఉన్నాయి. కానీ, ఆ ప్రయత్నం సరిపోదు. నాకు తెలిసి కవిత్వంకన్నా కథలు, నవలలే విప్లవోద్యమాన్ని ప్రధానంగా చిత్రిస్తున్నవి. ప్రధాన వాహికగా కొనసాగుతున్నవి.

**37. నవలకు సంబంధించిన ఈ ఇబ్బందికి తెలుగు సామాజిక, పఠన సంస్కృతిలో మూలాలున్నాయా? లేక మన కాల్పనిక రంగానికే ఈ ప్రత్యేకతలున్నాయా?**

విప్లవ సాహిత్యాన్ని రాశిలో కాకుండా వాసిలో చూడాలంటారు మావో. ప్రక్రియలను కూడా ఈ పద్ధతిలో అర్థంచేసుకుంటే ఈ సమస్య మీద సరైన అంచనాకు రాగలం. తెలుగు పఠన సంస్కృతి అనేక రకాల కారణాల రీత్యా పెరుగుతున్నది.

యాభై సంవత్సరాలుగా తెలుగు ప్రజానీకానికి విప్లవోద్యమాల అనుభవం ఉన్నది. వీళ్లందరికీ సాహిత్యం అందుబాటులోకి వచ్చేలాగా నిర్మాణం పెరుగలేదు. విప్లవ పాఠకులను విప్లవోద్యమం పెంచుకోవాలి. సాహిత్యం తన నాణ్యతను పెంచుకోవాలి. రెండూ ప్రయత్న పూర్వకంగా, ప్రణాళిక బద్ధంగా చేయాల్సినవి. అన్ని రంగాల్లో ఉన్నట్లే నవలా రచన, ప్రచురణ, పంపిణిలో కుల, వర్గ, లింగ, ప్రాంతీయ ప్రత్యేకతలు ఉన్నాయి. ఇవి భావజాల రంగంలో ఘర్షణ, ఐక్యత రూపంలో పరిష్కారం అవుతాయి.

**38. సాహిత్యంలో ముఖ్యంగా కథ, నవలా రచనలో మూలాల అన్వేషణ అనే ధోరణి ఉన్నది. దీన్ని మీరు ఎలా విశ్లేషిస్తారు?**

వర్గ పోరాటంలో గతితార్కిక చారిత్రక అధ్యయనం మూల ధాతువు. వర్గపోరాటం అంతకుముందున్న దాన్ని మార్చి దాని స్థానంలో కొత్తదాన్ని ఆవిష్కరిస్తుంది. నశించి పోయేదాన్ని పురోగమించే దాన్నుంచి, ఆ రెంటికీ మధ్య వైరుధ్యాల ఘర్షణ నుంచి కొత్తది అర్థం చేసుకుంటుంది. వర్గపోరాటంలో మూలాల అన్వేషణ ఒక భాగం. మూలాల అన్వేషణ అంటే పాతదాని స్థానంలో కొత్తదాన్ని నెలకొల్పడానికి, మార్చడానికి జరిగే సంఘర్షణ. మూలాలు అన్వేషించడమే వర్గ పోరాటం కాదు. విప్లవోద్యమ కథ, నవల సహజంగానే పాత కొత్తల సంఘర్షణను చిత్రించడంతో రూపొంది ప్రాణం పోసుకున్నాయి. కనుక ఈ రెండు సాహిత్య ప్రక్రియల్లో మూలాలు అన్వేషించడం చిత్రించడం అవసరమైనచోట కనిపిస్తుంది.

కుల, వర్గ, లింగ, ప్రాంతీయ, జాతి, ఆదివాసి, దళిత, మతమైనారిటీలు కలిసి కొనసాగుతున్న భూస్వామిక సమాజంలో వాటి రాజకీయ స్వరూపమైన అర్ధవలస, అర్ధభూస్వామిక ఉత్పత్తి సంబంధాలు మార్చే క్రమంలో ఈ వైరుధ్యాలన్నీ ముందుకు వస్తాయి. ప్రధాన వైరుధ్యం భూస్వామ్యానికి- అశేష పీడిత ప్రజానీకానికి మధ్య అనుకున్నప్పుడు ఈ వైరుధ్యం పరిష్కారంలో మిగతా వైరుధ్యాల మూలాలను అధ్యయనం చేయాలి. వాటి గతి క్రమాన్ని అర్థం చేసుకుని ఐక్యత, ఘర్షణల ద్వారా విప్లవోద్యమాన్ని పురోగమింపజేయాలి. ఈ మొత్తం క్రమం వ్యక్తిలో, సమాజంలో ప్రతిఫలించినపుడు అది కథల్లో, నవలల్లో ప్రతిబింబిస్తుంది. వైరుధ్యాలను సమన్వయం చేసుకుని ముందుకు సాగుతుంది. ఈ విధంగా విప్లవ కథ, నవలల్లో మూలాల అన్వేషణ కూడా భాగం.

**39. మూలాల అన్వేషణను కూడా సామాజిక భావజాల సందర్భం ప్రేరేపిస్తుంది కదా. ఇప్పుడు అలాంటిది ఉన్నదా?**

మూలాల అన్వేషణ ఒక కాలానికో, సందర్భానికో సంబంధించినది కాదు. వైరుధ్యాలను పరిష్కరించడానికి మూలాల అన్వేషణ కొంత మేరకు సమగ్రతను తెస్తుంది. కారల్ మార్క్స్ పాత సమాజ మూలాలను అన్వేషించి అప్పటికి అస్తిత్వంలో ఉన్న ప్రపంచానికంటే కొత్తది రూపొందుతున్న క్రమాన్ని సిద్ధాంతీకరించారు. తద్వారా చరిత్రంతా వర్గ పోరాటాల చరిత్రగా నిర్ధారించారు. వర్గాలు, వర్గపోరాటాలున్నంత వరకూ ప్రకృతికి, మానవులకు మధ్య నిరంతరం జరిగే సజీవ సంభాషణలో భాగమే మూలాల అన్వేషణ. కనుక మార్పు క్రమంలో మూలాల అన్వేషణ ఒక అనివార్యమైన విషయం.

**40. తెలుగు నవలల్లో ఉన్న మూలాల అన్వేషణకు మీ నవలలు పూర్తి భిన్నం. కొమురం భీం కూడా గతకాలపు ప్రజల గురించి చెప్పినట్లుగా కాకుండా రూపొందుతున్న వర్తమాన పోరాట ప్రపంచాన్ని చిత్రీకరించినట్లు అనిపిస్తుంది. విప్లవ నవలలన్నీ వర్తమానంలో నిలబడి భవిష్యత్తులోకి విస్తరిస్తాయి. దీన్ని మూలాల అన్వేషణతో పోల్చి ఎలా చెప్పవచ్చు?**

మూలాల అన్వేషణ గతకాలానికి సంబంధించినదని, మూలాల అన్వేషణ దానికదే స్వతంత్రమైనదనే ధోరణి కొందరికి ఉంటుంది. ఇ. హెచ్. కార్ చెప్పినట్లుగా చరిత్రను సమకాలీన సందర్భంలోంచి ప్రజలు వ్యాఖ్యానించుకుంటారు. చరిత్ర కాలానికి మాత్రమే సంబంధించినది కాదు. నా నవలలన్నింటిలో మూలాల అన్వేషణ వర్గ పోరాటం నేపథ్యంలో జరిగింది. వర్తమానంలో నుంచి భవిష్యత్తును నిర్మించే క్రమంలో గతం లేకుండా జరగదు. గతం పునాదుల మీదనే వర్తమానం నిలబడి ఉంటుంది. గతం అంటే చరిత్ర. ఈ దృష్ట్యా నా నవలలన్నీ కూడా గత, వర్తమాన, భవిష్యత్తుల సమారోహం. ఎందుకంటే ఆ నవలలు విప్లవోద్యమం నిర్మాణమై పురోగమించే క్రమంలో రూపొందినవి. విప్లవోద్యమాలలో, విప్లవ నవలల్లో, కథల్లో గతం కూడా ఉంటుంది. విస్తృత అర్థంలో వర్గ పోరాట దృష్టితో మూలాల అన్వేషణ ఉంటుంది. అది దేనికంటే వర్తమానాన్ని అర్థం చేసుకోడానికి. భవిష్యత్తును నిర్మించడానికి. మూలాల అన్వేషణ పేరుతో గతంలోకి వెళ్లిపోవడం అంటే భావవాదానికి లోనుకావడమే. గతితార్కిక, చారిత్రక దృక్పథంలో మూలాల అన్వేషణ అంటే భవిష్యత్ నిర్మాణంలో భాగం. అప్పుడే నవల కూడా భవిష్యత్తు దిశగా సాగుతుంది. నా నవలల్లో, విప్లవ నవలల్లో ఇది ఉంటుంది.

**పాత్రల ఆలోచనలను, దుఃఖాలను, పనిని, ప్రేమను, తప్పుల్ని చూపడం అంత తేలిక కాదు. ఈ చిత్రణ సాహిత్య రచనకు సాధనం కాదు. ఇదే అసలు సాహిత్య లక్ష్యం. వీటిని చూపగలిగితే పాఠకులు ఆ రచనలోని పాత్రనే కాదు, తనను తాను అర్థం చేసుకుంటారు. తనకున్న కొద్దిపాటి జీవితంలో రచయిత అనేక జీవితాలను జీవించాలి. ప్రజల హృదయాలలో ఉత్సాహం రేకెత్తించాలి. అలా చేయడానికి మనవుల ఆంతరంగిక ప్రపంచంలోకి వెలుగును ప్రసరించి పరిశీలించాలి. ఆ పాత్ర జీవించడానికి రచయిత తోడ్పడాలి.**

**41. రచయితలకు జీవితానుభవం లేకపోవడం వల్లే తెలుగు నవల బలహీనంగా ఉందనే అభిప్రాయం ఉంది. అసలు జీవితానుభవం లేకపోవడం అనేది ఉంటుందా? విప్లవ నవలా సందర్భంలో అనుభవాన్ని ఎలా చూడాలి?**

ఏ కారణం చేతనైనా కానీయండి రచయిత తనకు తెలియని ప్రజలనుగానీ, తను అర్థం చేసుకోలేని ప్రజలను గానీ చిత్రిస్తే తప్పకుండా ఆ రచన విఫలమై తీరుతుంది. ఒకానొక రచయిత విజయాన్నో, విఫలతనో విశదీకరించించే విమర్శకులు, కళాత్మక రచన ఎలా పుట్టిందో దానికి సంబంధించిన సమస్యలపై విశ్లేషణ ఇస్తున్నారా? లేదు.

రచయితలు దేనిపైబడితే దానిపై, ఎవరిపై బడితే వారిపైన రాయలేరు. విషయాన్ని ఎన్నుకోవడంలోనూ, పాత్రలను ఎన్నుకోవడంలోనూ రచయితలకు (వారు అందరికన్నా గొప్పవారైనా కూఢా) కొన్ని అడ్డుగోలున్నాయి. రచయితలు తాము నివసించే సమాజం చేత ప్రభావితం అవుతారని, రచనలు కూడా అలాంటి ప్రభావంలో వస్తాయని అందరికీ తెలుసు. కానీ, రచయితలు తమ అనుభవం చేత, తన ప్రవర్తన చేత కూడా ప్రభావితులై రచన చేస్తుంటారు. అప్పుడు తమ అనుభవానికున్న ప్రత్యేకత ఏమిటో, పరిమితి ఏమిటో తెలిసి ఉండాలి. లేకపోతే అదే సత్యం అనుకొనే ప్రమాదం ఉంది.

తమతోటి పౌరులకన్నా, సమకాలీనులకన్నా రచయితలు బాగా తెలుసుకోవాల్సింది మానవుల ఆంతరంగిక ప్రపంచం. ఒక పాత్ర ఆకారాన్ని, దాని పరిసరాలను వర్ణించడానికి వారు నివసించే ఇల్లుకానీ, పనిచేసే ప్రదేశంగానీ తెలియాలి. అది అంతకష్టమైన పనేమికాదు. అలాంటి వర్ణనలు సాధనాలేగానీ లక్ష్యాలు కావు. మౌలికంగా మనం చిత్రించే పాత్రల ఆలోచనలను, దుఃఖాలను, పనిని, ప్రేమను, తప్పుల్ని చూపడం అంత తేలిక కాదు. ఈ చిత్రణ సాహిత్య రచనకు సాధనం కాదు. ఇదే అసలు సాహిత్య లక్ష్యం. వీటిని చూపగలిగితే పాఠకులు ఆ రచనలోని పాత్రనే కాదు, తనను తాను అర్థం చేసుకుంటారు. తనకున్న కొద్దిపాటి జీవితంలో రచయిత అనేక జీవితాలను జీవించాలి. ప్రజల హృదయాలలో ఉత్సాహం రేకెత్తించాలి. అలా చేయడానికి మనవుల ఆంతరంగిక ప్రపంచంలోకి వెలుగును ప్రసరించి పరిశీలించాలి. ఆ పాత్ర జీవించడానికి రచయిత తోడ్పడాలి.

సోవియట్ విమర్శకుడు 'ఇల్యా ఎహ్రెన్‌బర్గ్' రచయితా శిల్పంలో ఉండే సంబంధాలను విశ్లేషించాడు.

వ్యక్తిగత అనుభవం సమిష్టి అనుభవంగా సామాజిక అనుభవంగా, అంటే మార్క్సిస్టు, లెనినిస్టు అనుభవంగా రూపొందే క్రమమే వర్గ పోరాటం. వర్గపోరాట నేపథ్యంలోనే విప్లవోద్యమ నవలలు రూపొందుతాయి. భావవాద నవలలకు గతితార్కికత అనుభవం పునాదిగా ఉండదు. స్వీయాత్మక లక్ష్యాలతో, అనుభవంతో రాస్తారు. మార్క్సిస్టు, లెనినిస్టు దృక్పథం లేకపోవడం వలన నవల అంగాలను, పాత్రల భావోద్వేగాలను నమపాళ్లల్లో నిర్వహించకపోతారు. తన పాఠకులెవరో ఎంచుకోకపోవడం వలన విఫలమవుతారు. వైయుక్తికత జీవితానుభవం, సమిష్టి జీవితానుభావం అందరికీ ఉంటుంది. వీటి మధ్య గతితార్కిక అనుభవం వర్గపోరాటం ద్వారా సాధ్యమౌతుంది. గతతార్కిక అనుభవం లేనివారు విప్లవ నవల రాయలేరు. ఒక వ్యక్తిగత అనుభవం అది ఎంత పెద్దదైనా సరే అది నవలలకు పునాది కాదు.

**42. అపార వైవిధ్యభరిత అనుభవం ఉన్న దళిత, ముస్లిం, స్త్రీ వాదాల నుంచి వస్తున్న నవలలను ఈ దృష్ట్యా ఎలా అంచనా వేయాలి?**

దళిత, ముస్లిం, స్త్రీవాద రచయితల వైవిధ్యభరిత అనుభవమంతా సామాజిక అనుభవమే. అది విప్లవోద్యమం ద్వారానే గతితార్కిక చారిత్రక అనుభవంగా మారడం మొదలైంది. వర్గపోరాటం, సమాజాన్ని మార్చే ఆచరణ క్రమంలేకుండా సామాజిక అనుభవంలో చలనం వేగవంతం కాదు. దళిత, స్త్రీవాద నవలలు ఎక్కువ సంఖ్యలో వచ్చాయి. ఇంకా వస్తున్నాయి. మతమైనారిటీల భాష సమస్య మూలకంగా తెలుగులో తక్కువగా వచ్చాయి. ఇటీవల స్కైబాబా 'అధా', షహజానా 'మేరాజహా' నవలలు వెలువడ్డాయి. ఉర్దూలో, హిందీలో పెద్దసంఖ్యలో మతమైనారిటీల నవలలున్నాయి.

దాదాపుగా ఎక్కువ నవలలు ఆయా సమూహాల గత, వర్తమానాల గురించే వచ్చాయి. అయితే అవి దృగ్గోచర విషయాలకు చాలా వరకు పరిమితమయ్యాయి. వర్గపోరాటంలో భాగస్వామ్యం పెరిగిన కొద్ది 'సారం' గుర్తించిన నవలలు వస్తాయి. ఉర్దూలో, హిందీలో అలాంటి కథలు, నవలలు వచ్చాయి. బ్రాహ్మణీయ, భూస్వామిక సమాజంలో దళితులకు, ఆదివాసులకు, మహిళలకు చరిత్ర లేకుండా చేశారు. వక్రీకరించారు. నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమాల్లో భాగంగానే ఈ చరిత్ర అన్వేషణ వేగవంతమైంది. తలకిందుల చరిత్రను సీదా నిలబెట్టే ప్రయత్నం జరుగుతోంది. 'అంటరాని వసంతం' కళ్యాణరావు నవల ఇందుకు తార్కణం. 'అగ్నికణం', 'అడవి పుత్రిక', 'రాగో' మహిళల చరిత్రను విప్లవోద్యమంలో భాగంగా చిత్రించాయి. భారతీయ సమాజంలో వీళ్లందరూ విప్లవానికి చోదక శక్తులు. ఉత్పత్తి శక్తుల్లో అట్టడుగున కీలకమైనవారు. వర్గపోరాటంలో వారి చరిత్ర అత్యంత ముఖ్యమైన భాగం. కొన్ని అంతర్గత మిత్ర వైరుధ్యాలున్నప్పటికీ, ఉత్పత్తి సంబంధాలలో భాగమైన రాజ్యం, సాహిత్యం, కళలు వాళ్లను ఇంతకాలం అంటరానివాళ్లుగా చూశాయి. నూతన ప్రజాస్వామిక

విప్లవోద్యమం వాళ్ల చరిత్రను అర్థంచేసుకున్నది. విప్లవోద్యమంలో దళితులు, మహిళలు, ఆదివాసీలు ఇప్పుడు కీలమైన, నమ్మదగిన చోదక శక్తులు. వాళ్లు ప్రత్యేక శ్రద్ధతో వర్తమాన చరిత్రను శ్రామిక వర్గ దృక్పథంలో రాస్తున్నారు. దళితుల, మహిళల, ఆదివాసీల, మతమైనారిటీల వర్గ పోరాటాల వీరోచిత గతితార్కిక చరిత్రను పునర్నిర్మిస్తున్నారు. విప్లవోద్యమ జీవితంలో సగభాగమున్న మహిళల వీరోచిత చరిత్ర నేపథ్యంలో చాలా నవలలు రావాలి.

ఆదివాసీలు ఇంకా నవలను తమ పోరాటంలో భాగంగా చిత్రించే స్థాయిలో లేరు. ఇది నిర్మాణపరమైన సమస్యేగాని, అనుభవానికి, పోరాటానికి సంబంధించినది కాదు.

ఇప్పుడు వాళ్లు నవలలు రాసేస్థితికి చేరుకున్నారు. ప్రయత్నం, కృషి ఉంటే పోరాట రంగంలో రాటుదేలిన ఆదివాసీలు నవలలు రాయగలరు. బహుశా దళితులు, మహిళలు, బహుజనులు, ఆదివాసీలు, మతమైనారిటీ సమూహాల నుంచే గతితార్కిక చారిత్రక దృష్టితో రాబోయే రోజులలో ఎక్కువగా వచ్చే అవకాశం ఉంది.

**43. ఇవాళ ప్రగతిశీల నవల పరిస్థితిని ఎలా అంచనా వేయవచ్చు?**

నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమంలో ఆయుధం కావాల్సిన ప్రగతిశీల నవల దీర్ఘకాలిక విప్లవోద్యమ లక్ష్యాలతో ఎదగాల్సినంత ఎదుగలేదు. ఇప్పటికీ ప్రగతిశీల నవల దృగ్గోచర విషయాలనే ఎక్కువ చిత్రిస్తోంది. పరిమాణాత్మక, ప్రాప్త కాలజ్ఞ పోరాటాలనే ఎక్కువ భాగం చిత్రిస్తున్నది. మార్క్సిజం-లెనినిజం భారతీయ గతితార్కిక చరిత్ర అధ్యయనంలో రచయితలు ఎదగాల్సినంత ఎదగలేదు. రైతాంగం నుంచి, కార్మిక వర్గం నుంచి, దళితుల, మహిళల నుంచి, ఆదివాసుల నుంచి, విద్యార్థుల నుంచి, వర్గపోరాటంలో రాటుదేలినవారి నుంచి నవలలు రావాల్సి ఉంది. శిక్షణ, పట్టుదల, రాయాలనే తపన ఉంటే నవలలను కూడా పోరాట ఆయుధంగా ఎంచుకుంటే ఈ అంతరం పూడుతుంది. వస్తువుతోపాటు మిగతా నవలా నిర్మాణ అంశాల్లో తగినంత అధ్యయనం జరుగలేదు. వస్తువు, భాష విషయంలో మూస ధోరణి కనిపిస్తుంది. క్షేత్రస్థాయి అనుభవంలో, సిద్ధాంత అన్వయింపులో నవలా రచయితల సాధించాల్సింది ఎంతోవుంది.

ఎక్కువ మంది రచయితలు స్వీయాత్మక ధోరణిలోనే ఉన్నారు. సమిష్టి అధ్యయనం ద్వారా ప్రయత్నపూర్వకంగా ఈ ధోరణి అధిగమించాల్సిందే. మార్క్సిస్టు, లెనినిస్టు పద్ధతిని ఎప్పటికప్పుడూ వర్గపోరాటాల నేపథ్యంలో అధ్యయనం చేయాలి.

ఇలాంటి అన్ని రకాల ధోరణులను అధిగమించాలంటే గత యాభై సంవత్సరాల పోరాటాలను, నవల ప్రయాణాన్ని విశ్లేషించి, రూపొందుతున్న వర్గపోరాటం నేపథ్యంలో జాతీయ, అంతర్జాతీయ తాత్విక రాజకీయార్థిక పరిణామాలు, ప్రజాపోరాటాల నేపథ్యంలో మదింపు చేయాలి.

ఏదిఏమైనా ప్రగతిశీల నవల విప్లవ పోరాటాల విస్తృతికి, వేగానికి తగినట్లు విస్తరించాల్సి ఉన్నది.

రూపొందుతున్న, విస్తరిస్తున్న వర్గపోరాటంలో భాగంగా, విప్లవోద్యమ వ్యూహంలో భాగంగా ఎప్పటికప్పుడు ఎత్తుగడలు, అభివృద్ధి చెందుతున్న దృష్ట్యా నవలా వస్తువును, శిల్పాన్ని, భాషను ఆధునీకరించుకోవాలి. విప్లవీకరించుకోవాలి. అందుకు ప్రణాళికబద్ధంగా సమిష్టిగా విప్లవ నవల రచన పురోగమించాలి. ఎప్పటికప్పుడు కాలానుగుణంగా ప్రచురణ, పంపిణీ ద్వారా విప్లవ నవల ప్రజలకు చేరడానికి కృషి చేయాలి.

విప్లవోద్యమాలకు, విప్లవ నవలకు ఉన్న అంతరం తగ్గించడానికి విప్లవోద్యమానికి, విప్లవ నవలకున్న ప్రాధాన్యత రీత్యా ఎప్పటికప్పుడు సమీక్ష జరపాలి. విప్లవోద్యమంలోని అన్ని శక్తుల్లాగే రచయితలకు నిరంతర తర్ఫీదు అవసరం.

విప్లవోద్యమాలు దేశవ్యాప్తంగా విస్తరిస్తున్న దశలో కుల, వర్గ, లింగ, మత, ప్రాంతీయ వైరుధ్యాలను ఘర్షణ, ఐక్యత ద్వారా పరిష్కరించుకుంటూ ఏకమవుతున్న దశలో తెలుగు విప్లవ నవలలను ఇతర భారతీయ భాషల్లోకి అనువదించాలి. ఇతర భాషల నవలను తెలుగులోకి ఎప్పటికప్పుడూ అనువదించాలి.

విప్లవోద్యమపు సంపూర్ణ సృజనాత్మక, భావోద్వేగాల అద్భుతమైన వ్యక్తరూపం విప్లవ నవల. లక్షలాది, కోట్లాది పోరాడే ప్రజలకు అత్యంత శక్తివంతంగా, ప్రభావశీలంగా చేరుకోగల మహత్తర సాహిత్య ప్రక్రియ విప్లవ నవల. విప్లవ నవల విప్లవోద్యమపు తాత్విక, రాజకీయ, ఆర్థిక భావోద్వేగాల సజీవ దృశ్యకావ్యం. సమస్త సాహిత్య ప్రక్రియలకు అమ్మలాంటిది.

విప్లవ సాహిత్యానికి, ముఖ్యంగా కథ, నవలకు సంబంధించి అనేక దినాలు, రాత్రులు జ్ఞాత, అజ్ఞాత మిత్రులు పంచుకున్న అపూర్వ ఆలోచనలు మన ముందున్నాయి. మన కన్నాముందు మానవుల సుఖదుఃఖాలను, పోరాటాలను, సంపూర్ణంగా తమలో కలుపుకుని, వాళ్లందరినీ రూపుకట్టడానికి ఎందరో రచయితలు ప్రపంచవ్యాప్తంగా, భారతదేశంలో కృషి చేశారు. వాళ్లందరి అపూర్వ కృషిని పంచుకోవడం వలన నా కాలంలో, స్థలంలో ప్రపంచం తలమునకలవుతున్నది. అమరులైన ఎందరెందరో, ప్రస్తుత విప్లవోద్యమంలో నాతరం వాళ్లు, నా తర్వాతి తరాల వాళ్లూ ఈ కార్యకలాపాలలో కొనసాగుతున్నారు.

వాళ్లందరి ఆలోచనల్లో, ఆచరణలో, సృజనాత్మకతలోంచి ఇలాంటివి నా లోపల పోగుపడ్డాయని ఇంటర్వ్యూ చేసిన మిత్రులు కదిలించి కల్లోల పరిచేదాకా నాకూ తెలియదు.

ఏది ఏమైనా వేల మంది సుదీర్ఘ విప్లవోద్యమ సాహిత్య ప్రయాణాన్ని, ఆర్తిని, ముందుచూపును నేను నా అవగాహన మేరకు అర్థం చేసుకుని వ్యక్తీకరించాను. అందరూ విస్తృతంగా చర్చించాల్సిన విషయాలివి.

భౌతిక ఉత్పత్తులలోని సృజనాత్మకశక్తే భౌతికేతరమైన సాహిత్య కళారంగాలలోని సృజనకు మూలం. ఉత్పత్తి సమిష్టి కార్యాచరణ. అందువలన ఉత్పత్తి ఆధారంగా పుట్టిన సృజన కూడా సమష్టి స్వభావం కలదే.

సృజన శక్తి మొత్తాన్ని రచయితకు ఆపాదించడం, రచయిత సృజనాత్మక శక్తి వికాసానికి తోడ్పడ్డ సామాజిక నేపథ్యాన్ని గుర్తించకపోవడం వర్గ వ్యవస్థ అవలక్షణాలల్లో ఒకటి. వర్తమాన సామాజిక వాస్తవికత నుంచే సృజన వికసిస్తుంది. ఈ క్రమంలో వాస్తవ సంఘటనలు, వాటి పరిశీలన, అనుభవం, ఆయా రంగాల ప్రత్యేక పరిజ్ఞానం, సృజనాత్మక వికాసానికి ఉపకరిస్తాయి.



(అయిపోయింది)



# ఈ పుస్తకాలు చదివారా?




ఇక్బాల్ నాలుగు దశాబ్దాల నుండీ కవిత్వం రాస్తున్నారు. కొన్ని కథలు కూడా రాశారు. స్పందన (1985). సేద్యం (2011), రాహే (2018), జాబిలి ఖైదు (2019), దగ్ధ స్వప్నం (2020).. ఇవీ ఇక్బాల్ కవిత్వ సంపుటాలు. సాంగ్ ఆఫ్ ఫర్రోస్ (2017) తెలుగు నుండి అర్విని రాజేంద్రబాబు గారిచే ఇంగ్లీషులోకి అనువదించబడ్డ కవితా సంకలనం వెలువరించారు. కఫన్ అనే కథా సంపుటి (2007) ప్రచురించారు. ఇక్బాల్ మార్క్సిస్టు కవి, రచయిత. ఇప్పటిదాకా పేర్కొన్న మార్క్సిస్టు కవి లక్షణాలన్నీ ఇక్బాల్‌లో ఉన్నాయి. పెట్టుబడిదారీ సమాజం మార్క్సిజానికి కాలం చెల్లిందనే ప్రచారాన్ని ముమ్మరం చేస్తున్న సమయంలో భారతదేశంలోని కొన్ని ప్రగతిశీల శక్తులు సైతం, మార్క్సిజం భారతదేశానికి పనికిరాదని ప్రచారం మొదలుపెట్టిన తరుణంలో ఇక్బాల్ ఈ కవిత్వం రాశారు. తెలుగు మార్క్సిస్టు రచయితలు ఇతర ప్రగతిశీల సామాజిక వాదాలను సమన్వయీకరించుకుంటూనే మొక్కవోని మార్క్సిస్టు నిబద్ధతతో రచనలు చేస్తున్నారనడానికి ఈ సంపుటి “కల చెదరని స్వప్నం ఉదాహరణ”.

**కల చెదరని స్వప్నం**

ఇక్బాల్ కవిత్వం ప్రచురణ: పాలమూరు అధ్యయన వేదిక

వెల: 250/- రూ॥ పేజీలు: 318 ప్రతులకు: 9440775732

సిక్స్‌ప్యాక్
రాముడు
మరికొన్ని కథలు





పావని

పావని కథలు తాజాగా ఉంటాయి. వైవిధ్యభరితంగా ఉంటాయి. అవి ట్రాన్స్‌జెండర్‌లను పరిచయం చేస్తాయి. ఇప్పటి తరం ఆలోచనలను, సంఘర్షణలను వినిపిస్తాయి. రాయలసీమ గ్రామసీమల్లో జరుగుతున్న సామాజిక సాంస్కృతిక మార్పులను, గతాన్ని గురించిన వలపోతగా కాక ఒక పరిణామ క్రమాన్ని చూపిస్తాయి. సాహిత్యం చేసే పని మనుషుల్లో వివేకాన్ని, మానవీయతను తట్టిలేపడం. పావని తనదైన కథన పద్ధతిలో ఈ పని చేసారు. చాలా తేలికగా కథ నడుపుతూ మెల్లగా అసలు కథవైపు పాఠకుల్ని తీసుకెళ్తారు. ముగింపు ఆలోచింపజేస్తుంది. చాలా సంక్లిష్టమైన ఇతివృత్తాన్ని ఎన్నుకొని కూడా సులువుగా పాఠకులను కనెక్ట్ చేయడం ఈ కథల్లోని శిల్ప ప్రత్యేకత.

**సిక్స్‌ప్యాక్ రాముడు**

పావని కథలు ప్రచురణ: విరసం

వెల: 120/- రూ॥ పేజీలు: 108 ప్రతులకు: 9247253884

## హైదరాబాద్‌లో జరిగిన రెయిన్‌బో పుస్తకావిష్కరణ సభ

లైంగిక వైవిధ్యాలను గుర్తిద్దాం, గౌరవిద్దాం.

రెయిన్‌బో పుస్తకావిష్కరణ సభ

లైంగిక వైవిధ్యాలు

అధ్యక్షత: రామచంద్రం

వక్తలు: రచన ముద్రబోయిన, తాషి చౌడొప్, వరలక్ష్మి

ఏప్రిల్ 2023, ఆదివారం, సాయంత్రం గం॥ 5-30ని॥లకు

...రయ్య విజ్ఞాన కేంద్రం, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్.



విప్లవ రచయితల సంఘం



NPVM01A101

**ARUNATARA** A Literary and Cultural Monthly Journal RNI Regn. No. 21152/72
MAY 2023 VOL:51, ISSUE : 4, VIJAYAWADA.

# అరుణతార నిర్వహణకు విరాళాలివ్వండి
# శాశ్వత నిధి ఏర్పాటుకు సహకరించండి

విప్లవ రచయితల సంఘం అధికార పత్రిక అరుణతార 1977 నవంబర్ నుండి మాసపత్రికగా వస్తోంది. సాహిత్య సాంస్కృతిక సంస్థగా విరసం, విప్లవ సాహిత్యోద్యమాల్లో నిర్వచించుకున్న తన రాజకీయ, సాహిత్య, మేధో పాత్రకు వాహికగా తెలుగు సమాజంపై ప్రభావం వేస్తున్నది. గత మూడు తరాలుగా ఎందరో రచయితల, బుద్ధిజీవుల ఆలోచనా వికాసానికి వేదికగా ఉన్నది. సాహిత్య పత్రిక అయినప్పటికీ సామాజిక, రాజకీయార్థిక, సిద్ధాంత విశ్లేషణలకు, చర్చలకు, అన్వేషణకు సృజనశీలమైన మాధ్యమంగా కొనసాగుతున్నది. నక్సల్బరీ శిశువుగా విరసం తాను ఎంచుకున్న విప్లవోద్యమ ప్రచార కర్తవ్యంలో అరుణతార పాత్ర గణనీయం. 1970లలో ఉత్తర తెలంగాణలో విప్లవోద్యమ పునర్నిర్మాణ దశ నుంచి ఇవాళ దేశవ్యాప్తంగా సాగుతున్న విప్లవ, ప్రజా పోరాట సంచలనాలకు అరుణతార తన శక్తినంతా వెచ్చించి అక్షరబద్ధం చేస్తున్నది. మరీ ముఖ్యంగా చత్తీస్‌ఘడ్‌లో సల్వాజుడుం దుర్మార్గాలు మొదలైనప్పటి నుంచి ఇవ్వాల్టి ఆపరేషన్ గ్రీన్‌హంట్ మూడో దశ, సల్వాజుడుం రెండో దశ దాకా దండకారణ్య ప్రజాయుద్ధాన్ని, ప్రజారాజ్యాధికారాన్ని, ప్రత్యామ్నాయ రాజకీయ విధానాన్ని, అక్కడి సాహిత్య, సాంస్కృతిక వికాసాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేస్తున్నది. విశ్లేషిస్తున్నది. దండకారణ్య విప్లవోద్యమానికి సంఘీభావ హస్తాన్ని అందిస్తున్నది. ఈ పనిలో ఇతర ప్రజాస్వామిక పత్రికల పాత్ర కూడా ఉన్నప్పటికీ అరుణతార దాన్ని ఒక ప్రధాన కర్తవ్యంగా స్వీకరించింది. ఇటీవల పెరిగిపోయిన హిందూ ఫాసిస్టు ప్రమాదానికి వ్యతిరేకంగా లౌకిక, ప్రజాస్వామిక కంఠస్వరాన్ని బలంగా వినిపిస్తున్నది. వేర్వేరు సామాజిక ఉద్యమాల ఆకాంక్షలను ఎత్తిపడుతూ వాటి న్యాయబద్ధతను విశ్లేషిస్తున్నది.

ప్రజా ఉద్యమాల్లోని కార్యకర్తల సృజనాత్మక వ్యక్తీకరణలకు అరుణతార అవకాశం ఇవ్వడంవల్ల వాళ్లలోంచి ఎందరో ప్రతిభావంతులైన ఆలోచనాపరులు, రచయితలు తయారవుతున్నారు. అరుణతార ఈ పని ఆదినుంచి చేస్తున్నది. అందువల్ల ఒకపక్క లబ్ధప్రతిష్టుల రచనలతోపాటు ఎప్పటికప్పుడు కొత్త గొంతులు అరుణతారలో వినిపిస్తుంటాయి.

అయితే మొదటి నుండి అరుణతార ఆర్థిక, నిర్వహణ సమస్యలను ఎదుర్కొంటున్నది. ఒక్కోసారి ఈ ఇబ్బందులు కాస్త తక్కువగా ఉన్నా, ఇటీవల తీవ్రమైన సంక్షోభాల మధ్య ఎప్పటికప్పుడు అభిమానుల, మిత్రుల అండదండలతో నడుస్తున్నది. గతంలో ఒకసారి అరుణతార విరాళాలు వద్దు.. చందాలు కట్టండనే ఆదర్శాన్ని కూడా అమలుచేసింది. అయితే నానాటికీ పెరుగుతున్న ప్రెస్ ఛార్జీలు, నిర్వహణ ఖర్చులు మోయలేని భారమయ్యాయి. దీంతో రెండు నెల్లకో సంచిక వచ్చిన సందర్భాలూ ఉన్నాయి. అయితే పేజీలు పెంచి పాఠకులకు మరిన్ని రచనలు అందిస్తూ వచ్చాం. ఈ అన్ని అనుభవాల దృష్ట్యా అరుణతారకు శాశ్వత నిధి తయారు చేయకుండా ఇక పత్రికను నాలుగు కాలాల పాటు నడపడం అయ్యేపని కాదని తేలింది. ఇంత కాలం అభిమానుల సహకారంతోనే నడుస్తూ వచ్చిన అరుణతార ఈసారి శాశ్వత నిధి కోసం మీ ముందుకు వచ్చింది. ఇవాళ ఉన్న విప్లవోద్యమ ప్రత్యేక పరిస్థితుల్లో అరుణతార అవసరం ఎంత ఉన్నదో పాఠకులకు తెలుసు. తెలుగు నేల మీద, దేశంలోని ఇతర ప్రాంతాల్లో, విదేశాల్లో ఉన్న అసంఖ్యాక విప్లవాభిమానులు తలా ఒక చేయి వేస్తే శాశ్వత నిధి సమకూరడం కష్టమేమీ కాదని మా నమ్మకం. దాంతోనే మీ ముందుకు వచ్చాం. విప్లవోద్యమ రాజకీయ, సాంస్కృతిక వేదిక అరుణతారకు మీవంతు విరాళాలు ఇవ్వాలని, ఇప్పించాలని కోరుకుంటూ...

అరసవిల్లి క్రిష్ణ (విరసం అధ్యక్షులు), రివేరా (విరసం కార్యదర్శి)
వరవరరావు, టి.కృష్ణాబాయి, సిఎస్ఆర్ ప్రసాద్, జి.కళ్యాణరావు, వి.చెంచయ్య, అల్లం రాజయ్య,
ఎం.రత్నమాల, కాశీం, పాణి, పి.వరలక్ష్మి, రాంకీ

**చందాలు, విరాళాలు పంపాల్సిన చిరునామా :**

అరసవిల్లి క్రిష్ణ, 6-1/16-7ఎ/1, పెద్దిరాజు స్ట్రీట్, ప్రైజర్‌పేట, విజయవాడ-520001

చెక్కులు/డ్రాఫ్టులు/ఆన్‌లైన్‌లో పంపడానికి :

**A. Krishna, Bank : State Bank of India, A/c. No. 52018355595, IFSC : SBIN0020714, Branch : Vagu Center, Vijayawada**

If undelivered please return to:
**ARUNATAARA**
6-1/16-7A/1, Peddiraju Street
Prizer peta, Vijayawada - 520 001
Andhrapradesh

TO
Mr/Mrs. Varaprasada Rao
201, Old Rajarajeswara Rd
Vijayawada - 520001

EDITED BY ARASAVILLI KRSIHNA. PRINTED, PUBLISHED AND OWNED BY DUVVURI VENKATA RAMA KRISHNA RAO. PRINTED AT VISALAANDHRA VIGNANA SAMITHI, CHANDRAM BUILDINGS, CHANDRA RAJESWARA RAO ROAD, MACHAVARAM ( VIJAYAWADA - 520 004, ANDHRAPRADESH STATE (New Declaration Filed), PUBLISHED AT 6-1/16-7A/I, PEDDIRAJU STREET, PRIZER PETA, VIJAYAWADA - 520 001, ANDHRAPRADESH STATE, EDITOR : ARASAVILLI KRISHNA

